# మాటా మంతీ

# అవీ : యివీ

(ఇంగ్లీషుకు తెలుగు)





రచన :

గురజాడ అప్పారావు

సంకలితము :

అవసరాల సూర్యారావు



విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవాడ

# పీఠిక

విశాలాంధ్ర ప్రచురణాలయంవారు, తాము ప్రచురించనున్న గురజాడ అప్పారావు పంతులుగారి రచనల సంపుటికి నన్ను పీఠిక వ్రాయవలసినదిగా కోరి నా పట్ల గౌరవం చూపినందుకు వారికి మిక్కిలి కృతజ్ఞుణ్ణి. కాని యీ కార్యం నిర్వర్తించడానికి నాకాట్టే అర్హతలు లేవు ఈ సంపుటి ఎవరిని జ్ఞాపకం చేసి మనల్ని పులకితహృదయులను చేస్తున్నదో, ఆ మహారచయితతో నాకు పరిచయం వుండేది. పరిచయమే కాదు. సన్నిహిత సంబంధం వుండేది. అందుకని కాబోలు, నన్ను పీఠిక వ్రాయమని ప్రచురణాలయంవారు ఎన్నిక చేసి వుంటారు.

ఇదివరకు ముద్రితమైన ఇంతవరకు ముద్రితంకాని గురజాడవారి అన్ని రచనలను సంపుటాలుగా వెలువరించాలన్న విశాలాంధ్ర ప్రచురణాలయంవారి సంకల్పం మహత్తరమైనది; ఇంతకు పూర్వం ఏ కవీ, ఏ తాత్వికుడూ వ్యక్తం చేయని అత్యున్నత భావాలు అభివ్యక్తమైవున్న అప్పారావుగారి రచనలు ఇన్నాళ్ళూ అటు ఇటూ చెల్లాచెదురైవున్నవి. వాటి నన్నిటిని వొకచోట సంపుటీకరించి ప్రచురిస్తున్న విశాలాంధ్ర ప్రచురణాలయంవారు, ఆంధ్ర ప్రజలకు, విశేషించి సాహితీపరులకు ఎనలేని సేవచేసిన వారౌతున్నారు. వారికృషి బహుప్రశంసనీయం.

ఒక రచయిత ఆత్మస్వరూపాన్ని అవగతం చేసుకుందుకు అతని అన్ని రచనలను వొక క్రమపద్ధతిలో పఠించడం

చాలా మంచిది. ఈ పద్ధతి పఠనం, రచయిత క్రమపరిణామ వికాసాలను తేటపరుస్తుంది. అప్పారావు పంతులు గారి ఆత్మ స్వరూపాన్ని చక్కగా అవగతం చేసుకొందుకు ఈ సంపుటాలు దోహదపడతాయి. అప్పారావుగారు ఆంగ్లములో వ్రాసుకున్న డైరీలు, లేఖలు తదితర రచనలు బహుఉపయుక్తమైనవి. వాటిని క్షుణ్ణంగా అవగతం చేసుకుని అందున్న భావాలను మననంచేసుకుని ఎంతమాత్రం చెక్కుచెదరనీయక అతి నైపుణ్యంతో దక్షతతో సరళ వ్యావహారిక భాషలో నా యువమిత్రుడు శ్రీ అవసరాల సూర్యారావు అనువదించాడు. అతనికి నా శుభాకాంక్షలు.

నా స్వస్థలం నెల్లూరు; వంగోలు. 1903 లో నేను వంగోలులో మెట్రిక్యులేషను ప్యాసయి 1904 లో ఉన్నత విద్యను అభ్యసించడానికి విజయనగరంవెళ్ళాను. అక్కడ 1908 వరకువుండి నా విద్యను పూర్తిచేసుకొన్నాను. అప్పుడు 1906 లో తలవనితలంపుగా అప్పారావుపంతులుగారి పరిచయ భాగ్యం నాకులభించింది. మా ఆర్థికపరిస్థితి అంత బాగుండలేదు. అప్పారావుపంతులుగారికి మాతండ్రిగారంటే గౌరవం. దాన్ని పురస్కరించుకొని నా చదువునిమిత్తం, రీవాసర్కారు సహాయం లభించేటట్టు చూస్తానని ఆయన మా తండ్రిగారికి వాగ్దానమిచ్చారు. మా తండ్రిగారు వకనాడు నన్ను పంతుల వారి వద్దకు తీసుకువెళ్ళి ముచ్చటించగా, ప్రతిఉదయం ఏడుగంటలనుంచి పదిగంటలవరకు తమయింటికివచ్చి తాము చెప్పేపని శ్రద్ధగాచేస్తూవుండమని పంతులుగారు నన్నాదేశించారు. ఆమర్నాటినుంచి నేను వేళతప్పక వారియింటికివెళుతూ

వుంటిని. వారివద్ద తెలుగు సంస్కృతగ్రంథాలు, మనదేశపు శిలాశాసనాల రికార్డులుమూడు నాలుగు బీరువాలలోవుండేవి. ఈ గ్రంథాలను చదివి అందు పేర్కొన్న వంశములను వివరముగ వ్రాసి, అందలి పద్యాలను ఇంగ్లీషున అనువదించి వాటిని అచ్చొత్తించడం నా పనిగా పంతులుగారు నిర్ణయించారు. ఆంధ్రకవులువ్రాసిన ప్రబంధాలలో కృతికర్త కృతిపతుల వంశావళులను తెలిపే పద్యములను చదివి, అందున్న చారిత్రకవిషయాలను విడదీసి శిలాశాసనములలో పేర్కొన్న రాజుల మంత్రుల జీవితకాలములవల్ల ఆంధ్రకవులయొక్కయు, వారి పోషకులైన రాజులయొక్కయు కాలనిర్ణయము చేయమని పంతులుగారు నన్నుకోరారు. వీటిని ఏవిధంగా పరిశీలించాలో, మార్గముచూపి నాచేత పనులు ప్రారంభింపచేసి వదలివేసినంతనే, నేను ఆ పనులన్నీ అతిత్వరగా పూర్తిచేస్తూ వుండేవాడిని. నేముచేసిన ఆంధ్రకవుల కాలనిర్ణయానికి అంతకుముందు శ్రీ కందుకూరి వీరేశలింగముపంతులుగారు వ్రాసి ప్రచురించిన కవులచరిత్రలోని కవుల కాలనిర్ణయానికి భేదం పొడకట్టింది. ఆంధ్రకవుల చరిత్రను నిర్దుష్టంగా సమగ్రంగా వ్రాసి ప్రచురించాలని అప్పారావుపంతులుగారి ఆశయం. ఈఆశయంతో వారనేకవిషయాలను సేకరించారు; నాచేత పలు పరిశీలనలు చేయించారు. అందువల్ల నావిద్యార్థిదశలోనే పెక్కుఉద్గ్రంథాలను నేనుచదవగలిగాను. అంతకుమునుపే ఆంధ్రాంగ్లసాహిత్యాలంటే విశేషశ్రద్ధవున్ననాకు, ఆయనసాహిత్యపరిశోధనాగారంలో కృషిచేయడం చెప్పలేనంత ఉత్సాహం కలిగించింది. ఆయనవల్ల నేనుపొందిన శిక్షణ ఎంత ఉత్కృష్టమైనదో, నేను పట్టభద్రుడనై కాకినాడ కళాశా

లలో ట్యూటరుగా లెక్చరరుగా చేరిన తరవాత నాకు బాగా తెలియవచ్చింది. ఆయన సాహచర్యం నన్నొక జిజ్ఞాసాపరునిగా సహృదయునిగా సాహితీపరునిగా తయారుచేసింది. ఆయన శిక్షణ అటువంటిది. అది నాకే ఆశ్చర్యం కలిగిస్తున్నది.

ఆరోజులలో నేను అప్పారావుగారి వెంట ఎప్పుడూ వుండేవాణ్ణి. సాహిత్యవేత్త అంటే ఇలాగవుండాలని నేనాయనొక ఆదర్శమూర్తిగా భావించుకునేవాణ్ణి. ఆయన నాకొక ఆరాధ్య దేవతాపురుషునివలె కనిపించేవారు. నాతోటి విద్యార్థులు, మాయిరువురి సన్నిహితత్వాన్ని జాన్సన్ బాస్వెల్‌ల సన్నిహితత్వంతో సరిపోల్చుతూ వుండేవారు. రూపంలో జాన్సన్‌వలె అప్పారావుగారు విలక్షణంగా కనిపించే వారన్నమాట నిజమేకాని, ఇద్దరికీ పోలికలేదు. జాన్సన్ ఎంతలావుగా వుండేవాడో ఈయన అంత సన్నంగా వుండే వారు. నావలె ఆయన్ని బాగా ఎరిగిన వ్యక్తులు ఇప్పుడు చాలా తక్కువమంది వుండవచ్చును. 1936 ఫిబవరి 27వ తేదీన 'ది హిందూ' దినపత్రికలో ఆయన్ని గురించి నేను వ్రాసిన ఈదిగువ వాక్యాలలో అతిశయోక్తి ఎంతమాత్రం లేదు. "అతి బక్కపల్చటి మనిషి. తరుచు రెండుమూడు చొక్కాలు, ఒకటిరెండు కోటులు తొడుక్కునేవారు. అంత సన్నంగావున్నా ఆయన ఆరోగ్యం చక్కగావుండేది. అద్భుతమైన ప్రతిభావంతుడు." తనకు ముప్ఫయి అంగుళాల చుట్టు కొలతగల బెల్టు కావలసివుందని ఆయన తన డైరీలలో వొక చోట వ్రాసుకున్న పంక్తులను గమనిస్తే అప్పారావుగారెంత సన్నని మనిషో పాఠకులు యిట్టే ఊహించుకో గలుగుతారు.

పంతులుగారు సదా హాస్యప్రసన్నులుగా వుంటూవుండేవారు; జీవితంలో దేనినైనా ఏసంఘటననైనా రాగద్వేషాల కతీతంగా వీక్షిస్తూ ఏకష్టాన్నైనా నవ్వుతూ స్వీకరిస్తూ ఆహ్లాదంతో కాలం గడిపారు. ఈవిషయం ఆయన లేఖలను డైరీలను చదివినపుడు మనకు తేటతెల్ల మాతుంది.

అప్పారావుగారు సంస్కృత ఆంధ్ర ఆంగ్ల భాషలలో గొప్ప పండితులు. దేనినైనా ఆయన విమర్శగా పఠించేవారు; నిశితంగా పరిశీలించేవారు. ఎక్కడికక్కడ హేతువాద దృష్టితో పరిశీలిస్తూ ఎప్పటికప్పుడు విషయబద్ధంగా ఆలోచిస్తూ కూలంకషంగా చర్చలు సాగించేవారు : "స్వతస్సిద్ధములైన సంగతులను నీవు దాచవద్దు. మభ్యపెట్టవద్దు. డాక్టరు రోగికి శస్త్రచికిత్స చేసినట్లుగా సంఘవిషయాలలో రుగ్మత వున్నచోట్ల కత్తి తీసుకొని, లోతుగాకోసి అందున్న వివిధ భాగాలను విడదీసి పరీక్షించు" అని నాకొక లేఖలో వారు బోధించారు. ఆయన తన కాలపు ఆధునిక శాస్త్రముల సారమును గ్రహించిన రచయిత; ప్రాచీన సాహిత్యాన్ని మథించిన, సమకాలిక సారస్వతాన్ని తరచి చూచిన వ్యక్తి. సామాజిక జీవితాన్ని శాస్త్రీయ దృక్పథంతో అవలోకించడం ఆయన అలవాటు : "జంతుజీవితానికి వ్యతిరిక్తమైనది మానవ జీవితం. సృష్ట్యాదిగా మానవజీవితం పొందిన వివిధ పరిణామాలను తెలిపేది మానవపరిణామశాస్త్రం. ఆ శాస్త్రవిమర్శప్రపంచంలో అధికమాతున్నకొద్దీ కాలానుగుణంగా సాంఘిక భావాలు మార్చుకోవలసిన ఆవశ్యకత ఏర్పడింద"ని నాకు వ్రాసిన ఉత్తరంలో అనేక విషయాలను వివరించారు. ఆయన రాబోయేకాలాన్ని వీక్షించ గలిగిన ద్రష్ట. గొప్ప తాత్వికుడు.

"ఆధునిక మహిళలు చరిత్రను తిరిగి రచిస్తార"ని ఆనాడే ఆయన వ్రాసిన వాక్యం నేడు అక్షరాలా నిజమవుతున్నది "ఏనాడు బౌద్ధమతం భారతదేశంనుంచి తుడిచిపెట్టబడిందో ఆనాడే భారతదేశం మతవిషయిక ఆత్మహత్యను కావించుకొన్న"దన్న ఆయన వాక్యం నిగూఢమైన తాత్విక అర్థాన్ని ద్యోతకం చేస్తోంది.

ఆ కాలంలో అప్పారావు పంతులుగారికిని నాకును జరిగిన ఉత్తరప్రత్యుత్తరాలు నా జీవితంలో నేను గర్వంతో చెప్పుకోతగిన భాగంగా ఎంచతగి వుంది. ఉత్తరములద్వారా పంతులుగారు నాకెన్నో విజ్ఞానవిషయాలను ఉపదేశించారు. సారస్వత విమర్శలో విశేష నైపుణ్యంగల ఆయన, నన్నట్టి విమర్శ నేర్చుకొమ్మని అనేకమార్లు ప్రోత్సహించారు. ఉత్తరములనువ్రాసి ఈవిద్య నాకు అలవడడానికి తోడ్పడ్డారు.

1906 సంవత్సరానికి పూర్వమే అప్పారావు పంతులుగారి పరిచయ భాగ్యం నాకు లభించివుంటే, ఎంతో బాగుండును. కాని దురదృష్టవశాత్తూ నాకాభాగ్యం లభించలేదు. అయితే అంతకు పూర్వం ఆయన జీవితం ఎలా గడిచిందీ, ఏయే విషయాలపై ఆయనదృష్టి ప్రసరించిందీ 'మహాకవి డైరీలను' చదివి చక్కగా గ్రహించ గలిగాను. దేశమును ప్రేమించుమని, మానవుని ప్రేమించమని ప్రబోధించిన ఆయన మేధాశక్తి ఎలాంటిదో, పారదర్శికమైన ఆయన 'చూపు' ఎటు లగ్నమైనదో, ఏయే ఉన్నత పథాల ఆయనభావం విహరించెడిదో, నాకీసంపుటి తేటపరిచింది. ఇలాంటి సంపుటాలను వెలువరిస్తున్న విశాలాంధ్ర ప్రచురణాలయంవారు అభినందనీయులు!

—పంగోలు ముని సుబ్రహ్మణ్యం.

# 1

## మహాకవి జననం*

వెలుగు నీటను గ్రుంకె చుక్కలు
చదల చీకటి కదలబారెను
యెక్కడనో వొక చెట్టుమాటున
నొక్క కోకిల పలుకసాగెను.

మేలుకొలుపులు కోడికూసెను
విరులు కన్నులు విచ్చిచూసెను
ఉండీ ఉడిగియు ఆకులాడగ
కొసరెనోయన గాలివీచెను.

---

* గురజాడవారి పూర్వీకులది, కృష్ణాజిల్లా గన్నవరం తాలూకా గురజాడ అనేగ్రామం. అప్పారావుగారి ప్రపితామహులు పట్టాభి రామయ్య గారు. ఆ కాలంలో ఫ్రెంచివారివద్ద ద్విభాషిగా వుంటూ భారీ వ్యాపారం చేస్తున్న శ్రీనాధునివారివద్ద ఉద్యోగిగాచేరి పట్టాభి రామయ్యగారు మచిలీ పట్టణంలో స్థిరపడ్డారు; శ్రీనాధుని కోదండరామయ్య గారి కుమార్తెను వివాహం చేసుకున్నారు. పట్టాభిరామయ్యగారికి నలుగురు కొడుకులు. పెద్దకొడుకు సీతాపతి. ఆయనకు యిద్దరు కుమారులు. మొదటివాడు వెంకటరామదాసు. ఆయన జ్యేష్టపుత్రుడు గురజాడ అప్పారావు పంతులుగారు.

స్వస్తిశ్రీ దుందుభినామ సంవత్సర భాద్రపద శు ౧౩ ఆదివారం జననం - హూణ: 30-11-1861. మఖానక్షత్ర ౪వ చరణం. కర్కాటక లగ్నం. జన్మకాల కేతుమహర్దశ.

| | | | |
|---|---|---|---|
| కు | | | కే |
| | రాశి | | ల |
| | కుండలి | | చశు |
| రా | | బు | రగు శ |

| | | | |
|---|---|---|---|
| | రా | | గు |
| ర | నవాంశ | | చ |
| శ | కుండలి | | |
| | కు | కే బు | శు |

వెంకటరామదాసు పంతులుగారి కుశాగ్రబుద్ధిని చూసి మచిలీపట్టము కలెక్టరు, విజయనగరం సంస్థానంలో ఆయనకు ఉద్యోగం యిప్పించారు. మొదట ఆయన చీపురుపల్లి సమీపంలో వున్న కుమరాం తాణాలో గుమాస్తాగా చేరారు. తరవాత అక్కడ కొంతకాలం పేష్కారుగా పనిచేశారు. మరికొంతకాలానికి జలంత్రా ఎస్టేటు అమీనుగా, పిమ్మట శృంగవరపుకోట సర్కిల్ సూపర్ వైజరుగా, ప్రమోషను పొందారు. వార్ధక్యదశలో తన కుమారునితో విజయనగరంలో స్థిరముగా వుండవలెనని కోరినందున, మహారాజా ఆయన్ను కోట ఖిల్లేదారుగా నియమించారు. ఆయన 1902 వరకు ఉద్యోగముచేసి పింఛనీ తీసుకున్నారు.

వెంకట రామదాసుగారు కుమరాంతాణాలో ఉద్యోగిగా వుంటున్న కాలంలో వారికి వివాహమయింది. భార్య 'కౌసల్యమ్మ' గొదవర్తి కృష్ణయ్యపంతులుగారి కుమార్తె. వారి ఊరు విశాఖపట్టం జిల్లా, ఎలమంచిలి తాలూకా, రాయవరం. కృష్ణయ్య పంతులుగారు ఎలమంచిలి మునసబు కోర్టులో సిరస్తదారు. అయినా వారి కుటుంబము రాయవరము

లోనే వుండేది. రాయవరం గ్రామంలో మాతామహులయింట, దుందుభి నామ సంవత్సర భాద్రపద శుద్ధత్రయోదశి ఆదివారంనాడు మహాకవి గురజాడ వెంకట అప్పారావు పంతులుగారు జన్మించారు.

వెంకట రామదాసుపంతులుగారు కుమరాంతాణా ఉద్యోగిగా వున్నపుడు అక్కడ సదుపాయము తక్కువని సమీపంలో వున్న గులివిందాడ అగ్రహారములో కాపురం వుండేవారు. అందువల్ల మహాకవి బాల్యము, గులివిందాడ, ఎలమంచిలి, రాయవరములలో గడిచింది. మాతామహుల యింట అక్షరాభ్యాసమయింది. తాత, తన మనుమనికి తమయింట కొంతకాలం చదువు చెప్పించారు. పిమ్మట తండ్రి గులివిందాడలో ఒక గురువును నియమించి, సంస్కృత ఆంధ్ర ఆంగ్ల భాషలను ఒక పద్ధతిగా చెప్పించారు. గురువు పేరు వెలివల రామమూర్తి పంతులుగారు.

మహాకవి తండ్రి రామదాసు పంతులుగారు సంస్కృతాంధ్రములలో మంచి పండితులు. తెలుగున కవిత్వము చెప్పుటకు సమర్థులు. వేదాంత జ్యోతిషశాస్త్రములలో ప్రవీణులు. పాపము, వార్ధక్యదశలో 1905 వ సంవత్సరమున విజయనగరం నెల్లిమర్ల మధ్యవున్న 'ఊటగెడ్డ'ను దాటుతూ వుండగా, ఏరు ముంచుకువచ్చి, ఆయన పరమపదించారు.



# పిల్లలు

పిల్లలకు నీళ్ళంటే సరదా. ప్రవహించే నీళ్లన్నా, ఆట లాడుకొందుకు వీలిచ్చే నీళ్లన్నా మరీ సరదా.

*　　　*　　　*

పెళ్లిళ్లు, పేరంటములు, ఉత్సవాలు ఊరేగింపులు, విందులు వినోదాలు, తీర్థాలు, రథయాత్రలు అంటే పిల్లలకు ఆనందం. ఆ వేడుకలన్నీ చూసి సంబరపడతారు. సంబరాలయి పోగానే బిక్కమొహం వేస్తారు. కళ్ల నీళ్లు పెట్టుకుంటారు.

*　　　*　　　*

పువ్వులు పిల్లలకు ఎంత ఆనందమిస్తాయనీ! పదిమంది ఎదట కొమ్మలు వొంచి, రెమ్మలు పట్టుకుని, ఆకుల సందుల్లో వెతికి వెతికి పూసిన పూలను పరుకుంటూవుంటే, పిల్లలకు అదేదో వింతగా, గొప్పగా విజయం సాధించినట్లుగా అని పిస్తుంది. ఒకరంగు తరవాత యింకొకటిగా, రంగురంగుల పూలను రకరకాల దండలుగా గుచ్చుతూవుంటే, వాళ్లకెంతో ఆహ్లాదంగా వుంటుంది!

*　　　*　　　*

చితుకులు పోగుచేసి చలిమంటలు వేసుకుని చుట్టూ కూచుని చలికాగడం అరచేతుల్ని చాపి, బుగ్గలు వొత్తుకోవడం

పిల్లల కాహ్లాదం. భోగిమంటలు సరేసరి...దిబ్బు దిబ్బు దీపావళి దబ్బుదబ్బున రావాలి.

♦ ♦ ♦

మాచిన్ననాడు మాంచెస్టరు బట్టలకుండే రెయిలు, స్టీమరు బొమ్మలు చూడడం అదొక సరదా.

♦ ♦ ♦

అనుకరణ పిల్లలకు ఎక్కువ.

♦ ♦ ♦

పిల్లలు కనిపించకపోయేసరికి తల్లిదండ్రులు కంగారు పడతారు. దిగులుపడతారు. భయపడతారు. అటు యిటు పరుగులు పెడతారు. తీరా కనిపించేసరికి పిల్లలమీద మండి పడతారు.

♦ ♦ ♦

పరాయి యింటికి వెళ్ళినపుడు పిల్లలకు అంతా కొత్తే. కొత్తచోట మసలడం ఎబ్బెట్టుగా వుంటుంది. ఎప్పుడు యింటికి వెళ్ళిపోదామా అని ఎప్పుడూ యింటిమీదనే ధ్యానం.

♦ ♦ ♦

లేనివాళ్ళ పిల్లలకు పాపం అన్నీ యిబ్బందులే. జీవితంలో వున్న వ్యత్యాసాలను అసమానతలను చూసి పిల్లలు యేమని తలపోస్తారోకదా. పిల్లలకు యిందువల్ల చెప్పలేనంత మనస్తాపం, దుఃఖం కలుగుతుంది కదూ! తోటి పిల్లలకువలె తామూ ఉన్నత స్థితి పొందేవరకు, పిల్లల మనఃక్లేశం పోదు కాబోలు!

♦ ♦ ♦

తల్లిదండ్రుల పలుకుబడిని, అధికారాన్ని, ఐశ్వర్యాన్ని చూసి, గారాబంగా పెరిగే పిల్లలు తమకు సంపద కలదనే

భావం కలగగానే, తమ డాబుదర్పాలను యితర పిల్లలచెంత చూపిస్తారు. అధికారాన్ని చలాయిస్తారు. ఇలాగే వాళ్ళని పెరగనిస్తే, తాము పిల్లలు కనక, గొప్పయింటి బిడ్డలు కనక తాము ఏంచేసినా చెల్లుతుందనుకుంటారు. పెద్దలపట్ల సైతం దురుసుగా ప్రవర్తిస్తారు. చివరకు చెడి పూరుకుంటారు.

* * *

"అలా వున్నాడు కానీ, అబ్బో! మా వాడిది మహా తెలివైన బుర్ర, మీరు చెబితే నమ్మరు కానీ..."

నమ్మడం మాటకేం కాని, అలా అని మీ పిల్లల్ని చెడ గొట్టకండి!

* * *

చిన్నప్పటినుంచి నాకు కొత్తది యేది కనిపించినా, దాని తత్వము తెలుసుకోవాలని ఆసక్తిగా వుండేది. వింతలు నాకు యిట్టే పొడకట్టేవి.*

---

* చిన్నతనంలో బొమ్మలాట నేర్చి వుండుటచేత లోకమనే రంగంలో చిత్రకోటి రీతులను ఆటాడే మనుష్యులనే పాత్రముల సొగసునే కనిపెట్టడము నాకు అలవాటైనది. సొగసులేని మనిషే వుండడు.

—చూ. మహాకవి వ్యాసచంద్రిక.



# చదువు: ఉద్యోగము

ఒకే ఒక వ్యక్తి రెక్కలమీద కుటుంబమంతా ఆధారపడినపుడు కలిగే బాధలు మిక్కుటము. తెలివితేటలువుండి ముందు ముందు రాణించవలసిన యువకులు, డబ్బులేనందువల్లనో, మరెందుచేతనో, చదువు మానుకుంటున్నారు. ఆరోజులలో డబ్బు లేక పోవడమువల్ల చిక్కులుతటస్థించినవి. ఆదుర్దినములు గడచిపోయినవి. నాచదువు పూర్తిఅయినది. *మనిషికి చీకూచింతాలేనపుడే సుఖము. ఎవరికివారు స్వతంత్రముగా జీవించుట అవసరము.

*  *  *

---

*పదిసంవత్సరములవయస్సు వచ్చువరకు, అప్పారావుగారు చీపురుపల్లిలో చదువుకున్నారు. తరవాత 1872 లో విజయనగరం మహారాజావారి ఆంగ్ల కళాశాలా ఉన్నత పాఠశాలలో ప్రవేశించారు. వాగనుశాసనులు గిడుగు రామమూర్తి పంతులుగారు ఆయన సహాధ్యాయులు. మెట్రిక్యులేషను చదువుతున్నపుడు అప్పారావుగారు ఆంగ్లమున వ్రాసిన 'కోకిల' అనుగీతమును చదివి, ఆ రోజులలో స్కూళ్ళ యినస్పెక్టరుగా వున్న నాగోజీరావుగారు, ఆనందించి, దానిని ఆనందగజపతి మహారాజావారికి వినిపించారు. ఆ గీతము ఆనందగజపతి దృష్టిని ఆకర్షించింది. అప్పారావుగారి బుద్ధికుశలతను చూసి, సి. చంద్రశేఖర శాస్త్రిగారు, వారిని తమయింట తమ చెంత వుంచుకుని, భాషాసారస్వతములను, బోధించుతూ, గట్టి పాండిత్యము కలుగునట్లు తరఫీదుచేశారు. చంద్రశేఖరశాస్త్రిగారు తమిళులు; విద్యాధికులు. వారి స్వస్థలం

విజయదశమి పండుగ. రెండు సంవత్సరముల క్రితము ఈ రోజున నాకీ ప్రస్తుత ఉద్యోగము • లభించినది. అందువల్ల నాకెట్టి మనశ్శాంతి కలిగినదో మహారాజావారికి తెలిసివుండదు. మహారాజా వారిని పరిమేశ్వరు డనుగ్రహించుగాక. సి. సి. గారి కొరకు నా ప్రార్థనలు.

---

రాయవెల్లూరు. విజయనగరం మహారాజావారి ఆంగ్ల కళాశాలకు మొదటి ప్రిన్సిపాల్•అనేకమంది విద్యార్థులకు తమయింటనే భోజనసదుపాయములు కలగచేసి జీతములేకుండా చదువు చెప్పించిన ఉదారులు. చంద్రశేఖర శాస్త్రిగారు: "అఖండ మేథాసంపత్తిగల కొద్దిమంది విద్యార్థులలో అప్పారావు వొకడు. విద్యార్థిగావుంటూ, గురువుల మన్ననలను పొందిన యువకుడు. నిరంతర సాహిత్య వ్యాసంగము అతని వ్యసనము. సహజ ప్రేరేపణవలన కలిగిన అతని కవితా శక్తి అపారమైనది. సాధనవల్ల అది ప్రకాశవంతమై, ఎప్పటికిని మనం మరువలేని కవులస్థానమును అప్పారావుకు ప్రసాదిస్తుంది. ఇందుకు సందేహములేదు. వినయము సౌశీల్యము అతని సహజ గుణములు. జీవితమున అతను అన్నిటా ఔన్నత్యమును పొందవలెనని నా అభిలాష అతని ఔన్నత్యమే నా ఔన్నత్యము. అతని ఆనందమే నా ఆనందము."

అప్పారావుగారు మెట్రిక్యులేషను పరీక్ష ప్రథమశ్రేణిలో ప్యాసయినారు. సంస్కృతము రెండవ భాషగా, తత్వశాస్త్రము అభిమాన విషయముగా ఆంగ్లమున ప్రథమశ్రేణిలో 1886 వ సంవత్సరమున బి. ఏ. ప్యాసయినారు.

• 1887 వ సంవత్సరమున విజయనగరం ఆంగ్ల కళాశాలలో నాలుగవ లెక్చరరుగా అప్పారావుగారు నియుక్తులయారు. ఆయనకు బి.యల్. చదివి, న్యాయవాదిగా రాణించవలెనని అభిలాష. కాని ఆర్థికపరిస్థితులు అనుకూలించలేదు. పట్టభద్రులు కాకమునుపు ఏప్రియలు 1, 1884 న హైస్కూలులో నెలకు పాతికరూపాయలు జీతంమీద ఉపాధ్యాయులుగా ప్రవేశించారు. అది ఆయనకు యిష్టము లేకపోయింది. పెద్ద ఉద్యోగము

సంపాదించుటకు అవకాశముంటుందని, విజయనగరం జనరల్ డెప్యూటీ కలెక్టరు కచేరీలో సర్క్యూటం హెడ్‌గుమాస్తాగా 1887 మార్చి 3 వ తేదీన చేరినారు. కాని అదీ ఆయనకు మనస్కరించలేదు. అప్పారావుగారివంటి మేధావుల ఉపజ్ఞను విద్యాలయములు వినియోగించుకొనవలెనని ఎరిగి, ఆనందగజపతి మహారాజావారు, తమ కళాశాలలో నెలకు నూరు రూపాయల జీతముమీద నాలుగవ లెక్చరరుగా నియమించారు. కాగా అప్పారావుగారు రెవిన్యూశాఖలో ఉద్యోగము చేసినది కొన్ని నెలలు మాత్రమే. కలెక్టరాఫీసులో ఉద్యోగము మానుకుని, కళాశాలలో అధ్యాపకపదవి స్వీకరిస్తునపుడు, కలెక్టరుగా వుంటున్న రావు బహద్దర్ వి. జగన్నాధరావుగారు వ్యక్తముచేసిన అభిప్రాయములు: "అప్పారావుపంతులు మంచి పండితుడు. కవి. మానవ ప్రవృత్తిని పరిశీలించడములో నిపుణుడు. సంస్కృతము చక్కగా వచ్చును. ఆయన పాండిత్యమును, హైస్కూలులో ఉపాధ్యాయునిగా ఆయన గడించిన కీర్తిని, గమనించి ఈ ఉద్యోగమునకు ఆయన అర్హుడని భావించాను. నావద్ద ఆయన ఎనిమిది నెలలు పనిచేశారు, వారి ప్రతిభావిశేషములు మహారాజావారి దృష్టిని ఆకర్షించగలిగినందుకు సంతోషం."

అప్పారావుగారు లెక్చరరుగా వుంటూ ఆనందగజపతికి వార్తాపత్రికలు చదివి వినిపించేవారు. అందుకు మహారాజా, ఆయనకు తన స్వంతద్రవ్యమునుంచి నెలకు యాభై రూపాయలిస్తూ వుండేవారు. 1891 జూన్ 22 వ తేదీన అప్పారావుగారు మూడవ లెక్చరరుగా పాతిక రూపాయలు ప్రమోషను పొందారు. ఎఫ్.ఏ; బి.ఏ; తరగతుల విద్యార్థులకు తత్వశాస్త్రము, ఆంగ్లము, సంస్కృతసాహిత్యచరిత్రము, అనువాదము, వ్యాకరణము, గ్రీకు రోమను చరిత్రలను ఆయన బోధించేవారు, కొంతకాలమునకు ఆరోగ్యము సన్నగిలింది. బలహీనతవల్ల పెద్దక్లాసులను నిర్వహించలేకపోయారు. అందువలన లెక్చరరు పదవినుండి విరమించి, సంస్థానమున శాసన పరిశోధకునిగా 1896 జూలై 5వ తేదీన ఉద్యోగమును స్వీకరించారు. ఆనందగజపతి అనంతరము వారి సోదరి రీవా మహారాణికి ఆంతరంగిక కార్యదర్శిగ 1898 జూలైలో నియుక్తులయారు.

# శంభుచంద్ర ముఖర్జీ*

రీస్ అండు రయత్ ఆఫీసు
ఆగస్టు 14, 1883

ప్రియమైన అయ్యా,

మీరు 20 వ తేదీన వ్రాసిన ఉత్తరమున్నూ, పంపిన 'ది ఇండియన్ లీజర్ అవర్' పుటలున్నూ అందినవి.

---

* డాక్టరు శంభుచంద్ర ముఖర్జీ కొంతకాలం త్రిపుర సంస్థానానికి దివాను. 1855 లో 'ది ముఖర్జీ మేగజైన్'ను స్థాపించి కొంతకాలం పోయాక 'రీస్ అండ్ రయత్'గా దానిపేరు మార్చి పత్రికా సంపాదకులుగా, ఆంగ్లభాషా పండితులుగా ప్రసిద్ధికెక్కారు. ఆయన రచనలలో "ట్రావెల్సు అండు వొయాజిస్ ఇన్ బెంగాల్" ఉత్తమ గ్రంథం. ముఖర్జీ గారంటే "ఆరోజులలో ఆంగ్ల రచనకు ప్రసిద్ధిపొందిన పురుషులు. ఆంగ్లుల రచనలలోనే తప్పులు పట్టేవారు. చాలా గ్రంథశోధన చేసినవారు. మన ఆంధ్రులలో శ్రీ రావుసాహెబు గిడుగు వెంకటరామమూర్తి పంతులు గారి వలె స్వయంకృషివల్ల నికటమైన పాండిత్యము సంపాదించినవారు. రమేశచంద్రదత్తుగారితో సహపాఠీ. పత్రికాప్రకటనమే జీవితాశయముగా గలిగి అది నిర్వహించుటకు చాలా శ్రమదమాదులు పడ్డవారు. సత్తా కన బడ్డచోటనల్లా వాత్సల్యము చూపినవారు. జనామోదమున్నూ పాలకామోదమున్నూ బడసినవారు. ఆయన పత్రికలో విమర్శ అంటే గవర్నరు జనరలుకూడా భయపడేవాడు. హిందూ మహమ్మదీయ సమస్యను సాంఘిక

'సారంగధర' నిజంగా చెప్పుకోతగ్గ కల్పన. కవికి ఎంతో గొప్ప భవిష్యత్తు వుందని అది రుజువు చేస్తున్నది. దానికి మా పత్రికలో ప్రాధాన్యమిచ్చి సాధ్యమైనంత ఎక్కువ ప్రచారం లభించేటట్లు ముద్రించాలనుకొన్నాను. అది ఏ పత్రికలో ముందు ప్రకటితమైనదో ఆ సంగతిని గుప్తంగా వుంచడం నా సంకల్పం. అందుకు నన్ను మీరు మన్నించగలరని నమ్ముతున్నాను. ఇతర పత్రికలలోని విషయాలు పునఃప్రచురించేటపుడు, మా పత్రికలో నేను నా కృతజ్ఞతను తెలియపరుస్తూ వుంటాను. అది నా అలవాటు. కాని కొన్ని పత్రికలు అలాగ కాదు. 'రీస్ అండు రయత్'లో వ్యక్తమయిన అభిప్రాయాలను, అచ్చుపడిన వార్తలను, పేరాలకు పేరాలను వ్యాసాలను కొన్ని పత్రికలు తిరిగి అచ్చువేసుకుంటూ వుంటాయి. కాని ఆ పత్రికాధిపతులు ఆ విషయం ఎక్కడా చెప్పరు. నేనుమాత్రం ఏవార్త ఇతర పత్రికలలోనుంచి ఎత్తి ప్రచురించినా నా కృతజ్ఞతను ప్రకటిస్తూ వుంటాను. అయితే 'సారంగధర' విషయంలో తద్భిన్నమైన ఆచారాన్ని పాటించడానికి ప్రత్యేక ప్రయోజనం వుంది. ఆ పద్యాల శ్రేయస్సుకోసమే, నేనిలాగ చేస్తున్నాను.

---

సమ్మేళనముద్వారా పరిష్కరించి యింగిలీషువారి పరిపాలనలో మాతృభూమికి స్వపరిపాలన తేవలెననే ఆశయము గలిగినవారు." —డాక్టర్ బుర్రా శేషగిరిరావుగారు, ఎమ్ ఏ. పి; హెచ్ డి.

• గుండుకుర్తి వెంకటరమణయ్యగారు: 1880ప్రాంతంలో విజయనగరంనుంచి వెలువడిన "ఎ ఇండియన్ లీజర్ అవర్" అనే ఆంధ్రాంగ్ల పత్రికకు సంపాదకులు. మహాకవి తమ 21 వ ఏట విద్యార్థిగా వుంటూ ఆంగ్లమున వ్రాసిన 'సారంగధర' పద్యాలను వెంకటరమణయ్యగారు తమ పత్రికలో ప్రకటించి పునఃప్రచురణార్థం వాటిని శ్రీ ముఖర్జీగారికి పంపించారు. అపుడు శ్రీ ముఖర్జీగారు, ఆయనకు వ్రాసిన ఉత్తరం ఇది.

ఇదివరకు ప్రచురితమైనవాటిని, ప్రజలు ఏమాత్రం పట్టించుకోరు. మహాకవుల పద్యాలను సైతం పత్రికలలో తిరిగి ప్రచురించినట్లయితే పాఠకులు ఖాతరు చేయరు. "ఓహో! పత్రిక కాలాలు నింపడానికా, ఈపని" అంటారు. "అంతా పాతసరుకే కదూ!" అంటూ అటు చూడనన్నా చూడరు. ఇక్కడికి ఎంతో దూరంగావున్న అన్య రాష్ట్రంలో ప్రచురిత మౌతున్న పక్షపత్రికకు దేశం మొత్తంమీద ప్రచారం వుండదు. అందులోను అది స్వభాషలో ఆ రాష్ట్రానికే పరిమితమై వున్నపుడు, విస్తృత ప్రచారం వుంటుందనే సమస్య లేనేలేదు. "ఇండియన్ లీజర్ అవర్"లో కొన్నికొన్ని భాగాలుగా అపుడపుడు ప్రచురితమైన ఈ 'సారంగధర' పద్యాలు, నిజానికి ప్రకటితం కానట్లే అనుకోవచ్చును.అందువల్ల దీనిని మా స్వాంతపత్రికకోసం వ్రాసిన కృతిగా భావించి, అన్ని అవకాశాలను కలిగించి, ప్రాధాన్య మిచ్చి మా పత్రికలో ప్రచురించాలనుకుంటున్నాను. ఇలా ప్రకటించడంలో నాకు రెండు ఉద్దేశాలున్నాయి. ఆ యువరచయితను అందరికీ ఎరుకపరచి, ప్రోత్సహించాలనుకున్నాను. ఉత్తమ శ్రేణికి చెందిన సాహిత్య రాజకీయ పత్రికలో వొక పద్యం ప్రకటించడం సాధారణ విషయంకాదు. అంతేకాక, దీనిని ముద్రించి మనవారికి వున్న సాహిత్య జిజ్ఞాస ఎట్టిదో పరిశీలించ దలుచుకున్నాను.వారి సాహిత్య వివేచనాశక్తి ఎలావుంటుందో పరీక్షించ సంకల్పించుకున్నాను. ఉత్తమ సాహిత్యాన్ని వివేచనగా చదివి గుణదోషాలను చెప్పగలవారు తక్కువ. అందులోను, కవిత్వాన్ని పరిశీలించి గుణవివేచన చేసేవారు అరుదు. ఒక భారతీయుడు ఇంగిలీషున రచించిన ఈ పద్యాలను లోకం ఎలా స్వీకరించగలదో తెలుసుకుందుకు ఆసక్తిగా వుంటుంది.

ఇకముందు, పద్యాలు ఎక్కడ ప్రచురితమైనవో, తెలిపి పాఠకులను ఆశ్చర్యచకితులను కావించడానికి కావలసినంత అవకాశం వుంది. ఈ లోపున ఇందులో వుంచిన నా వుత్తరాన్ని ఆ యువరచయితకు, మీ స్నేహితునకు యివ్వండి. ఇంకా ఇంకా వ్రాసి వృద్ధిలోకి రానీయండి. పద్యాలలో కొన్ని దోషాలు లేకపోలేదు. అయితేనేమి, అతనికి శక్తిసామర్థ్యాలున్నాయి. అతనిపేరు, వయస్సు, చదువు, కావించిన కృషి అన్ని వివరాలు తెలుసుకుందుకు నాకు కుతూహలంగా వుంది. ఈ విషయం మీకు వేరే నేను చెప్పనక్కరలేదనుకుంటాను.

* * *

*...జలపాతాలను ప్రవహించే సెలయేళ్ళను వీక్షించండి. మానవ రూపంలో అరుదుగా అందంగా గోచరించే దైవాంశమును చూడడం మరవకండి. మీ హృదయాన్ని ఇతరుల హృదయాలను పరిశీలించండి. వాటిబలాన్ని దౌర్బల్యాన్ని పరీక్షించండి. ఇతరులు సాధించిన గొప్పతనాన్ని తెలుసుకోండి; కాని ఇతరులమీద ఎన్నడూ ఆధారపడవద్దు. మీ ఆత్మశక్తిమీద మీరు విశ్వాసముంచి. అన్నివిధాల దాని వికాసానికి కృషి చేయండి.

నిరంతర పఠనం అవసరం. మీరు అన్య భాషలో వ్రాస్తున్నారుకనక ఆ భాషపై సంపూర్ణ అధికారం మీకు సిద్ధించాలి. గొప్పగొప్ప కవులు తమ భావాలను ఎలా అభివ్యక్తం చేశారో

* ఇది శంభుచంద్ర ముఖర్జీ యువరచయిత కిష్మని రమణయ్యగారి లేఖతో జతపరిచి పంపిన ఉత్తరంలోని కొంతభాగం. మహాకవికి ముఖర్జీగారు వ్రాసిన ఉత్తరములన్నీ దొరకలేదు. దొరికిన వాటిలో కొన్ని పుటలు పోయినవి పూర్తి ఉత్తరములకు చూడుడు: "An Indian Journalist" by F. H. Skrine I. C. S; published by Thacker, Spink & co, Calcutta.

ఆకళించుకోండి. భావవ్యక్తీకరణకు తగినంత శబ్దశక్తిని సాధించే వరకు మీ జీనియస్‌కు సరిపడే నూతన మార్గాన్ని అన్వేషించే వరకు, మీరు ఇతరులను అనుకరించవలసి వుంటుంది. నిజమైన ఉద్రేకంతో చిత్తశుద్ధితో వస్తువును దర్శించి మీరు దానిని వ్యక్తీకరిస్తున్నపుడు మీకు విజయం తప్పదు. ఈసారి ఉత్తరంలో విపులంగా మీకు వ్రాస్తాను. అలాగే; ప్రస్తుత వాదప్రతివాదాల మీద, ఉపశాంతిని కలిగించే ఒక సెటైరు మాకు పంపించండి.

* * *

కలకత్తా
జనవరి 27, 1884

ప్రియమైన యువకవీ,

నాకు మీరు వ్రాసిన వుత్తరాలన్నీ అందాయి. కాని నేను ఇంతకాలం మౌనం వహించినందుకు మీకు నేను క్షమాపణ చెప్పుకోవలసివుంటుంది. నిజానికి నేను తొందరపనులలో వున్నాను. మీరుకూడా గద్య పద్య పరీక్షలలో నిమగ్నులై వుంటారనుకున్నాను; అందువల్ల మీకు దీర్ఘమైన జాబులు వ్రాసి మీ దృష్టిని అన్యథా మళ్లించడం నాకిష్టంలేదు; కాని మీకొక వాగ్దానం చేస్తున్నాను. మన ఉత్తర ప్రత్యుత్తరాలు ఎప్పటిలాగ, కొనసాగుతూనే వుంటాయి. మీరు మదరాసులో ఎంతకాలం వుంటారు? అక్కడ సమాజం గురించి, మీ పరీక్షలను గురించి అన్ని వివరాలు నాకు వ్రాయండి. రాజకీయాలలో అక్కడ ప్రసిద్ధపురుషులు ఎవరు? గొప్ప స్థితిలో ఉద్యోగంలో వున్నవారెవరు? గొప్పవక్తలు

ఎవరు ? అక్కడ సాంఘిక రాజకీయోద్యమాలను గురించి నాకు తెలుసుకోవాలని వుంది. వితంతు వివాహసమస్య ఎలా వున్నది? ఈ సమస్యపట్ల అక్కడ వారి అభిప్రాయాలేమిటి ? ప్రభుత్వోద్యోగుల మన్ననలను పొందుతున్న పెద్దలు, ఇందుకు సిగ్గుపడుతున్నారా ? వితంతు వివాహాలుకూడదని వాదించేవారి హంగామాను హర్షిస్తున్నారా ? వారి ధైర్యానికి మెచ్చుకుంటున్నారా? యూరోపియనుల పట్ల అసహనం వున్నదా ? పాపం వేలేస్‌ను, గురించి వారేమంటారు !

నేను మిమ్మల్ని నెపోలియన్ ది గ్రేటువలె శరపరంపరగా ప్రశ్నలు వేస్తున్నానుకదూ. నా ప్రశ్నలకు మీరు తీరికగా సమాధానం యివ్వవచ్చును, లేదా మానివేయవచ్చును.

ఈమధ్య విజయనగరంనుంచి ఇక్కడకు కొందరువచ్చారు. "ఆయన సభ"లో వున్న నవరత్నములవంటి పండితులలోను అతి ప్రకాశవంతమైన రత్న మనదగిన మీరుకూడా వస్తారని నేను ఆశించాను. కాని మీరు రాలేదు. బహుశా మద్రాసులో పనిలో నిమగ్నులై వుండిపోయారనుకుంటాను.

* * *

...మీలో ప్రతిభవుంది. సాధనచేత ప్రకాశమానం చేసుకోవచ్చును. ఇంగ్లీషున యతిప్రాసలు లేని పద్యములు వ్రాస్తే, కవిత్వము కాదనే భావన చాలామందికి వుంది. ఆంగ్లదేశంలోనైనా మంచి సాహిత్య రచనలు చదివేవారే చాలా తక్కువ. తత్రాపీ, కవిత్వం విమర్శగా చదివేవారు మరీ తక్కువ. భారతీయులు ఆంగ్లంలో యేదో వచనం వ్రాయగలమని సాహసించ

డంతో పూరుకోక పద్యరచనలోకూడా వేలు పెడతామంటే ఇంగ్లీషు వాళ్ళకు మతిపోయి, వివేచనశక్తి పని చేయదు.

*   *   *

...నా జీవిత సంధ్యాకాలం అతిప్రశాంతంగా ఆనందంగా గడిచిపోవాలని మీరు కోరుతున్నందుకు మీకు నేనెంతో కృతజ్ఞుడను. తమ దేశశ్రేయస్సుకోసం ప్రపంచ సౌభాగ్యం కోసం పాటుపడాలనుకునేవాళ్ళు, విధిగా అనేక కష్టాలను భరించకతప్పదు. అందుకు వారు సిద్ధపడాలి.

*   *   *

......మీరు వ్రాద్దామనుకున్న రాజకీయపద్యకావ్యాన్ని ప్రారంభించారా? జానపదగేయాలు వివిధ ఛందస్సులలో పద్యాలు వ్రాయడాని కుపక్రమించండి.

*   *   *

కలకత్తా
8 అక్టోబరు 1889

ప్రియమైన శ్యామలరావు *

...చూడండి; ఆ ఇంకొక 'రావు' ఎంత పనిచేశాడో మరి! మొదట నాలో అమిత ఆసక్తిని, గాఢ అనురాగాన్ని కలిగించి, ఉత్తరాలు వ్రాయడం మానివేసి, మధ్యలో నన్ను మర్చిపోయాడు! అతని భవిష్యత్తు ఎలా వుంటుందో చూడ

---

* అప్పారావుగారి తమ్ములు. దేశాభిమాని. ప్రతిభాశాలి. విద్యార్థి దశలోనే ఇంగిలీషున పద్యములు వ్రాసి విద్యాధికుల మన్ననలను పొందినవారు, 1889 లో జరిగిన బొంబాయి కాంగ్రెసుకు హాజరై, ఉత్తేజితులై కాంగ్రెసు నిర్మాతలు హ్యూము, డబ్ల్యు. సి. బెనర్జీ, నార్టన్

కుతూహల పడుతున్న నాకు మీ మొదటి ఉత్తరం సంతృప్తి కలిగించింది. ఉద్యోగంలో చేరినాడని విని నేను ఎంతో ఆనందించాను. పరమేశ్వరుడు అతనికి అన్నివిధాల తోడ్పడుగాక! కవిత్వం వ్రాస్తున్నాడుకదా? అతని శక్తి అద్భుతం.

---

గార్లమీద పద్యములను వ్రాసి 'హిందూ' పత్రికలో ప్రచురింపించారు. ఆ పద్యముల శీర్షిక: "To the Magnificient Seditionists. హిందూలో ప్రచురితమైన శ్యామలరావుగారి పద్యములలోని గుణదోషములను విమర్శిస్తూ శంభుచంద్రముఖర్జీ, ఆయనకు ఒక దీర్ఘమైన లేఖ వ్రాశారు. ఆ లేఖలో అప్పారావుగారికి సంబంధించిన పంక్తులను మాత్రమే మీదను పొందుపరచాను. శ్యామలరావుగారికి కవిత్వమంటే ప్రీతి; రాజకీయాలలో ఆసక్తి హెచ్చు. శ్రీ ముఖర్జీగారి లేఖలోని కొన్ని పంక్తులు: "మీ వంటిశక్తివంతులైన విద్యార్థులు మా కలకత్తా విశ్వవిద్యాలయంలో వుంటే బాగుండును. ఆంగ్లభాషపై మీకుగల అధికారానికి నేను ఆశ్చర్యపడ్డాను....రాజకీయాలకు మీరు దూరంగా వుండాలని నా కోరిక. కాని అది అసాధ్యం. నేటిపార్టీ, స్థానిక రాజకీయాలకు అతీతంగా మీరు వుండలేరు. ఎప్పుడూ వాటిని అత్యంత ప్రధానంగా భావించక, వాటికి ద్వితీయస్థానం యిచ్చి, న్యాయశాస్త్రగ్రంథాలను చదవండి; ప్రభుత్వ పరిపాలనా విధానాలను తెలిపే పుస్తకాలను చారిత్రకగ్రంథాలను పరిశీలించండి."

శ్యామలరావుగారు, మదరాసు లో 'లా' చదువుతూ, విద్యార్థి దశలోనే పరమపదించారు.



# తమ్ముడూ!

విజయనగరం
**20 ఏప్రియల్ 1895**

ప్రియమైన శ్యామలరావు,

అక్కడింకా నాన్నగారు ఎన్నాళ్లుంటారు? నీకు నేను రెండుమూడు రోజులలో డబ్బు పంపుతాను. సొమ్ము ఎక్కడా జతపడకపోతే, సేవింగ్స్ బ్యాంకులోంచి డ్రాచేసి నీకు టెలిగ్రాం మనిఆర్డరు కడతాను. మీ ఒదినెకు * మూడురోజుల క్రితం మూర్ఛ వచ్చింది. కాని వెంటనే తేరుకుంది. ఇపుడు కులాసాగా మసులుతోంది. అమ్మ లేకపోవడం వల్ల నాయనమ్మకేమీ తోచడంలేదు. అక్కయ్య, పిల్లలు అంతా క్షేమంగావున్నారు. రాజమండ్రిలో శీతజ్వరం వ్యాపించి వున్నదని, మనవాళ్ళకు జ్వరాలని వెంకటచలం ఉత్తరం వ్రాశాడు. ఒదినె, దేవరాపల్లి వెళతానంటోంది. కాలేజీ మూసేక, తీసుకువెళతాను. త్వరలోనే తిరిగివచ్చేస్తాము. నాకిపుడు వొంట్లో కులాసాగానేవుంది. నారాయణమూర్తిబాబును కలుసుకుని దశావతారి అడిగి తీసుకురా. అమీనుమీద వున్న కేసు డిస్మిసయింది. వచ్చేటపుడు చింతపండు, మిరపకాయలు పట్టుకురా.

* * *

ఇల్లు : ఒక యింటిని రెండు పద్ధతులుగా మనం చూడ వచ్చును. ఒకటి, దారివెంటపోయే బాటసారి దృష్టి. రెండవది యింట నివసించే కాపురస్థుని దృష్టి. నాకు చిన్నతనంలో పరాయి యింటికి వెళ్లినపుడు ఎబ్బెట్టుగా వుండేది. బహుశా కొత్తకనక అలా అనిపించేదేమో. బొమ్మలు, ఆటవస్తువులు ఆకర్షణ కలిగించే వింతలు వుంటే పరాయిచోట అయినా, కాసేపు అక్కడ చిన్నపిల్లలకు వుండాలని బుద్ధిపుడుతుంది.

దేవరాపల్లిలో అంత పెద్ద భవంతిని మావాళ్లు ఎందుకు కట్టుకున్నారో అనిపించింది. బాటసారి దృష్టితోనే, నేను ఆ ఇంటిని చూశాను. అంత పెద్దలోగిలి ఆ గ్రామంలో అనవసరం అనుకున్నాను.

కాని తీరా ఆ యింట నేను వుండబోయేసరికి, అంత 'యిమ్మొ' సహజంగానూ. తప్పక వుండవలసినదిగానూ, అని పించింది. ఏ గదీ అనవసరం అనిపించలేదు. అంతా అవసరంగానే కనిపించింది.

* * *

---

ఇది తమ్ముడు శ్యామలరావుగారికి: అప్పారావుగారు వ్రాసిన ఒక లేఖ.

* పట్టభద్రులయిన తరవాత అప్పారావుగారికి వివాహమయింది. అత్తవారి ఊరు, కొత్తవలస సమీపంలో వున్న దేవరాపల్లి. మామగారు ఎల్లాప్రగడ సన్యాసిరాజుగారు. ఆయనకు ముగ్గురు కుమారులు, ముగ్గురు కుమార్తెలు. పెద్దకుమార్తె పేరు అప్పలనరసమ్మగారు. ఆమె అప్పారావు గారి సతీమణి.

మనమీద ఆధారపడ్డవాళ్లమీద మనకు నమ్మకం వున్న వాళ్ళమీద మనల్ని నమ్మినవాళ్ళమీద సహజంగా మనకు అనురాగం ఏర్పడుతుంది.

* * *

ఎవళ్ళనైతే మనం మనసార ప్రేమిస్తామో వాళ్ల బాగోగులు తెలుసుకుందుకు మనం ఆతృత పడతాము. వాళ్లు దూరంగా వున్నపుడు మనమనసు పరిపరి విధాల పోతుంది. 'వాళ్ళకేమీ ప్రమాదం జరగలేదుకదా' అని మనల్ని మనమే ప్రశ్నించుకుంటాము. ఒక్కొక్కపుడు ఏవో భయాలు కలుగుతాయి.

ఒకసారి నేనూ, నాన్నగారూ చీపురుపల్లినుంచి విజయనగరం వస్తున్నాం. దారిలో గరివిడి దగ్గర నాన్నగారు బండి ఆపమన్నారు. బండి ఆగింది. దాహం వేస్తోందని ఆయన బండి దిగారు. దగ్గరలోవున్న చెరువుచెంతకు వెళ్లారు. వెళ్లిన మనిషి రావలసిన టైములో రాలేదు; కొద్దిగా ఆలస్యమయింది. నాన్నగారింకా ఎందుకు రాలేదోనని నా మనసు పరిపరి విధాల పోయింది. ఎవరి జాగ్రత్తవారికి తెలుసునని అందులో ముఖ్యంగా వృద్ధులు మరీ జాగ్రతపడతారని నాకాక్షణంలో తోచక పోయింది.

* * *

డబ్బులేకపోతే అన్నీ యిబ్బందులే. దారిద్ర్యం మనిషిని కృంగదీస్తుంది. అది పట్టించనిమార్గం వుండదు. మా గురువుగారు నిరుపేద. అనేక అవస్థలుపడి మరణించారు; పాపం!

ఆయనకి జీవితంలో అనేకకష్టాలు కలిగాయి. ఒకసారి యిక యిబ్బంది పడలేక 'సి. హెచ్' గారిని పదిహేనువందలు

బదులు యిమ్మని నోరువిడిచి అడిగారు. ప్రాధేయపడ్డారు ఆయన 'సరే' అన్నారు. మా గురువుగారు తన కష్టాలు గట్టెక్కుతాయని ఆశించారు. ఇంతలో ఒకాయన, మా గురువు గారివంటి దీనునికి అప్పు యివ్వడం మంచిదికాదని 'సి.హెచ్' గారికి సలహాయిచ్చాడు. అంతే, మా గురువుగారికి మరి రుణం పుట్టిందికాదు.

దారిద్ర్యం ఎంతహేయమైనదో ఆ రోజులలో నేను గ్రహించాను.

* * *

పనిమీదనే నాకు ధ్యానం. పరిపూర్ణ విశ్వాసం. పనీ పాటూలేకుండా బాగుపడాలనుకునేవాళ్ళమీద నాకు సాను భూతి వుండదు. నిరంతరం పనిచేయడం నాకొక అలవాటు. పనికి పనే పరమావధి. ఫలితంమాట తరవాత.

* * *

మేనమామ కృషిచేయకుండా ఫలితం దక్కాలంటాడు. అతనికి పని అంటే అరికాలు మంట. చిత్రమైన వ్యక్తి.

* * *

చరిత్రలో మరుగుపడిపోయిన విషయాలను, పురాతన చారిత్రకపురుషుల జీవితమును, నాడు మసలిన పాత్రల పూర్వా పరాలను తెలుసుకోవాలని నాకభిలాష.

♦ ♦ ♦

వయసులోనో పదవిలోనో నాకంటె అధికులనో లేక 'మన గురజాడ'వారనో, దగ్గర బంధువులనో, ఆయా వ్యక్తుల వద్ద అనవసరంగా అణకువతో వుంటున్నానా? ముఖ్యంగా అభి

ప్రాయభేదాలు వస్తాయని, నా అభిప్రాయాలు వ్యక్తం చేయడం లేదేమో! అలా అయితే నా వైఖరి ఎంతవరకు సమర్థనీయం ?

• • •

ఎందుకాయన అంతమందికి రికమెండుచేస్తారు?

* * *

మహారాజావారు ఎందుకలాగ మనుష్యుల్ని బలవంతం చేయడం ?

* * *

ఇతరులకు రికమెండుచేసి పనులు చేయించుకుని కొందరు తాము అపుడూ సమర్థులమనిపించుకుంటూరు. తాము చేయవలసి వచ్చేసరికి అసాధారణ పరిస్థితులవల్ల వీలుపడలేదని నేర్పుగా తప్పించుకుని యిపుడూ సమర్థులమనిపించుకుంటూరు. వాళ్లెపుడూ నేర్పరులే !

* * *

హోల్కారు మహారాజావద్ద దివానుగానో, కార్యదర్శిగానో పనిచేయడానికి నన్ను పంపించమని శ్రీ సింగ్జీ అన్నారు. "ఆయన తనపనిని తాను చక్కగా చేసుకుంటూ మహారాజాను మెప్పించగలర"ని ఆనందగజపతి నవ్వుతూ అన్నారు.

* * *

తెల్లవారుజామునే లేచి దుస్తులు వేసుకుని జోదుపూరు నుంచి వచ్చిన యువరాజా అర్జునసింగును కలుసుకుందుకు మోతీమహాలుకు వెళ్ళాను. కృష్ణసాగరం వద్ద షికారీపర్పాట్లు చేయమని ఉత్తరువులు అందాయి. షికారీకి కావలసిన బందో

బస్తు చేయవలసినదని బోనంగి గజపతినగరం అమీనులకు హుకూములు వెళ్ళాయి. గోపాలపల్లి, వెదురువాడలకు హాంగు దారులు వస్తారు.

అర్జునసింగు వద్దకు నాతోపాటు 'జా. మే'గారు వచ్చారు. 'జా. మే' నన్నుచూసి యిలా ప్రశ్నించారు: "ఇప్పుడు మీరేం చేస్తున్నారు?"

"హుజూర్ వద్ద పని చేస్తున్నాను."

"ఇక్కడకొచ్చి మీరెందుకు పని చేయకూడదు. మీ మంచికోసం చెబుతున్నాను. లోపలేదో దురుద్దేశం పెట్టుకుని నేను చెప్పడంలేదు. ఆఫీసుకి మీరు పెందరాళే రాకపోతే చిక్కుల్లో పడిపోతారు. ఆనక చెప్పేను కానంటారు. మీకొంప మీదికి వస్తుంది."

ఆయన ఆఫీసులో పగలూరాత్రీ పని చేయలేనని చెప్పాను. "మేడ ఎక్కుతూ దిగుతూ అటూయిటూ పరిగెత్త డానికి శక్తివుంది కాని, ఆఫీసులో పని చేయడానికి మీకు వోపిక లేదన్నమాట?" అని ఆయన నన్ను ప్రశ్నించారు.

రోజూ ఏ వొకటి రెండుసార్లో అటుఇటు పరిగెత్తడం కంటె, ఆఫీసులో సహస్రాధికం కష్టంగా వుందన్నాను: "అదీ కాక ఆనందగజపతి మహారాజావారు, నాకు కొన్నిపనులు నిర్దేశించారు!"

"సరిసరి! చనిపోయిన మహారాజా ఆజ్ఞలు కొనసాగించడం! మాకూమాకూ ఎప్పుడూ యిష్టాపత్తే. మీ క్షేమం కోరి చెబుతున్నాను వినండి. ఆఫీసుకు రండి. పనిచేయండి. తెలివైన వాళ్ళనిపించుకోండి. మంచీచెడ్డా ఆలోచించండి."

"ఏపని మంచిదో ఏది చెడ్డదో నేను చెప్పడం ఎందుకు? మంచిచెడ్డలు లోకం చెబుతుంది. కాలం నిర్ణయిస్తుంది. భవిష్యత్ వుందికదా !"

'జా. మే' గారు జిత్తుల్లో ఆరితేరిన మనిషి. తాను యేం మాటాడినా యితరుల క్షేమంకోసం; ఏంచేసినా మన బాగు కోసం. అలా అంటూనే అవతలివాడిని లబ్జుచేసి పనులుచేయించుకుంటాడు. ఆయనది శుక్రనీతి. ఋజుమార్గం కాదు. అంతా కౌటిల్యం. ఆశలకు అంతూపొంతూ లేదు. పెద్దకుండలకు ఎసళ్ళు. తనవంటి ధీమంతుడు నభూతో నభవిష్యతి! చిత్తం బత్తెం అంటూ అంటకాగి తిరిగేవాళ్ళకి ఉపకారం; లేనివాళ్ళకి అపకారం.

చిత్తంబత్తెం అనడం మనకు మొదటినుంచీ అలవాటు లేదు!

* * *

హిందూపత్రికా సంపాదకులు శ్రీ జి. సుబ్రహ్మణ్యము గారు, నేను, విజయరాఘవాచారిగారు, ఇండోరు హోల్కారును చూడవెళ్ళాము. అయన ఒక పెద్దకుర్చీలో ఆసీనులై వున్నారు.

హోల్కారు, తమకూ బ్రిటిష్ ప్రభుత్వమునకు గల అధికారములను గురించి ప్రసంగించారు.

"మీరు సివిల్, క్రిమినల్ అధికారాలున్న గొప్ప వ్యక్తులు" అని మేమన్నాం.

"మేమెంత? అంతా గవర్నమెంటుదే!"

భవనము పురాతనపుది. మూడవ అంతస్థుకి మమ్ము ఆహ్వానించి ఒక గదిలోనికి తీసుకువెళ్ళినారు. గది చిన్నది. మేము తివాసీమీద కూర్చున్నాము.

నన్ను చూపించి హోల్కారు యిలా అన్నారు: "మద్యం సేవిస్తారా?"

"ఉహు! డబ్బు ఖర్చవుతుందనే భయంవల్ల ఆయన మద్యం సేవించరు!" అన్నారు సుబ్రహ్మణ్యముగారు.

♦ ♦ ♦

సన్నపట్టుబట్ట పొడుగుగా పరచి దానిమీద రాజులు కూర్చుందురు. అన్నము గుండువలె పెట్టుదురు. అవిరెళి గది నిండా నాగబలి కుండలు తట్టలు. స్త్రీలు ఒకవైపు గదులలోవుండిరి.

ఆ 'ఆతా'లోకి శ్రీ సర్కారువారు వెళ్ళి "మీరుఅంతా భోజనము చెయ్యండి. వేగిరం కానీయండి. మాకోసం కనిపెట్టుకుని వుండనక్కరలేదు" అని శలవు యిచ్చినారు. ఆ ఆతా అరుగుమీద శూద్రస్త్రీల వెనుకదాగి కొందరు బ్రాహ్మణ స్త్రీలు, వుత్సవమును, శ్రీ సర్కారును తొంగి తొంగి చూస్తూ వుండిరి. సొగసుగనున్నవారు నా కన్ను తారసిలగానే వెనుకకు జరిగిరి.

వచ్చినవారిలో కల్లా చింతలపాటివారు ఆకుపచ్చని పగిడీలతో యింగ్లీషు కట్‌కోటులతో విలక్షణముగా అపుపిస్తున్నారు. భారతీయ మిత్రులకు తన శుభాకాంక్షలను అందచేయడానికి మిస్టర్ స్టువర్టు వచ్చాడు. అందరితోపాటు తనూ భోగం మేళాన్ని తిలకించాడు.

మిస్టర్ స్టువర్టు కొంతసేపు ప్రసంగించాడు. రాజుల వివాహానికి తనను ఆహ్వానించినందుకు కృతజ్ఞత తెలుపుతూ

యిలా అన్నాడు: "ఇక్కడ సమావేశమయిన వారంతా గొప్ప వాళ్ళు. నేను సముద్రములో నీటిబొట్టును. మహారాజావారితో నాకు కొద్దిపాటి పరిచయం కద్దు. ఆయన ప్రసన్నహృదయులు"

తరవాత మహారాజావారు ప్రసంగించినారు. నాకు తోచినమాటలు నేను చెప్పితిని: "ప్రభువులు మంచినే కాని కులీనతను పూజించరు. శూద్రుడని శూద్రునకు అవమానంలేదు. కులీనతను పూజ చెయ్యకూడదు. కులపూజ కూడదు. కులభేద ములు పనికిరావు."

* * *

ఆనందరాజును గురించి ఎవరైనా సహజంగా వొకప్రశ్న వేయవచ్చును. ఆయన జీవితపరమావధి ఏమిటి? యుద్ధవీరునిగా రాజకీయచతురినిగా, రచయితగా ఆయనేమైనా చరిత్ర సృష్టిం చేడా? లేదు; ఆయన చరిత్రను సృష్టించలేదు. చరిత్రను, రాజ కీయ చరిత్రను సృష్టించిన హిందువులు ఆట్టేమందిలేరు.

ఆనందరాజు సాహిత్యకృషి అంతంత; అపుడపుడు వ్రాసే పద్యాలకు, వేదాంతచర్చలకు అది పరిమితం. ప్రపంచ దృష్టిని ఆకర్షించగలిగాననే ఆయన క్లెయిము, ప్రతికూల పరిస్థితుల మధ్య ఆయన పెంపొందించుకున్న గుణశీలాదులపై ప్రాతినిధ్యం వహించే ఆయన వ్యక్తిత్వంపై ఆధారపడివుంది. ఆయన తన వ్యక్తిత్వములో హిందూ ముస్లిం యింగిలీషు నాగరికతలను ప్రతిబింబింప చేసుకున్నాడు.



# ఆలోచనలు

కుర్చీలో కూచుని క్లాసులో విద్యార్థులను దండించడం అదొకసరదా. నాకూ హైస్కూలు మాస్టర్నవ్వాలని చిన్నప్పుడు వుండేది. కాని తీరా మాస్టర్నవబోయేసరికి, అంతకుముందే ఆ దిక్కుమాలిన సరదా కలగకుండా పోయింది... మునసబు నౌదామని నాకు మహా 'యిది' గా వుండేది. తరవాత లాయర్నవ్వాలని కోరిక పుట్టింది. కోర్టుల్లో చాలా కేసులు నడిపించాను. కాని లాయర్నుమటుకు కాలేదు... ఒకపుడు అనుకున్నాను కదా: "నేనేకనక అప్పర్ ఫోర్తు కాసులకు ఉపాధ్యాయుణ్ణయితేనా, ఫలితాలు అత్యద్భుతంగా వుండవూ!" నా కోరిక నెరవేరింది; కాని ఫలితాలు అత్యద్భుతంగా లేవు! *

---

* చిన్ననాటి ఒక ముచ్చట : అప్పారావుగారి కపుడు ఎనిమిదేళ్లు. తాతగారు సిరస్తాదారు. మునసబుకోర్టు యింటికి దగ్గర. తాతగారికి మన మడు అపుడపుడు ఫలహారాలు తీసుకువెళుతూవుండేవాడు. కోర్టులోఎన్నో వింతలు; మునసబంటే అందరికీ గౌరవం. ఆ హోదా వేరు. కోర్టు మూసిన తరవాత ఆవరణలో పిల్లలతో ఆయున ఆడుకునేవారు. ఒకసారి కోర్టు ఆతాలో పిల్లలు ఆడుకుంటూ, పెద్దవాళ్ళయాక తాము ఏయే ఉద్యోగాలు చేస్తారో చెప్పుకుంటున్నారు. ఒకడు మాష్టర్నవుతానన్నాడు. ఇంకొకడు తహశీల్దారునవుతానన్నాడు. మరొకడు డాక్టర్నే తానని అలాగే అభినయించాడు, అప్పారావుగారు ఏమీ చెప్పక, ఆటలు ముగిశాక, కోర్టు తలుపులమీద "జి. వి. అప్పారావు, బి. ఏ. బి. యల్; జిల్లా

ఒకానొకపుడు, మాటవరసకి - ఉత్తి మాట వరసకే- నిజంగా అవుతానని కాదు- డెప్యూటీ కలెక్టరాఫీసులో ఏకా ఏకీ హెడ్ క్లర్కునయితే, ఎలాగుంటుందనుకున్నాను. నేనను కోకుండానే మహాచిత్రంగా ఆ ఉద్యోగం వచ్చింది. ఇంతాచేసి వచ్చిందా, అదీ నచ్చలేదు.

కాలేజీలో విద్యార్థులకు పాఠాలు చెప్పాలని ముచ్చట పడేవాణ్ణి. సరే. ఆ ముచ్చటా తీరింది. మహారాజావారి పరి చయం లభిస్తే బాగుండుననుకున్నాను. ఆ భావం కలిగిందో లేదో ఆయన పరిచయం లభించింది. ఒకటి తరవాత యింకొ కటి, అనేకభావాలు వస్తున్నాయి. పోతున్నాయి. ఇంకొక భావం వస్తేవచ్చింది, పోయేటందుకు మాత్రం రాకూడదు! *

• • •

---

మునసబు." అని సుద్దతో వ్రాసి ఇంటికి వెళ్ళిపోయారు. మర్నాడు యిది చూసి జిల్లా మునసబు, అప్పారావుగారిని పిలిపించి యిలా ప్రశ్నించాడు: "మా కోర్టు తలుపులమీద సుద్దతో వ్రాసినదెవరు?"

"నేనే"

"ఎందుకు వ్రాశావ్?"

ఆ పిల్లవాడు జరిగిన కథంతా ఆయనకు చెప్పాడు. మునసబు నవ్వుతూ యిలా అడిగాడు:"అయితే, గోడమీద వ్రాయక, కోర్టు తలుపుల పైని ఎందుకు వ్రాశావు?"

"నా జేబులో సుద్దముక్క మాత్రమే వుంది. సుద్దతో తెల్లటిగోడ పైని ఎలా వ్రాయడం?"

* ఆ రోజులలో విజయనగరము సంస్థానపు మేనేజరుగా వున్న రామమూర్తిగారి వాక్యములు: "అప్పారావుగారు వ్రాసిన ఒక ఆంగ్ల

ఆలోచనల విలవ, వాటిని పురస్కరించుకుని వచ్చే నిర్ణయాలమీద, నిర్ణయాల మంచిచెడ్డలమీద ఆధారపడి వుంటుంది. ఆలోచనను తరచి చూడనిదే, ఒక నిర్ణయానికి రాకూడదు. ఆలోచించేటపుడు పొందికా, పొదుపూ అవసరం. వ్యర్థముగా ఆలోచించరాదు.

ఆలోచనలు చిత్రమైనవి. ఇవి విచిత్రముగా, పుడుతూ వుంటవి. కొందరు మనతో మాట్లాడుతున్నపుడు, సరదాపుట్టదు; వారి ప్రసంగము మనకు చికాకు కలిగిస్తుంది. అయినా వారు మనలను వొదిలిపెట్టరు. అలాంటప్పుడు, మన ఆలోచనలే మనలను ఆదుకుంటవి. ఏ మాత్రం మర్యాదకు లోపంరానీయకుండా వారు చెబుతున్నది వింటున్నట్లే కనిపిస్తూ మనం మన ఆలోచనలను మరొక దిక్కుకు మళ్ళించవచ్చును.

భావించడం నా ముచ్చట. ఆలోచన నా బలం. ఏదో ఒక దానిని దృష్టిలో పెట్టుకుని, ఎడతెరిపి లేకుండా, ఆ రోజులలో సరదాగా ఊహించేవాణ్ణి. పచారు చేస్తున్నపుడు, నడిచి వెడుతున్నపుడు, ఏకాంతముగా వున్నపుడు, భోజనం చేస్తున్నపుడు, పరుపుమీద వాలినపుడు, సగంరాత్రి మెలకువ వచ్చినపుడు, పొద్దున్న షికారు వెళ్ళినపుడు, అపుడూ యిపుడూ అననేల; ఎప్పుడూ ఏదేదో వూహించేవాణ్ణి; ఏమేమో భావించేవాణ్ణి; మధుర స్వప్నాలతో కొన్నాళ్లు కొన్నేళ్లు గడిచిపోయాయి.

---

గీతమును చదివి అపుడు స్కూళ్ళ యినస్పెక్టరుగా వుంటున్న శ్రీ ఎ. మన్రో (యమ్. ఏ బి. సి. యల్) చాలా సంతోషించి, వారిని ఆనందగజపతి మహారాజావారికి పరిచయము చేయవలసినదిగా కళాశాల ప్రిన్సిపాలు శ్రీ చంద్రశేఖర శాస్త్రిగారిని కోరారు. అంతట శ్రీ శాస్త్రిగారు 1881 లో అప్పారావుగారిని మహారాజావారికి పరిచయం చేశారు."

ఆలోచనలను ఊరికే పరుగులెత్తించడం మంచిదికాదు. అందులో ఆనందమున్నా, మేధస్సుకు శ్రమ. నరములకు బలహీనత. ఇపుడిపుడు ఆశ్చేసేపు ఆలోచించకుండా వుండాలని ప్రయత్నిస్తున్నాను. కాని ఎంత పోదుపుగా వుందామన్నా, నాకు ఆలోచనలు లావు !



# ప్రకృతి అనే పుస్తకం

ప్రకృతిదృశ్యములను వస్తుసముదాయమును అవలోకించినపుడు అనిర్వచనీయమైన ఆనందము కలుగుతుంది. సౌందర్యమును చూసి మనం ముగ్ధులమౌతాము. దివ్యాంశగల ప్రకృతిలో, చేతనాచేతన వస్తుసముదాయములో, మానవునిలో మనోహరమైన కాల్పనికత గోచరిస్తుంది.

వరసలు వరసలుగా దగ్గర దగ్గరగాపున్న తాటివనము ఎంతో ఆహ్లాదమును కలిగిస్తున్నది. హృదయమును పల్లవింప చేస్తున్నది. తాటిపెండె యింటి పైకప్పువలె వున్నది. జల్లులు జల్లులుగా కురిసినట్లు వెన్నెల. చక్కని చిక్కటి తోట. అనేక ఫలజాతుల మొక్కలు. మొక్కలకు నీళ్ళుపోస్తూ దోహదము చేస్తూ పెంచి పెద్దచేస్తున్న తోటమాలీలు. వాళ్ళజీవితం. మన జీవితముతో వాళ్ళజీవితమునకు సంపర్కము లేదు. తోటఅవతల పొలిమేర. పొలిమేరలో పల్లకీబోయీల కేకలు. పల్లెటూరివాతావరణం; గుడి, గుడిలో పూజారులు; గ్రామస్థులు వాళ్ళ కొడుకులు, కూతుళ్లు, అనేక కుటుంబాలు. వీళ్ళ జీవితమేమో, అభిరుచులేమో, ఆశలేమో!

సరుగుడు చెట్లు గాలికి కదులాడుతున్నవి. నిటారుగా నిలబడి తలలు ఆడిస్తున్నవి. సరుగుడుతోటల సంగీతము. ఉండి వుండి మూలుగుతున్నట్లు వింతవింత ధ్వనులు!

* * *

విషాదరేఖావృతమైన మనః ప్రవృత్తిపై, కరుణరస శబలిత మగు సంగీత ప్రభావము యెటులుండును? ప్రాచీన స్మృతులను ఉయ్యాలలూపినట్లు ఊపి మనసును అనునయించి మార్దవమును కలిగించును.

♦ ♦ ♦

ప్రకృతి వర్ణనములున్న కవిత్వము సంస్కృత సాహిత్యములో అధికము. వేదములు. ప్రకృతి ఆరాధనము. కార్లయిలు అభిప్రాయములు, ప్రకృతిపట్ల క్రైస్తవ మతదృష్టి; ఇతర మతముల దృక్పథము.

రామాయణము. ఉత్తర రామచరిత్రము. కాళిదాసుని రఘువంశము. అము పురః పశ్యసి దేవదారుం *

ప్రకృతిసానుభూతి. మానవ మానసిక అవస్థలతో ఏకత్వము. కుమారసంభవము. మేఘసందేశము. శాకుంతలము.

భయంకర ఆరణ్యక ప్రకృతిపట్ల ప్రేమ, లేదా మనోహర ప్రకృతి అంటే ప్రేమ. ప్రాక్తన వాసనలను తెలియపరుస్తుంది. ప్రకృతి బిడ్డగా ఆదిమానవుడు గడిపిన స్వేచ్ఛాజీవితము.

♦ ♦ ♦

---

* అముం పురః పశ్యసి దేవదారుం
పుత్రీకృతోఽసౌ వృషభ ధ్వజేన
యో హేమకుమ్భ స్తన నిస్సృతానాం
స్కందస్య మాతుః పయసాం రసజ్ఞః

అర్థం: ముందున్న యీ దేవదారువృక్షమును చూస్తున్నావుకదా. ఏ దేవదారువృక్షం కుమారస్వామి తల్లియైన పార్వతీదేవి సువర్ణకుంభములవంటి స్తనముల స్రవించిన ఉదకక్షీరముల రసమును గ్రహించినదో

వాన వెలిసెను. నీటిబిందువులు ఆకులనంటి చెట్లను ముత్యములతో గప్పియున్నటుల జేసెను. వెలగాడ కొండపై నొక నల్లని మేఘపుశకలము చందురునిపై సన్నని బట్ట వలె కమ్మి మళ్ళీ అంతలోనే పక్కకు వొత్తిగిలినది. పొన్నాకులపై చంద్రకాంతి ప్రతిఫలించి ఆకులకు తళతళ మెరుగులు పెట్టినది.

వెలగాడ కొండమీద నిలబడి చూసినపుడు విజయనగరము మనోహరముగా అవుపిస్తుంది. నాలుగువైపుల ఎటు చూసినా, సముద్రమువలె పచ్చని చెట్లూ చేమలు తోటలు వనములు. సముద్రమున పడవలవలె తెల్లని మేడలు భవనములు. ఆకాశమును అంటుకునివున్నట్లు దూరమునవున్న పర్వతశిఖరములతో ప్రకృతి మనోజ్ఞముగ వున్నది. చెరువులు వెండి తీగలవలె, ఏరులు వాగులు, నీటిగీతలవలె మెరుస్తున్నవి. ఉత్తరమున రోడ్డు; రైలుస్టేషను.

◆ ◆ ◆

మంచు వొత్తుగా కురిసినది. పొద్దు పొడుస్తున్నపుడు అంతా అందము. ఎర్రని రేఖలు; సూర్యుని దెస మెల్లమెల్లన మంచు విడిపోతున్నది. సెలయేళ్ళు మంద మందముగ ప్రవహిస్తున్నవి. కొన్ని పంటపొలములు. మరికొన్ని బంజరులు. కొన్ని చోట్ల సస్యములతో, మరికొన్నిచోట్ల ఖాళీలతో నేల, గడులతో వున్న చదరంగపు బల్లను పోలివున్నది.

---

**అట్టి దేవదారు వృక్షం, పుత్రభావముతో పరమేశ్వరునిచేత స్వీకరింపబడినది.**

**పార్వతి బంగారుకుండలతో నీళ్ళుపోసి పెంచుతున్న దేవదారు వృక్షమును శివుడు పుత్రునివలె ప్రేమిస్తున్నాడని భావం.**

పలచని పుంచుపొరలలోనుంచి అన్నీ స్పష్టముగా కని పిస్తున్నవి. పడమట కొండమీద పటవాలుగా లోయ. ఉత్తరము వైపు వరండా. ఇటు వొకగది. అటువొకగది. గుమ్మమునకు యెదురుగా వొక జామిచెట్టు; పది గజములవరకు చతురము. అటుపైని కిందకు నిటారుగా దిగిన లోయ. రాళ్ళు విరిగిపడి వున్నవి. చెదురు చెదురుగా ఎన్నో రక్కిసతుప్పలు •

ఒక డేగ కొండశిఖరముమీద రివ్వున ఎగిరి రింగటాలు కొట్టి కొండదిగువరకు దూసుకుపోయినది. డేగగిరగిరలతో నల్లని రేఖలతో దారులు ఏర్పడినవి.

దూరమునవున్న ఎత్తయిన ఘాటీలు పలుకరముల నీలి రంగుల మబ్బులవలె కనిపిస్తున్నవి. దూరదూరముగ వున్న కొండలు లీలగా పొడకట్టుతున్నవి. తూర్పుదిశ నిర్మలముగావుంది. మన్ను అక్కడక్కడ ఎరుపు. చెరువులనీరు ఎర్రన. దున్నిన భూములు మిగిలిన భూములకన్న నలుపు. నల్లరేగడి భూములు యినుమారు దున్నినారు కాబోలు!

నెల్లిమర్ల ఏరు. కోరుకొండ వద్దనుండి పోవు తోవ ఎర్రని కంకరనేల బయలుపడెను. ఆ కొండను వెదురుడొంకలు. కొండ పూచినట్లు కొంచెము పసుపుపచ్చగా కనపడుతున్నవి. రామ తీర్థపు కొండలు, భోగాపురం కొండలు చిన్నచిన్న వెన్నెల కుప్పలవలె వున్నవి. కొండలచుట్టూ, మట్టమువరకు సేద్యము.

---

• విజయనగరమునకు నెల్లిమర్లకు మధ్య వెలగాడకు అనుకుని ఒకకొండ వుంది. అది వెలగాడకొండ. విహారార్థము ఆ కొండమీద విజయనగరం మహారాజా ఒక దివ్యభవనము కట్టించారు.

తూర్పు ఉత్తరముల వైపు విశాలమగు మైదానములు, కొండలు. భవనము అవతలభాగమున కొండ వొంపుతిరిగి ఏనుగు తలవలె వుంది. ఈస్టరను ఘాట్సు.

గాలి యీలలువేస్తూ తలుపులసందుల దారిచేసుకుని ధ్వనిచేస్తున్నది. పడమట ఒక చింతగున్న. దక్షిణమున జీడి మామిడిచెట్లు. గుంపులు గుంపులుగా సైనికులవలె నించున్న తాటిచెట్లు. నవనవలాడే తుప్పలు. పసుపుపచ్చని పూలతో మొక్కలు. గన్నేరు గాలికి కదలాడుతున్నది. రామభజనచెట్టుకు వుండే ప్రమిదలతో కత్తిమందు చెట్టు. చిన్నచిన్న మేఘములు అభ్రకమువలె తెల్లగావున్నవి. గాలికి దూది పింజలవలె మబ్బులు తేలిపోతున్నవి. సిందూరపురంగుతో అందమైన ఆకాశం. దిఙ్మండలం తెల్లన. మీద నీలం.

* * *

ఆకాశమున వొకమబ్బు తునక యించుమించు పడమటి దిక్కునవుంది. మెల్లమెల్లగా చిన్నచిన్న మబ్బులు దిఙ్మండలానికి చేరుకుంటున్నాయి. వలయాకారముగా మబ్బులు అలముకుంటున్నవి.

గాలి వీచింది. దిఙ్మండలము వెండి కరిగించి పోసినట్లు తెల్లగావున్నది. తూర్పున తెల్లనికాంతులు చినుకులవలె చిమ్ముతున్నవి. కొండలకు అవతలదూరాన మీదను ఉత్తరంగా కొప్పులవలె పర్వతశిఖరములు వొప్పుతున్నాయి. ఆకాశం అటు నిర్మలముగా ధూమ్రవర్ణముతో తేలికగావుంది.

* * *

కళింగపేట కొండ. కొండచిలువ వలె భయంకరమైన కళ్లు పెట్టుకొని కోటవద్దనుంచి రైలు వస్తోంది. అక్కడక్కడ మిణుగురులు వెలుగుతున్నవి; ఆరిపోతున్నవి!

* * *

అతను తిరిగివచ్చుసరికి అప్ప క్షేమమును గూర్చి తనకుగల ఆతృతచేత కొన్ని అడుగులు చెలికత్తెతోడ ముందుకుసాగి సాయంత్రమగుట దారము పోవుటకు భీతిల్లి తోవ కిందుగ కొండ దక్షిణపు కొసను నొక నల్లరాతిపై గూర్చుండెను. చల్లగాలి గట్టిగ వీచి రొజగొట్టుచుండ గడ్డి తలలు పక్కపక్కకు నాట్యము సలుప పొదలు ఆకులు పైకెగసి తెల్లని కిందిభాగముల గనపర్చుచుండెను; శుద్ధ ఏకాదశి రోజయినను మబ్బుచే గుడ్డివెన్నెల. మబ్బుగమ్మి వెన్నెల మసగ నిండి యుండెను.

ఆవిడ దక్షిణవైపు తిరిగి కూర్చుండ గాలి కురుల నెగర గొట్టుచుండ గాలి తాకిడిని యెదుర్చు రీతిని మోమెత్తి యుంచినది. తెల్లని శాలువ కప్పుకొని సరిచేసుకొని దారివంక చూస్తూ యుండెను.

పది గజములు క్రిందుగా నిలువచేత కాపాడబడి ఒక బిల్వము బంగారు పండ్ల బరువుచే కొమ్మలనొంచి యుండెను.

కొంత తడువు తోవకెదురుగా పక్కపక్కలకు తిరిగి తిరిగి చూచి చెలికత్తెతో ఆవిడ యిట్లనియెను: "యీ బ్రాహ్మణ చిన్నవాని యోగ్యత బహు యెన్నికగా నున్నది!"

* * *

మబ్బులుకమ్మి గుడ్డి వెన్నెలను అడ్డినవి. ఆమె కట్టుకున్న తెల్లనిచీర చీకటిలో నువ్వా నేనా అన్నట్లుండెను. చీర

అంచులు గాలికి కదులుతూ వుండగా ఆమె విగ్రహామువలె కూర్చుని వుండెను. వనము నిశ్శబ్దముగా వున్నది. కొండ శిఖరములు కంటికి ఆనుటలేదు. శీతాఫలములు వాసనలను వెదజల్లుచుండెను.

"మిమ్ము యీ కొండను యేలే వనదేవత అనుకొంటిని. వట్టిచేతులతో దేవతలను చూడకూడదు. గనుక యిదిగో ఉపహారం!"

యీ మాటలు ఆడుతూవుండగా గతుక్కుమని లేచి ఆమె యేమి అనుటకు యెరుగక నిలిచివుండగా అతను: "మీ అప్ప ఖుషాసాగా వున్నారు. కూర్చోండి. వక అరఘంటలో వస్తారు. నేను అడ్డుతోవను వచ్చాను..."

* * *

కళ్లు: కామాక్షివి లోతుకళ్లు. కనుబొమలలో వొంపు లేదు. కొంచెం బూరెబుగ్గలు. ఎడమబుగ్గ కింద నల్లని చిన్న పుట్టుమచ్చ. తన తరహా స్త్రీలపట్ల నిర్లక్ష్యం. అసహ్యం. కళ్ళల్లో అసంతృప్తి. మనిషిసన్నం. మాట్లాడదు.

మహారాజావారి ఎదటకు వచ్చేసరికి అలా అలా జారిపోతున్నట్లు అడుగులువేస్తుంది. మామూలుగా నడవదు. ఇతరుల దృష్టిని ఆకర్షించాలనుకునేవాళ్లు ఆమెవలె అలంకరించుకోరు. కామాక్షి అలంకరణలో డాబూ దర్పమూ కనిపించదు.

* * *

'రా' కనుబొమలు విశాలంగా సోగగా తెలివితేటలను సూచిస్తూవుంటాయి. విశాలమైన నేత్రములు. మాటలలో నేర్పు. చలాకీచూపులు.

ఆ ఆడపిల్లల కళ్లు బేడిసలచూపులవలె తళతళలాడుతున్నాయి. భాస్కరం కళ్ళు నిద్రమత్తుతో తూగుతున్నట్లుంటాయి. ఆ పొడుగుపిల్ల నడుం కొద్దిగా వాలం.

* * *

చంద్రవదన కనుబొమలు కళ్లపొడుగునా, తగుమాత్రము దళసరిగా, కనురెప్పలకు అతి దగ్గరగా అతి దూరముగా కాకుండా, విల్లువలె వంగివుంటాయి. కొద్దిగా ముందుకు పొడుచుకు వచ్చినట్లుండే కళ్ళు. కింద పెదవి దళసరి. ముఖము గుండ్రన. కళ్ళల్లో ఆలోచన. ప్రశాంతమైన చూపులు. మాట పొందిక. నాజూకు నడక. చెవులకు ముత్యపుపోగులు. అందంగా కనిపించాలనే ప్రయత్నం.

ఆమె చెల్లెలు కళ్ళల్లో అన్నీ ఆలోచనలే. పెద్దకళ్ళు. చలాకీ అయిన పిల్ల. నడిచేటపుడు అటుయిటు చూస్తుంది. వొయ్యారంగా నడుస్తుంది. నడక నాట్యం చేస్తున్నట్టే.

* * *

అందమైన ఆడపిల్లలను చూడడం కొందరికి సరదా. ఆ పిల్లలను మనసులో ఊహించుకుని సన్నివేశాలను కల్పించుకుని భావాలను గుర్రాలవలె దౌడు తీయించవచ్చును. కాని ఇది ఎంత త్వరగా మానితే అంత మంచిది.

• • •

ఒక అందగత్తె కంటపడినపుడు కొన్ని ఉద్రేకాలు, శృంగారప్రియత్వం కలగడం సహజం. అలాంటి ప్రమాదం తప్పించుకుందుకు ఆమెను నువ్వు నీ సోదరిగా భావించు.

• • •

గాజులవాడు : నెరసిన బుగ్గమీసాలు. ముసలివాడు. నున్నని మొహం. భుజంమీద గాజుల మలారం; తలకుపాగా. చిత్రించడానికి తగిన పాత్ర. ఇతన్ని గురించి వ్రాయవచ్చును. మంచి విషయము. ఎంతమంది అందగత్తెలను కళ్ళతో చూసి వుంటాడో, ఎన్ని మెత్తని చేతులను తనచేతులతో తాకివుంటాడో. వొకడు గాజుల వ్యాపారం నేర్చుకుని గాజులబ్బివలె ఊళ్లోకి బయలుదేరాడనుకుందాం. బయలుదేరితే ఏమౌతుంది ; కథా నాయకునిగా యిలాటి వ్యక్తిని చిత్రిస్తే బాగుంటుంది. అయితే గాజులవాళ్లు ముసలివాళ్లే అయి వుండాలని వుందా? కాకపోతే?

* * *

బుడబుక్కలవాడు : వీపుపైని యీతాకు సంచీ, వకటి, తోలుసంచి వకటి, భూతపిల్లి తోకలు తాడున గట్టి రుమాలు మెడమీంచి ముందుకు. రంగు చీటీగుడ్డ.

♦ ♦ ♦

కోమటి : నాఅంత ఎర్రిమాలోకం మరెక్కడున్నాడు ! వాసన్లేదేవీఁలేదు. సిన్నపువ్వు కోసం ముళ్ళల్లో సెయ్యేట్టేసి నాను. దాని సిగతరగ. ఏటా కళ్ళు, సిల్లంగికళ్లు సూపుల్తో నన్ను మారుమెడలెట్టేస్తోంది !...అమ్మోరిబాబు ! అది ఆడది కాదు !...దెయ్యం...రాసదెయ్యం ! దాన్తో నాకు సరసవాఁ ! రాసోరి పెళ్ళిళ్ళకి బాసికం కట్టే కత్తితో సరసవాఁడినట్టే ! కన్నెపేరు సెబితే కన్ను సెదురుతుంది గాని కత్తిపేరు సెబితే కాళ్లూ సేతులూ ఆడవు.

* * *

ఒకసారి వొక నల్లమందుభాయీ, పైజమా వేసుకో బోతూంటే రివ్వున గాలి వీచి గాలితోపాటు పైజమా కొట్టుకు పోయింది. తన ప్రాణాలను దేవుడు రక్షించినందుకు సంతోష పడుతూ, ఆ నల్లమందుభాయీ యిలా అన్నాడు: "రక్షించావురా; భగవంతుడా! వెధవ పైజమా పోతే పోయింది. అది తొడుక్కొనివుంటే, దానితోపాటు నేనూ గాలికి కొట్టుకుపోదును!"

* * *

ఈ భూమినిండా కంటికి కనిపించని సూక్ష్మజీవులు వున్నాయనీ, వ్యాపించివున్న వీటి ఉపద్రవమును వాతావరణ మార్పువల్ల అరికట్టే అవకాశంవుందనీ, క్రిమిశాస్త్ర పరిశోధనము తెలియచెబుతున్నది.

* * *

మానవుడు, పరిస్థితులకు, కేవలం బానిస అని తన ప్రవర్తనను తాను నిశ్చయించుకోలేని నిస్సహాయుడని అనుకోవడం పొరపాటు. శారీరక మానసిక ధర్మమును నిర్ణయించడంలో ఆనువంశిక పరిసరాల ప్రభావాలు అధికంగావున్నా, వాటిని మానవుని మేధాశక్తి సరిదిద్ద గలుగుతుంది. మానవునికి కావలసినది సంకల్పబలం. అయితే యీ దిద్దుబాటులు, శక్తియుక్తులను బట్టి అవకాశములను బట్టి తరతమభేదములతో జరుగుతవి. కొందరు తమ అవలక్షణములను పూర్తిగా పోగొట్టుకోవచ్చును. మరికొందరు క్రమక్రమముగా తగ్గించుకోవచ్చును.

ఒకవ్యక్తిశీలమును అప్పటికిని యిప్పటికిని అతను సాధించినదానిని బట్టి తారతమ్యదృష్టితో వివేచించి నిర్ధారింపవలెను.

♦ ♦ ♦



మహాకవి పడకగది

మోయలేని బరువును తలకు ఎత్తుకొని యీడిగిలబడి నట్లు, స్వతంత్రముగా యోచింపలేనివాడు ఇతరులఅభిప్రాయా లను తల కెక్కించుకొని, యీడిగిలబడతాడు.

♦ ♦ ♦

ఆంగ్లభాష, నాగరికతను సంస్కృతిని పెంపొందించు కుంటున్నది. తెలుగుభాష, దానితో పోటీచేయవలసిన పరిస్థి తులు ఏర్పడినవి. భాషాభివృద్ధికి పాటుపడగల శక్తివంతులే, తెలుగును నిర్లక్ష్యం చేస్తున్నారు.

తెలుగుకు, పారిశ్రామికనగరములో వ్యవహరింపబడే అవకాశంలేదు. అందువల్ల దాని అభివృద్ధికి ఆటంకము కలిగి నది. అట్టి అవకాశము బెంగాలీ మరాటీ భాషలకు లభించి, అభివృద్ధిపొందాయి. రాజధానీనగరములలో ప్రాముఖ్యము సంపాదించడము వల్ల బెంగాలీలు, మహారాష్ట్రులు, కొంత వరకు తమిళులు, బాగా లాభించినారు.

♦ ♦ ♦

భారతదేశములో సామాన్య సాహితీపరునకు, స్వతంత్ర రచనాశక్తి కొరవడి ఇతరుల గ్రంథాలను అనుకరించడమో, అనువదించడమో తప్ప, అతనికి గత్యంతరము లేకపోతున్నది. ఈ దురవస్థ తొలగిపోవడానికి చాలాకాలం పడుతుందికాబోలు!

♦ ♦ ♦

చదవాలి, చదవాలి; గాని చదువుకంటె యెక్కువ చూడాలి, చూడాలి. చూసి కనిపెట్టాలి. * వొట్టి చదువు

---

* "జాగ్రత్త. అప్పారావు చూస్తూవుండగా నువ్వు యేమీ వ్రాయకు. నీ కలము తిరుగుడులను బట్టి, నువ్వు యేమి వ్రాస్తున్నదీ ఆయన చూపులతోనే పోల్చుకుంటాడు." —రీవారాణి

వృథా. ప్రకృతిని పరిశీలించాలి. ప్రకృతి అనే పుస్తకం అన్ని పుస్తకాలకంటె గొప్పది. అది చదివినవాడి ఆనందానికి అవధి వుందా? జ్ఞానానికి అవధి వుందా?

ఆ ఆనందం ఆనందం ఔను. ఆ ఆనందం నిండా గొప్పది!



# మాటామంతీ

కొందరితో మాట్లాడుతున్నపుడు కొందరు తమ మనో వ్యథ తీరినట్లు 'ఫీ'లవుతారు. అలాంటపుడు వారిని చివరివరకు మాట్లాడనీయడం మంచిది. వారి హృదయము తేటపడి, ఉల్లా సము కలగడము సంతోషమే కదా!

• • •

కొందరి ప్రసంగము ప్రసన్నముగా వుంటుంది. వారి మాటలు వినసొంపు; అనుభవములు తెలుసుకోవడానికి ఉత్సా హము.

• • •

కొందరు, ఎదటువాని మాటలతీరును సరిగా గ్రహిస్తారు. తెలివైనవాళ్ళు యితరుల మనసును తూచినట్టు గ్రహించి, తాము తూచినట్లు మాట్లాడతారు. కొందరు తూచి గ్రహించి గ్రహించినట్లు పైకి కనబడరు. కొందరు గ్రహిస్తారు; గ్రహించి నట్లు కనబడి పోతారు. ఇతరుల మనసును తూచినట్లు తెలుసు కోవడం మంచిదని తెలిసి, ప్రయత్నించి విఫలులై, గొప్పవాళ్ళను మెప్పించాలనే తాపత్రయంతో మరికొందరు, తమ అవివేకాన్ని వెల్లడించుకుంటారు.

• • •

సమయస్ఫూర్తి లేకపోవడం మనిషికి చిక్కే. ఒకడు మనతో ప్రసంగిస్తూ మాటలచాటున తేలులాగ నక్కి చటుక్కున కుడతాడు. కుట్టినట్టు కనిపించడు. ఏవేవో తమాషాగా నాలుగు విసుర్లు విసురుతాడు. అపుడు అతనికి నాలుగింతలు చమత్కారంగా సమాధానం యివ్వాలి. వెంటనే మాటకుమాటా చమత్కారంగా జవాబు చెప్పే నేర్పు కొందరికి వుండదు. ఎదుటవాడి విసుర్లుకు తట్టుకోలేక ఉక్కిరిబిక్కిరౌతారు; తామేదో తప్పు చేసినట్లు ఒక్కొకపుడు అనుకోవడం కూడా కద్దు.

సంభాషణానంతరం, తనకు చురుక్కున తగిలిన మాటల విసుర్లుకు, తగిన సమాధానం తోచవచ్చును. ఆ సమాధానం తన నడవడికను సమర్థించేదీ కావచ్చును. కాని సద్యఃస్ఫురణ లేనపుడు, ఏమి లాభం ; 'అరరె' అని విచారించడం తప్ప !

• • •

ఇతరులు తన మాటలను అతిశ్రద్ధగా వినాలని, అవి అంత అమూల్యమైనవని కొందరు అనుకుంటూ వుంటారు. అలాంటి వ్యక్తిని సంతోష పెట్టవలసిన దురవస్థ నీకు తటస్థపడినపుడు, అది తప్పనిసరి అయినపుడు అతనేం చెబుతున్నా నువ్వు శ్రద్ధగా విను. విని అతను చెబుతున్న ప్రతీదీ చాలా సబబుగా వున్నట్లు, సూచించు. అతనన్న ప్రత్యక్షరం అక్షరాలా నిజమని నువ్వనుకుంటున్నట్లు తల వూపు. ఆ వ్యక్తి తాను చెప్పిన విషయం నీకు క్షుణ్ణంగా అర్థమయిందనుకుంటాడు. నువ్వెపుడూ పొరపాటుగా ఆలోచించవని, తెలివైనవాడవని భావిస్తాడు.

కాని ఒకవ్యక్తి సబబుగా మాట్లాడుతున్నపుడు అతని మాటలు యితరులకు ఉపయుక్తమౌతున్నపుడు, లోకానుభవాన్ని వ్యక్తము చేస్తున్నపుడు మనోరంజకమయినపుడు,

వాటిని నువ్వు శ్రద్ధగా వింటూ, అతన్ని యింకా మాట్లాడ నీయడం మంచిది.

♦ ♦ ♦

సజ్జనులను తలచుకుంటున్న కొద్దీ, ఆనందం యినుమ డిస్తుంది.

♦ ♦ ♦

ఒకరిని యింకొకరు మనసిచ్చి ప్రేమించినపుడు, అదే విధముగ తిరిగి ఆవ్యక్తి తనను ప్రేమించనపుడు, మనిషి దుఃఖపడతాడు. ప్రేమించినవ్యక్తులకు అపచారం చేయ కూడదు. అపుడు ప్రేమ దుఃఖభాజన మౌతుంది. తిరిగి ప్రేమను పొందని ప్రేమ ఖేదకారణము కాదా!

♦ ♦ ♦

నాగరికతతోపాటు ప్రేమభావము పెంపొందుతూ వుంటుంది. ఆటవికుని ప్రేమ తక్కువస్థితిలో వుంటుంది. కపట వేదాంతులు స్వార్థప్రవృత్తిని ప్రోత్సహిస్తారు. ప్రేమ మానవ జాతికి స్వేచ్ఛను ప్రసాదిస్తుంది. దోషములు ప్రేమారాధన వల్ల క్షాళితమౌతవి. షెల్లీ ప్రేమతత్వము; వేదాంత దృష్టి... ప్రేమ అనే ధర్మమునకు కట్టుబడిన సమాజము మాత్రమే, ఆనంద మును ప్రసాదించగలదు.

♦ ♦ ♦

స్వార్థాన్ని విడిచిపెట్టాలి. పరులకు ఉపకారం చేయాలి. మనిషిని ప్రేమించాలి. ఇది నిజమైన తాత్వికదృష్టి. లోకంలో వున్న అన్ని తత్వాలు దీనిని బోధిస్తున్నాయి. ప్రేమ, వ్యక్తి స్వార్థాన్ని పోగొడుతుంది. ప్రేమకన్న పెన్నిధి యింకేముంది!

♦ ♦ ♦

ప్రేమ, హృదయమున పుష్పించిన ఒక కోమలపుష్పం. అది, అజ్ఞానమనే అంధకారాన్ని పోగొట్టి, ఆత్మను తేజో వంతము చేస్తుంది. ఇది ఉన్మాదావస్థను తెచ్చిపెట్టే మోహము మటుకుకాదు. మనం, స్వచ్ఛమైన నిర్మలమైన, లలితమైన పవిత్రమైన ఆత్మలను ప్రేమించడము అలవరచుకోవాలి. ఆత్మ సౌందర్యమును అవలోకించి ఆనందించే స్వభావమును పెంపొం దించుకోవాలి. స్వార్థప్రవృత్తిని విడనాడాలి. వాత్సల్యము, దయ, కరుణము అనునవి ఆత్మానందమునకు హేతువులు.

• • •

మంచితనమే దైవము. మంచిని పెరగనివ్వాలి. మంచిని ప్రేమించడమే, దైవమును ప్రేమించడము. దుర్గుణములను రోసి, ఆత్మ, సుగుణసంపత్తిని పెంపొందించుకొంటున్న కొద్దీ,అది దివ్యత్వమును పొందుతుంది.

* * *

ఆచరణయోగ్యమైన వేదాంతమునకు పరీక్ష కార్యావ లంబనం. సిద్ధాంతాల అర్థం, ప్రాధాన్యం గుర్తెరుగక, కేవలం వాటిని వల్లెవేస్తూ మనుష్యులు పొద్దుపుచ్చుతున్నారు. క్షుద్ర దేవతారాధన ఉపాసన అనే మూఢవిశ్వాసాలను కలిగించి కొందరు దొంగవేదాంతులు చేసే ఘోరకృత్యాలకు లెక్క లేదు. 'వేదాంతులొస్తున్నారు, చెంబులూ ముంతలూ జాగ్రత్త' అన్నసామెత ఊరికే పుట్టలేదు.

* * *

మంచిపని చేసేటపుడుకంటె, చెడ్డపని చేసేటపుడు వివే చన అవసరం. ఒకరికి సాయపడడం ధర్మం. హానిచేయడం

అధర్మం. ధర్మంగా నడవలేనపుడు అధర్మంగా నడుచుకోక పోవడం మేలు. ఒకరి మనసు నొప్పించకుండా వుంటే, పోనీ, అదేచాలు; ఉపకారం చేసినట్టే!

♦ ♦ ♦

కొన్ని సద్గుణాలు వున్నంతమాత్రాన, మనిషి సంతృప్తి పడకూడదు. అంతటితో కొందరు సంతృప్తిపడి తమ దుర్గుణాలను కనుకోన్కజాలరు. అలాగ తృప్తిచెందక, దుర్గుణాలను వెదికి వెదికి పట్టుకోవాలి. ఆత్మను పరిశోధించుకొని, వాటని పోగొట్టుకోవాలి.

♦ ♦ ♦

ఇతరులకు హాని కలిగించే పనులు మనం చేసినపుడు, వాటని మనం సమర్థించుకుంటాము. మనకు హాని కలిగించే పనులు యితరులు చేసినపుడు, వాటిని మనం ఖండిస్తాము. ఇదేనా, మనిషి యోగ్యత ?

♦ ♦ ♦

మనిషికి వుత్సాహం నశించినపుడు జీవితంమీద విరక్తి కలుగుతుంది. వయసు ముదరడంవల్ల శక్తి ఉడిగినందువల్ల నిరాశ పుడుతుందికాబోలు. నిరాశ పుట్టినట్టే పుట్టి అంతలోనే ఆశ చిగురిస్తుంది. ఒక విధమైన విద్యుత్తువంటి ఉత్సాహం వెల్లివిరుస్తుంది.

♦ ♦ ♦

యవ్వనంలో ఉత్సాహం అధికం. అపుడు ఏకార్యాన్నైనా యిట్టే చేయగలనన్న ధీమా కలుగుతుంది. ఆ ఉత్సాహంలో శక్తికి మించిన పని అంటూ ఏదీ వున్నట్లు అనిపించదు. ఏ అవరోధాన్నైనా అవలీలగా దాటగలనన్న ధైర్యంవస్తుంది.

కాని ఒక కార్యాన్ని నెరవేర్చాలంటే సాధన అవసరం. పరిస్థితులు అనుకూలించాలి. అమితోత్సాహి వీటిని లక్ష్యపెట్టడు. కార్యసాధనలో పటస్థపడే కష్టాలవల్ల వ్యక్తికి అనుభవం కలుగుతుంది. ఒక కార్యం విఫలం కావడంతో, ఏ కార్యం తలపెట్టినా అది దుర్ఘటమనే నిస్పృహ పుడుతుంది. అందువల్ల శిక్షణలేని ఉత్సాహం వ్యర్థం. వెనకా ముందూ చూడకుండా, పరిస్థితులు అనుకూలమో కాదో ఆలోచించుకోకుండా కేవలం ఉత్సాహాన్ని పురస్కరించుకుని శక్తికి మించిన పరుగులు పెట్టకూడదు. తలకుమించిన బరువును మోయాలని ఆశించి నిరాశపడకూడదు. ఈ అనుభవం దుఃఖపూరితమైనది. సమర్థులకు ఆ బరువును వదిలిపెట్టడం మంచిది. కొందరు తమకు దుర్ఘటమైన కార్యాలను తలపెట్టి, మరికొందరు వ్యసనాలను అలవర్చుకొని తమ శక్తిని కాలాన్ని వృథా పుచ్చుతున్నారు. శక్తిని కాలాన్ని దండుగ పెట్టకూడదు.

• • •

ఒకరొక రంగంలో గొప్ప ఫలితాన్ని సాధించినపుడు, అదే రంగంలో అంతకంటె ఎక్కువ గొప్ప ఫలితాన్ని సాధించాలని మనకు కోరిక పుడుతుంది.

• • •

స్వభావంలో నాటకీయలక్షణం లోపించినందువల్ల, యిట్టే మనిషికి కోపం వస్తూ వుంటుంది. కోపాన్ని తాత్విక దృష్టితో అణచుకోవచ్చును. కోపం వచ్చినపుడు రెచ్చిపోకూడదు. కాస్త తమాయించుకోవాలి. అది ఎందుకు పుట్టిందో, దాని పుట్టుకను తాత్విక దృష్టితో పరిశీలించాలి. ఈ పరిశీలన దాన్ని జయించడానికి తోడ్పడుతుంది. క్రోధాన్ని జయించగలిగినపుడు

జీవితంలో అనేక ఒడుదుడుకులు తటస్థించినా, వాటిని దాటి, మనిషి అచంచలమేరువు వలె నిలబడగలుగుతాడు.

♦ ♦ ♦

మన మనస్సుకు కష్టం కలిగించే సంఘటన సంభవించి నపుడు, అలా యెందుకు జరగవలసివచ్చిందో, తెలుసుకునే ఆలోచనాశక్తిని అది మనకు కలిగిస్తుంది. కారణం తెలిసినపుడు విచారం తగ్గుతుంది. కారణంలేని కార్యం లేదు. అది ప్రకృతి సూత్రం.

♦ ♦ ♦

ఒకవ్యక్తి ఒక పద్ధతిని ఏ పరిస్థితులవల్ల అవలంబించవలసి వచ్చిందో, అర్థం చేసుకోనపుడు అన్నీ అపార్థాలే. కనక అటువంటి అపార్థాలు కలగకుండా, వస్తు నిర్దిష్ట స్వభావాన్ని తెలుసుకోవాలి.

♦ ♦ ♦

చిత్తశుద్ధిగల వ్యక్తులు, తమయిందు లేనిపోని దోషారోపణ చేసినపుడు బాధ పడతారు. తాము యేది తప్పనుకుంటున్నారో, ఆ తప్పునే తాము చేసినట్లు యితరులు అంటున్నపుడు, అది వారికి ఆశ్చర్యముగాను, అవమానకరముగాను తోస్తుంది. ఆ తప్పును తెలిసో తెలియకో తాము చేసినట్లే భావించి ఆత్మను పరిశోధించుకుంటారు.

♦ ♦ ♦

ఒకరు ఒకదోషం చేస్తారు. లేదా అతను చేసినట్టు మనం అనుమానిస్తాం. అతన్ని మనం క్షమిస్తున్నపుడు, కొన్ని సాధారణ సూత్రాలను చెబుతూ యిదిమంచీ, యిదిచెడ్డా అని అతని నడవడిని కొన్ని సిద్ధాంతాలకు అన్వయిస్తాం.

♦ ♦ ♦

కొందరు, కేవలం తమ అనుభవాలను పురస్కరించు కొని వాటిని సామాన్యధర్మాలుగా పేర్కొంటారు.

*  *  *

ఒకడు ఒకదోషాన్ని చేసినపుడు, చాలాకాలం అయి పోయింది కదా, ఇక దాని పాపం తనకు అంటదనుకుంటాడు. కాలం గడుస్తున్నకొద్దీ కళంకం పోతుందనుకుంటాడు. కాని దోషం దోషమే.

*  *  *

కొందరు తమప్రవర్తన కొన్ని ప్రత్యేక సూత్రాలమీద ఆధారపడివున్నదంటూ గర్వపడతారు. అవే స్థిరమైనట్టు వాటిని దృష్టిలోపెట్టుకుని ఏది ధర్మమో ఏది అధర్మమో, సిద్ధాంతాలు చెబుతారు.

కొంతకాలం గడిచినపిదప, అదే వ్యక్తులప్రవర్తన తామిది వరకు చెప్పినమాటలకు భిన్నంగా వుంటుంది. ఈ భేదం క్షణిక మనోవికారాలవల్ల కలిగివుండవచ్చును; లేదా ఇదివరకటి తమ ప్రవర్తన, ప్రస్తుతం తమ అభిరుచులకు ఎంతమాత్రం సరిపడదని వారు గుర్తించడంవల్ల, వచ్చి వుండవచ్చును. కాదా అప్పటి ప్రవర్తనకన్న యిప్పటి ప్రవర్తనవల్ల సుఖము కలగవచ్చునని వారు భావించి వుండవచ్చును.

తాము చెప్పినదానికి, చేస్తున్నదానికి సంబంధం లేదని మనం అనేసరికి, వారు బాధపడతారు. తమ గౌరవ మర్యాద లకు హాని జరిగినట్లు భావిస్తారు. తమలోకలిగిన ఈ మార్పును సమర్థించుకుందుకు ప్రయత్నిస్తారు. వాదిస్తారు. లేదా అలాంటి మార్పు రానేరాలేదని బుకాయిస్తారు.

'అది నాయిష్టం; ఇదిచేస్తే లాభం' అన్నది అందరూ చెప్పే సమర్థింపులు. దేనినైనా సమర్థించుకుందుకు తెలివితేటలు వుంటే, వాదనలకేం కొదవ; అంతా తర్కబద్ధముగా వాదించవచ్చును!

♦ ♦ ♦

ఒక విషయాన్ని ఆలోచించేటపుడు దానికి అనుకూలముగాను, ప్రతికూలముగాను, కొన్ని వాదములుంటవి. మూర్ఖుడు తనకు అనుకూలముగా వున్నవాటిని పట్టుకుని, అననుకూలమైనవాటిని, అవి యదార్థమైనవయినా, వొప్పుకోడు. సబబయిన మనిషి తన వాదములో అర్థంలేదని తెలుసుకోగానే, దాన్ని ఒదులుకుంటాడు.

* * *

ఒకపని చేసేముందు, అది ఇతరులకంటికి ఎలా ఆనుతుందో ఆలోచించు.

♦ ♦ ♦

ఏపని చేస్తే తమ పరపతి పెరుగుతుందనుకుంటారో ఆపని చేయడానికి సాధారణంగా వ్యక్తులు తొందర పడతారు.

♦ ♦ ♦

ఒక పని మంచిదో కాదో, ఫలితాన్నిబట్టి తేలుతుంది. కొందరు చేసిన కార్యములు, వారు బ్రతికి వున్నంతవరకే జ్ఞాపకముంటాయి. మరికొందరు చేసిన కార్యములు వారి అనంతరము సైతం, జ్ఞాపకముంటాయి. ఏ కార్యములను ప్రపంచం సదా స్మరించుకుంటుందో, వేటిని విస్మరిస్తుందో, తెలుసుకోవడం మంచిది.

* * *

స్వలాభం మనిషిని ఎంతకాలం కాస్తుంది ?

* * *

ఒకపుడు మనిషికి అధిక ప్రాముఖ్య మిచ్చి, పొగిడి, తర వాత అతనిని తెగనాడడమనే దోషాన్ని ఎన్నడూ చేయకు.

* * *

కొందరు తమకుగల వ్యక్తిగత సంబంధాలను బట్టి ఒకరి గుణశీలములను ఎంచుతూ వుంటారు. అకారణంగా కొందరికి చూసీచూడగానే దురభిప్రాయాలు ఏర్పడుతూ వుంటాయి. అపుడు యోగ్యతను సైతం మెచ్చుకోలేని మానసిక దౌర్బ ల్యం దాపరిస్తుంది. విద్య, విజ్ఞానం పెంపొందుతున్నప్పటికి, అవి పోకపోవడం, చిత్రమే మరి.

* * *

కొందరు ఒకరిఎదుటవున్నపుడు, పని చేస్తున్నపుడు, నిర్బంధంలో వున్నట్లు అల్లాడిపోతారు. వారికి కలిగిన చిరాకు మొగములోనే కనబడిపోతుంది. ఎదటవారికి అపచారం చేస్తు న్నామని కాని, మనసు నొప్పిస్తున్నామని కాని, వారు సంకోచించరు.

* * *

జీవితంలో సమస్యలు వచ్చినపుడు వాటిని ఎదుర్కొం దుకు కొందరికి భయం. వాటిని తప్పించుకు తిరిగినంతమాత్రాన అవి తొలగిపోవు. కష్టాలను ధైర్యంతో ఎదుర్కొన్నపుడు ఆనం దం కలుగుతుంది.

* * *

బద్ధకం మనోదౌర్బల్యానికి చిహ్నం. శరీర దారుఢ్యం లేకపోవడంవల్ల పనిచేయలేని వ్యక్తులను పొడిచి లాభంలేదు.

పొడుచుకుతిని పని చేయిస్తే వాళ్లు మరీ దుర్బులౌతారు. కాని కొందరు శక్తి వుండీ, బద్ధకిస్తారు. అది వాళ్ళ స్వభావంలో వున్న బలహీనత. దీనిని ఎంత వేగంగా పోగొట్టుకుంటే అంత మంచిది. బుద్ధికి మాంద్యం రాకూడదు.

♦ ♦ ♦

ఒకరు మనల్ని అప్పు అడిగినపుడు యివ్వడానికి మనదగ్గర డబ్బు వుండదు. డబ్బు వున్నపుడు కొందరు అడిగితే, యిచ్చినది మరి చేతికి రాదు. రాకపోగా అన్నీ చిక్కులే.

ఒకరు మనల్ని అవాంఛనీయమైన ఏదో ఉపకారమో సదుపాయమో చేసి పెట్టమంటారు. అది చేసిపెడితే మనకీ బాగుండదు. విన్నవాళ్ళకీ బాగుండదు. ఆపని చేయడం న్యాయ విరుద్ధం. అలా చెప్పడానికి మనకు మొగమాటం.

అలా అడిగినవాళ్ళ మనసు నొప్పించకుండా మర్యాదగా వ్యవహరించాలంటే వాళ్ళ కళ్ళల్లోకి చూస్తూ అడుగుతున్నది శ్రద్ధగా వింటూ, అలా చేయడం అసాధ్యమని, అవాంఛనీయ మని మన చూపులతోనే సూచించి తెలిపిన పడాలి. మనచూపే మనకు శరణ్యం !

♦ ♦ ♦

ఏదో ఒక విషయంలో నిష్ణాతులమనే భ్రమతో గర్వపడే వ్యక్తులు తమ సలహాలను ఎవరైనా అడిగితే యిట్టే ఉబ్బి పోతారు.

♦ ♦ ♦

తామసం కళ్ళకు గంతలు కడుతుంది.

♦ ♦ ♦

'ఇ' అనే ఆవిడ, 'ఆ' అనే ఆవిణ్ణి నానా మాటలు ఆడిం దని, 'ఉ' అనే ఒకతె, 'ఆ'తో చెబుతుంది. ఇలా చెప్పడం 'అ'కు 'ఆ' మీద అభిమానంవల్ల కాదు. 'ఇ' అంటే 'అ' కు కడుపుమంట; పోనీ కడుపు మంటలేకపోయినా పుల్లింతాలు చెప్పడం ఆమెకు సరదా. జట్టీలు పెట్టడం ఒక వేడుక. కాదూ, తనకు 'ఆ' మీద ప్రేమ వున్నట్లు ఆవిడ అనుకోవాలని 'అ' తాపత్రయం. అందుకీ యిచ్చకం.

'అ' 'ఇ' మీద చెప్పిన పోటీలను 'ఆ' వింటుంది. విని ఊరుకోదు. ఆ చాడీలను నిజమని నమ్ముతుంది. నమ్మి తానే చెవులారా విన్నట్లు 'ఇ' తల్లివద్దకు పోయి నిలదీసి అడుగుతుంది. ఇపుడు 'ఈ' అనే ఆవిడ రంగంమీదకు క్రొత్తగా వస్తుంది. దానితో అ ఆ ఇ ఈ ఉ ఊ...లకు సిగపట్లగోత్రం!

♦ ♦ ♦

మానవుల జీవితంలో దాంపత్యం ప్రధానమైనది. జీవితాంతం, దంపతులు అన్యోన్యంగా వుండడం ఆనందదాయకం. భార్యా భర్తల సంబంధం చెడిపోతే, అది సమాజానికి అనర్థహేతువు. ఇప్పటి సమాజం, అనేక అనర్థాలతో కూడుకొని వుంది.

ఒకరి కాపరం విరగదీయడం మహాదోషం. ఒకనిపై యీసు కొద్దీ, కొందరు, అతని భార్య గుణశీలములను ఎన్నుతారు. అత్తవారి వంశం మంచిది కాదంటారు. లోపాలేమైనా వుంటే గోరంతలు కొండంతలు చేస్తారు. లేని లోపాలు వున్నవని పుట్టగిస్తారు. ఇది కేవలం దుర్మార్గం.

భార్యవద్ద భర్తను, భర్తపద్ద భార్యను చులకనచేస్తూ మాట్లాడకూడదు. అప్పుడు వారు ఒకరినొకరు హృదయమిచ్చి ప్రేమించుకోలేరు. వైవాహికవిధులను నిర్వర్తించుకోలేరు. అలాగే తండ్రిని కొడుకుచెంత, కొడుకును తండ్రివద్ద, తేలిక పరుస్తూ ప్రసంగించకూడదు. బంధువులు స్నేహితులు ఈ విష యంలో మెలకువతో వుండాలి.

జీవితము సుఖప్రదము కావాలని అందరూ కోరు కుంటారు. స్నేహితులమధ్య అభిప్రాయభేదాలు వచ్చినపుడు వాటిని సర్ది చెప్పవలెను. ఒకరి జీవితసౌఖ్యమును భగ్నము చేయడం, మహాఘోరం.

వ్యక్తులకు న్యాయదృష్టిని కలిగించగల నాటకీయపు లక్షణం, వ్యక్తులలో మృగ్యమైనపుడు, యిట్టి దుస్థితి ఏర్పడు తుంది.

♦ ♦ ♦

ఇరుపక్షాలతోనూ, స్నేహంగా వుండాలనుకున్న వ్యక్తికి ఎంతో ఓర్పూ నేర్పూ అవసరం. ఎంత కార్యదక్షతతో వ్యవ హరించినా, అలాంటి స్నేహితుణ్ణి, ఎవరూ సరిగ్గా అర్థంచేసు కోరు. అలా చేసుకోవడం అరుదు. చివరకు ఇరుపక్షాలతోను స్నేహం చెడుతుంది; లేదా ఛాయామాత్రంగా మిగులుతుంది.

అయితే ఇలాంటి స్నేహం నెరపుతున్నవాళ్లలో బల హీనుడు వుంటే, అతనొక పద్ధతిని అవలంబిస్తాడు. ఎవరిదగ్గర వాళ్ళమాటాడి, ఆఖరికి దొరికిపోతాడు.

ఏ రోటి పాట ఆరోటి దగ్గర పాడేవాడు ఆత్మవంచకుడు. పరవంచకుడు. తనలో లేనిది వున్నదని భ్రాంతి కలిగించే ఒక

నటుడు. కాని అతనికి ఒక చిక్కువుంది. తాను ఏ మాటలు మాట్లాడాలో, ఈ నటునకు ముందు వ్రాసిపెట్టి వుండవు. అందువల్ల చివరకు తాను వెర్రిపడిపోతాడు. వంచకుడు ఎంత నేర్పుగా నటించినా, ప్రజ్ఞావంతులకు యిట్టే తెలిసిపోతాడు. అన్నమంతా పట్టుకు చూడనక్కర్లేదు!

* * *

కొందరి పరిసరాలు పరిమితం. మసలే సమాజం చిన్నది. పదవివల్లో సంపదవల్లో, ఉన్న ఆ నలుగురికంటె, తాము అధికులైనపుడు వారి బడాయికి అంతువుండదు. లేని తెలివితేటలు ప్రదర్శిస్తారు. లేనిపోని గొప్పలు చెప్పుకుంటారు. అంతకంటె అధికులవల్లనో, సరిసమానస్థులవల్లనో పరాజితులైనపుడు సైతం, ఉత్తరకుమారప్రజ్ఞలే. ఎప్పుడూ వాళ్ళదే పైచెయ్యి!

• • •

కొందరికి అక్కరలేని విషయం, అక్కరకు రాని వస్తువు వుండదు. 'అది నాకు పనికివస్తుంది; ఇది నాకు కావాలి' ఇదీ వరస. మరికొందరికి అన్నీ తెలిసిన విషయాలే. ఏ వింతవిన్నా అది తమ కిదివరకే తెలిసినట్లు నటిస్తారు. ఏ నూతన వస్తువు కనిపించినా, అది తమకు వింతకాదు. ఇంతకంటె అజ్ఞానమ మరేముంది?

• • •

ఎవరికైనా తెలుసుకున్నదానికంటె, తెలుసుకోవలసింది ఎక్కువ.

* * *

కొందరు తమకుతామే ఒక మూఢవిశ్వాసాన్ని కల్పించుకొని, తెలివితక్కువపనులుచేసి వాటిని సమర్థించుకుంటూ కాలం గడుపుతారు.

♦ ♦ ♦

ఒక పదవినో, స్థితినో, చెప్పుకోతగ్గ వస్తువునో, పొందే వరకు అది గొప్పదని మనం అనుకుంటాం. అది సాధించిన పిదప ఆ ఆనందం కొంత కాలం వుంటుంది. కాలం గడిచినకొద్దీ దాన్ని అతి సామాన్యమైనదని భావించి, అంతకన్న గొప్పది కావాలని కోరుకుంటాం.

♦ ♦ ♦

ఒకడు ఉన్నతస్థితిలో వున్నాడనో, తాము తక్కువ వాళ్ళమనే ఆత్మనిరసనభావంవల్లనో, అతనంటు భయగౌరవాలవల్లనో, అతనికి తాము అపచారం చేశామనే ఎరుకవల్లనో, కొందరు వ్యక్తులు ఆమనిషి తారసిల్లగానే, విచిత్రమైన అవస్థలో పడిపోతారు. అతనితో మాట్లాడుతున్నపుడు స్థిమితం కోల్పోయి, ఒకవిధమైన మనోవికారాన్ని పొంది, బిడియ పడుతూ, చేతులతో పెన్సిలో, పెన్నో ఏదోఒక వస్తువును పట్టుకొని తిప్పుతూవుంటారు. ఇలాగ చేయడంవల్ల ఉక్కిరిబిక్కిరి తప్పి ఊపిరి పీల్చుకుందుకు వాళ్ళకు కొంచెం వ్యవధి చిక్కుతుంది. అవతలమనిషి మొగములో కనిపించే వ్యతిరేక భావాలను తాము కన్నెత్తిచూసే అగత్యం తప్పుతుంది.

కొంతమంది ఉత్తినే మెటికలు విరుచుకుంటూ ముక్కు సాగదీసుకుంటూ వుంటారు. వేళ్ళుచాపి చూసుకుంటూ వుంటారు. ఇవి బిడియంవల్ల పుడతాయి కాబోలు!

♦ ♦ ♦

ఉద్యోగుల, స్థితిమంతుల, లేదా తాను మన్ననచేసే వ్యక్తుల దయను పొందగోరిన దుర్బలుడు నానా అవస్థలూ పడ తాడు. అన్నింటికీ తల ఊపుతాడు. ఏదన్నా సరే అంటాడు. స్నేహపాత్రునివలె నమ్మకస్థునివలె, అమాయకునివలె నటిస్తాడు. వాళ్ళ ప్రతిస్పర్థులమీద పోటీలు చెబుతాడు. ఆఫీసులచుట్టూ ఇళ్ళచుట్టూ గిరగిర ప్రదక్షిణచేస్తాడు. ఒదిగి ఒదిగి లేనిపోని అణకువతో మసులుకుంటాడు. ఇతనొక కొత్తరకం బానిస!

♦ ♦ ♦

వ్యక్తులమధ్య నిరంతరం, ఆధిక్యతకోసం సంఘర్షణ సాగు తోంది. ఇది అర్హతను సంపాదించడంకంటె ఉన్నతోద్యోగాలను పదవులను పొందడంకోసం సాగుతున్న సంఘర్షణ. చాలామంది, ఉన్న యోగ్యత కంటె ఎక్కువ యోగ్యత తమకు కలదని అను కుంటారు. తమకంటె ఇతరులకు ఎక్కువ యోగ్యతవున్నా, దానిని అందరూ మెచ్చుకుంటున్నా, వారుమాత్రం, ఇతరుల యోగ్యతను లెక్కపెట్టరు.

♦ ♦ ♦

కీర్తిని వరించబోయి, కొందరు అపకీర్తి పాలౌతారు. మరికొందరు గొప్పను సాధించబోయి లేని గొప్పలకు పోతారు. తమను తాము అననుకూలపరిస్థితులలోకి తరుముకుంటారు. కొందరు గొప్పవారిని సంతృప్తి పరచబోయి ఎంతటి దాస్యాని కైనా తల వొగ్గుతారు. మరి కొందరు ఇతరులను సంతృప్తి పరుస్తూనే, తమవి సవ్యమైన పద్ధతులనే నమ్మిక కలిగి, తమ స్వాతంత్ర్యాన్ని కాపాడుకుంటారు. కొందరు ఒకరి యిష్టా యిష్టాల ప్రమేయం లేకుండా ఋజుమార్గాన నడుస్తారు.

♦ ♦ ♦

క్రమపద్ధతికి అలవాటుపడిన, శిక్షణపొందిన మేధకు ఏది క్రమం తప్పినా, రోతగా వుంటుంది. క్రమపద్ధతి మనిషికి ముఖ్యం. వస్తువులు వాటి స్థానాల్లో అవి వుండాలి. గాలీ వెలుతురూ వసతీ క్రమంతప్పితే అంతా అస్తవ్యస్తమే. సుఖం వుండదు.

♦ ♦ ♦

అంధవిశ్వాసాలు ప్రమాదకరమైనవి. ఇవి వ్యక్తుల కార్యాలను కార్యవిధానాలను తరచు నిర్దేశిస్తూ వుంటాయి. ప్రశ్నించే స్వభావం లేనపుడు గుడ్డి నమ్మకాలు కలుగుతూ వుంటాయి. మనల్ని ఛాందసత్వం తనను ప్రశ్నించనీయదు. సంశయాలతో ఉక్కిరిబిక్కిరి చేస్తుంది. అణకువతో పడివుండమంటుంది. ఈ అణకువ పిరికితనానికి లక్షణం. కార్యకారణ సంబంధజ్ఞానం శూన్యమైనపుడు, ఏది జరిగినా, అది కాకతాళీయం, వేళావిశేషం, విధికృతం, యాదృచ్ఛికం అని వ్యక్తులు ఊహించి సంతృప్తి పడతారు. ఆలోచనకు చోటివ్వరు.

♦ ♦ ♦

ఉపన్యాసవేదికలమీద ప్రజలపట్ల గాఢాభిమానాన్ని ప్రకటించే కొందరు దేశభక్తులు, సరిసమానస్థులను చూసి సహించలేరు. పదవిలో, పలుకుబడిలో, తెలివిలో, చదువులో, రూపములో అవతలివాడు తనకుపోటీ అని అనుకోవడమే యిందుకు కారణం. అంతటితో ప్రతిస్పర్థి లోపాలను మాత్రమేచూసి, అతని సద్గుణాలను గుర్తించరు. అతన్ని అపార్థం చేసుకుంటారు. అతని మాటలకు చేతలకు విపరీతవ్యాఖ్యానాలు చేస్తారు,

♦ ♦ ♦

పాటకపు జనుల స్థితిగతులను చక్కబరచి, వారిని అభివృద్ధికి తేవడం ప్రజాస్వామికపు లక్షణం. ఇక ఇట్టి దుస్థితిలో వుండుట తగదని ప్రజలకు బోధించి, ఉన్నతస్థితికి ఎట్లు రాగలరో వారికి నచ్చచెప్పవలెను.

• • •

భావనాశక్తి మానవులకు ఒకవరం వంటిది. ఇది మనుష్యులంతా సమానమే అన్న దృష్టిని కలిగిస్తుంది; మానవులను ప్రజాస్వామిక గుణసంపన్నులను కావిస్తుంది.

* * *

ప్రాచీన శిథిలభవనాలను, శిల్పాలను, అవశేషాలను చూసినపుడు మనం వ్యాకులపడతాము. వ్యాకులముతో పాటు మనకు ఆసక్తి కలుగుతుంది. ఆ వస్తువులచుట్టూ, జాలీ ఆసక్తి గొలిపే వాతావరణం అలముకొని వుంటుంది.

రూపుచెడని కోటకన్న రూపు చెడినకోట, విశేషించి దానికి చరిత్రతో అనుబంధము వున్నపుడు, మనకు ఎక్కువ ఆసక్తిని కలిగిస్తుంది. ఊహించుకుందుకు వీలున్నపుడు మన ఆసక్తి మరీ ఎక్కువౌతుంది. సహజంగా మనకు కొన్ని ఊహాలు పుడతాయి.

కొన్ని వందల సంవత్సరాల క్రితం ఈ కోటలో కొందరు నివసిస్తూ వుండేవారు. అనేకుల జీవితాలు వింతవింత అభిరుచులతో అనుభూతులతో, అనుభవాలతో ఆశలతో నిరాశలతో ఇక్కడ గడిచిపోయాయి. వాళ్ళ కష్టసుఖాలు, సుఖదుఃఖాలు ఎటువంటివో!

ఇక్కడివాళ్ళు ఒక్కొక్కప్పుడు అత్యంత ధైర్యోత్సాహా లతో ఇంకొక్కప్పుడు మహాభయాలతో కాలం గడిపివుంటారు. జీవితంలో అనేక జయాపజయాలను చవిచూసి వుంటారు. వీళ్ళ ఆశలతో నిరాశలతో, ఆనందంతో విచారంతో ఈ వాతావరణం ఒకప్పుడు నిండివుండేది. ముఖ్యంగా యిక్కడ నివసించిన చివరి తరం మనుష్యులు ఎక్కువ ఒడిదుడుకులను ఎదుర్కొని వుంటారు. అనేక కష్టాలు పడివుంటారు.

చారిత్రకంగా వీటి ఉనికి ఏమిటో !

• • •

ఒక ప్రదేశంనుంచి ఇంకొక ప్రదేశంలో వున్న వస్తువులను చూస్తున్నపుడు, ఆ వస్తువుల ఆకార పరిమాణాలను గురించి మనకు సరియైన దృష్టి ఏర్పడదు. అవి స్థలముల దూరముసుబట్టి మనకంటికి ఆనుతూవుంటాయి.

కాలం గడిచినకొద్దీ వస్తువులమూల్యములను గురించి మనకు ఎక్కువ ప్రామాణిక దృష్టి ఏర్పడుతుంది. అలాంటి అవకాశం కాలవ్యవధివల్ల మనకు కలుగుతుంది. సమకాలిక నిర్ధారణలు కొన్ని అపోహలతో కూడుకొని వుంటాయి.

బుద్ధిని స్మృతియందు లగ్నము చేసినపుడు ప్రజ్ఞాత్మక దృష్టి ఏర్పడుతుంది. అపుడు వస్తువు ప్రత్యక్షవీక్షణలోవలె, స్వస్వరూపముతో సాక్షాత్కరిస్తుంది. అనవసర వివరణలు చెదిరిపోతాయి. ఇదివరకు రెండింతలుగా కల్పించుకున్న అభిప్రాయాలు తొలగిపోతాయి.

అయితే, దీనికి వాస్తవికతను తగ్గించే లక్షణంవుంది. అపుడు సత్యము దూరంగా తొలగిపోతుంది. ఒకరుచేసిన దోషాలు

అవి ఏనాటివో కదా అనేభావం పుట్టి, వాటిని మనం నిర్లక్ష్యం చేస్తాము.

ఏ వస్తువునైనా, దాన్ని దాన్నిగా, వస్తుపరంగా వీక్షించి విలువలు కట్టవలెను.



# తిక్కన విరాటపర్వం *

విడుమర 1- వదలుట, మాను, విడి, విడుట. సుఖ ముండఁ బడయుదుమొకో ? = సుఖముగా నుండుటను బొందు దుమొ? సుఖము - ప్రథమ With adverbial force. యిప్పా టెందుఁ గలదె యొరులెవ్వరికిన్ 2- Idiom.

డగ్గుత్తిక వెట్టి 3 = గద్గద స్వరమువెట్టి. అపనోదంబు4 = Removing, పోగొట్టడము. అడఁగుట యును 5 = దాగి యుం

---

* ఒక గ్రంథాన్ని చదివినపుడు, దానిపై నోట్సు తీసుకోవడం మహాకవికి అలవాటు. వారు, కళాశాలలో పనిచేసిన తొమ్మిది సంవత్స రాలు, యీ పద్ధతిని అవలంబించినట్లు కనిపిస్తుంది. కాళిదాసు, భవభూతి, షేక్స్పియర్, మిల్టన్. వర్డ్స్వర్తు, అనేకుల గ్రంథాలపై వారు నోట్సు తయారుచేసుకున్నారు, ఇవికాక, తాము చదివిన గ్రంథాల మార్జినులలో తమ పరిశీలనలను వ్రాశారు.

"తాము కాలేజీలో బోధించే శాస్త్రములలో శ్రీమదానంద గజపతి మహారాజావారి ఆస్థానములో యే సాయంకాలము యేమి ప్రశ్నపడి, యెట్టి సూక్ష్మమైన శాస్త్రార్థము చేయవలసివచ్చునో అని హడలిపోతూ యెప్పటికప్పుడు తమ పాండిత్యమును పదునుపెట్టిన కత్తివలె నిత్య నూతనముగా వుంచుకోవలసిన వారైన అప్పారావుగారి వంటి పండితులు యెట్లు గ్రంథపరిశీలన చేయుచుండెడివారో ఎన్ని గ్రంథములు చదివే వారో, వారి డైరీలవల్ల కొంత గోచరించుతుంది"- డాక్టర్ బుర్రా శేష గిరిరావుగారు, ఎం. ఏ; పి. హెచ్. డి.

ఘుటయును ? యిట్లు పడిన వీరలు - పడిన = Suffer, పాట్లు పడిన. భంగపాటు దీర్చికొనుము 6- Idiom.

తన చిత్తము కలఁకదేఱి 7 - Can be explained thus-Idiomatic absolute- తన చిత్తము కలఁకదేరగా-చిత్తము కలక - సమాసము; తేరి = తేట జేసికొని - Causative.

---

1 క. ఒకనాఁడేమును నాపదలకు విడుమరఁగాంచి విప్రులం జుట్టలఁ బెట్టుకొని సుఖముఁడఁ బడయుదుమొకొ యిప్పాటెందుఁగలదె యొరులెవ్వరికిన్.

2. మహాకవి భావవ్యక్తీకరణపద్ధతిని ఉన్నది వున్నట్లుగా సూచించుటకు, ఆంగ్లపదాలను తెలిగింపక, అలాగునేవుంచాను. క్రియల అర్థవిశేషమును తెలిపేవి క్రియావిశేషణాలు. వీటినే ఆంగ్లమున ఆడ్వెర్బులని అంటారు. నామవిశేషణాలకు క్రియావిశేషణాలకూ తెలుగుభాషలో రూపభేదం నామమాత్రమైనది. ఆంగ్లభాషలో అలా కాదు. "ద్రావిడభాషలలో క్రియావిశేషణంగా వ్యవహరింపబడుతున్న ప్రతీ పదమున్నూ సవిభక్తికనామమో, అవిభక్తికనామమో అయి వుంటున్నది. లేదా అది ధాతురూపమన్నా, కాదా, తుమున్నాద్యర్థకమన్నా అయివుంటుద"ని కాల్డ్వెల్.

3వ. అని డగ్గుత్తిక వెట్టి దుఃఖపరవశుండగుటయును 4 తత్పార్శ్వంబుననున్న ధౌమ్యుండు దదీయ విషాదాపనోదంబు సేయం దలంచి.

5 సీ. అదితిగర్భంబున నవతారమై వామనాకారమున హరి యడఁగుటయును.

6 ఆ. వినమె యిట్లుపడిన వీరలు పదపడి తమకు సగ్గమైన తఱి....నీవును నాపద కోర్చి భంగపాటు దీర్చికొనుము.

7 క. అనవుడు నప్పలుకులు విని తనచిత్తము కలఁక దేఱి ధర్మతనూజుండనుజన్ముల దెసఁ జూచిన ననిలసుతుండిట్టు లనియె నాతనితోడన్.

ఏపడరి - ఏపు + అడరు mean about the same thing as nouns - అడరి = విజృంభించి; ఏపు = Prowess 8. ట్రేల్మి డిన = చిటికలో = త్రుటి.

కౌరవ్యాంబుజశ్రేణిఁ జిక్కువడం జేయదె 9 — చిక్కువడ is weak. An elephant plays havoc with lotuses. 10

అరదమ్ములతోడ 11 = అరదమ్ములమీద; రేయి + ఇమ్ములు = రేయిమ్ములు. వేగుటయు = తెల్లవారగ; తోన రుగుదేర = తోరాగా = తోడరాగా;

---

8 ఏపు = ఆధిక్యము, అభివృద్ధి, ఉత్సాహము, విజృంభణము, గర్వము, విలాసము, అనే అనేకార్థములలోను, అడరి = అతిశయించి విజృంభించి, విస్తరించి, ఒప్పారి, కలవరపడి అనే వివిధార్థములలోనూ భారతమున ప్రయుక్తము.

9. మ. భవదాజ్ఞాదృఢబంధసంయమితశుంభద్వేగమై కాక నాఁ
డనలీలన్ మనయర్జునద్విపము క్రోధావేశదుర్దాంతద
ర్పవిలాసోద్భటభంగి నేపడరి కౌరవ్యాంబుజశ్రేణిఁ జి
క్కువడం జేయదె యొక్కట్రేల్మిడిన నీకున్ వేడ్కసంధిల్లగన్.

10. 'చిక్కువడ' అనేపదము పేలవము. పద్మములపై విజృంభించే ఏనుగు, వాటిని నానాధ్వంసమూ చేస్తుంది; తుత్తునియలు చేస్తుంది. ఇట్టి అర్థస్ఫూర్తిని కలిగించేటంతటిశక్తి 'చిక్కువడ' అనే శబ్దానికి లేదని భావము.

11 ఉ. తమ్ములు ధౌమ్యుఁడున్ సతియుఁ దా నరదంబులతోడఁ గ్రోశమా
త్ర మ్మొకచోటి కల్లఁ జని ధర్మతనూభవుఁ డందు నాఁటిరే
యిమ్ములఁ జల్పి వేగుటయు నీప్సితకార్యము సేయగా....

At this time కళింగ was about కురు 12. మీకుం జూడం బోలినయెడ 13 = మీకు చూడగా తగినటుల గన పడిన చోట. విరటుమనము వడయుదము 14 = We can please the mind of Virata.

అతని వేడుకకుఁ దగన్ 15 = అతనికి వేడుక కలుగు నట్లుగా. షష్ఠి - Gerundial; adverbial force. చాతుర్యము మెఱసి - Idiom.

మరి 16 = తరి.

---

12 వ. కురుజనపదంబుచుట్లం బాంచాల చేది మత్స్యసాళ్వ విదేహబాహ్లిక దశార్ణశూరసేన కళింగమగధదేశంబులు సుభిక్షంబులు జనాకీర్ణంబులును నతిస్థిరంబులునై నివాసయోగ్యత గలిగి యున్నయవి యని విందుము....

ఆ కాలములో కళింగదేశము కురుదేశానికి చేరువనే వున్నది.

13.... వానియందు మీకుంజూడం బోలినయెడఁ దగిన చందం బున నిలుచువారముగాక యనినం బ్రియంబంది ధర్మనందనుం డిట్లనియె.

14 క. మనలోన నెవ్వఁడెమ్మెయి పనివెంటను విరటుమనము
వడయుద మది యె
ల్లను నేర్పరించి యందఱుఁ దనతనమది నున్న తెఱఁగు
తథ్యమ చెప్పుఁడా.

15 క. సన్యాసివేషమున రాజన్యునిఁ గని యెపుడుఁ గొలిచి
సభ్యత్వమునన్
మాన్యుఁడనై పుణ్యకథా విన్యాసమొనర్తు నతని వేడుకకుఁ
దగన్.

16 క. ఆతనితో నొక్కొ_క్క మరి కౌతూహలవృత్తికిం దగం
దొడఁగి మృదు

చేతోముద మొదవ- Idiom. Is it a mannerism? 17 మణిమయమ్ములు!8 ... The order of the metals is changed19. మణులు వెండి బంగారు. exigencies of metre. కలవు, నాకు- Col 20. నాకున్నాయి. వరుసతోడ is expletive 21.

తొరగ=కారు; Drop.

అడంచి = Supress 22. కడిమిమై సౌగంధికమున...23 Is not అట్లు an expletive ? 24. కడిమి = పరాక్రమము. Why does the poet use కడిమిమై instead of కడిమిని- కడిమితో; తో - గా; 25. అమ్మెయి = ఆ ప్రకారము. రూపఱం జేసి = విగతరూపునిచేసి; అట్లు, అమ్మెయి, ఆభంగి, అప్పాట;

---

ద్యూతంబునఁ గ్రీడింతుం జేతోముద మొదవ నక్షశిల్ప
ప్రౌఢిన్.

17 అంతకుముందే ధర్మరాజు తాను విరటుని మెప్పిస్తానని రెండుసార్లు చెప్పినాడుకదా; మళ్ళీ అదేమాటను మాటిమాటికీ ప్రయోగించడం తప్పని అలవాటు కాబోలును।

18 తే. మణిమయమ్ములుఁగలధౌతమయములును సువర్ణమయములు
నాదిగా వలయునట్టి
యద్దసాళులు గలవు నా కభిమతముగ వానిఁ గొనిపోయి
చూపుదు వరుసతోడ.

19 లోహముల క్రమాన్ని చెప్పేటపుడు వరస తప్పినది.

20 Colloquial; వాడుకలోవున్న పదము. 21 పాదపూరణార్థము ప్రయోగించిన పదము.

22 ....అనిలతనయు నిరీక్షించి తత్కాల జనితంబయిన ఖేదంబునం దొరఁగ నమకట్టు బాష్పజలంబులు మగుడ నింకించుచు నిట్టూర్పు లడంచి ధైర్యం బవలంబించి యిట్లనియె.

పుట్టెను కోలెను. కోలెను = వద్దనుంచియు; పుట్టినప్పట్నుంచీ 27. నెసకమెసగు frequently used by తిక్కన. (Draw a vertical line over superflous న) 28 దర్పమున ననవర్తిల్లు. గరగరగా = రుచిగా. చిత్తమునకు వచ్చిన 29=col ఇష్టంవచ్చినట్టు. చవులయందలి 30 = యందును? అందలి is an adjectual locative. మీఱంగ expletive 38?

---

23 సీ. కడిమిమై సౌగంధికమున యక్షుల మదమడఁచి కృష్ణకుఁ
బువ్వులట్లు దెచ్చెఁ
గిమ్మీరదానవు నమ్మెయి నిర్జించి విగతకంటకముఁ గావించె
వనము
బకదైత్యుఁదొడరి యాభంగి రూపఱఁజేసి రక్షించె నేక
చక్రాపురంబు
నప్పాటఁ బ్రబలు జటాసురు నదరి దండింతుఁ జేసి మనలఁ
బెట్టించు కొనియె....

24 'అట్లు' అనే పదము పాదపూరణార్థము ప్రయోగింపబడినది కాదా? 25 కడిమిని, కడిమితో అని అనడానికి బదులు కవి కడిమిమై అని ఎందుకు ప్రయోగించెనో.

27 తే. ఇతఁడు పుట్టినకోలెను నెసకమెసఁగు దర్పముననవర్తిల్లు
నుదగ్రహృదయుఁ
డకట యొరుచిత్తమున కెక్కునట్లుగాఁక మెలఁగి యేమి
విధంబునఁ గొలుచువాఁడు.

28 ఎసకమెసఁగు = ఆతిశయించు; పెంపొందు. తిక్కన ఈ పదమును తరుచుగా ప్రయోగిస్తూవుంటాడు.

29 తే. ఏను వంటలవాఁడనై యానరేంద్రుఁగొలిచి గరగరగాఁగూడు
గూర చిత్త
మునకు వచ్చినచందంబు ననయొనర్చి నేర్చి మెలగుదుఁ
గరము వినీతి మెఱసి.

ప్రొయ్యిడుదు = పొయ్యిలో వుంచుదు ? కట్టియలకు - do not ask for గొడ్డలి for spltting 32. కలిగిన 33 = ఉన్న. మల్లుతనము Sansk మల్లః; ప్రాకృతం: మల్ల త్తణం = మల్లుతనం. ఉక్కఱ = ఉక్కు + అఱ = సత్తువ పోయేటట్టు. మదము, పొగరు. తక్కటి = తక్కిన. పెక్కండ్ర 34 = పెక్కు-మంది col బహుమంది, చాలా మంది, విశేషమంది, యెంతో మంది. పోరున-here న is నందు; loc. పోరులో- In this dist పోరు is not used in this sense 35. యేవిఁటీపోరు ! యీ అల్లరి! అతికేకలు వేయుట.

ఈ పోరాటం - పోట్లాట is possibly from పోట్లు 36. చంపుట ఉడుగుదు Idiom. చంపుట మానుదుin usage ఉడుగు is Intransitive 37. To stop; To refrain from. చంపుట నుండి ఉడుగుదు. ఎంతయు=ఎంతో;

---

30 ఉ. ఆఱురసంబులం జవులయందలిక్రొత్తలు పుట్ట నిచ్చలున్
వేఱొకభంగిఁ బాకములు విన్నను వొప్పుఁగఁ జేసి చేసి న
న్మీఱఁగ బానసీని నొకనిం బురిఁ గాననియట్లు గాఁగ మేన్
గాఱియ వెట్టి మైన నొడికంబుగ వండుదు నెల్లగూరలున్.

31 మీఱఁగ అనే శబ్దము పద్యపాదమును సరిపెట్టుటకు ప్రయోగింపబడినదా ?

32 తే. పఱియవాపంగఁ దునియగా విఱువ వలయు నెడలఁ గాఱులఁ జేతులఁ దొడలఁబట్టి
కడఁగి యనువుగఁజేసి ప్రొయ్యిడిదుఁగాని కత్తిగొడ్డలి యడుగ నేఁ గట్టియలకు.

33 క. సూపాధ్యక్షుఁడు గలిగిన నా పురుషునితోడ సఖ్యమగు నట్లుగ నే

అదియునుగాక = 38 అదిగాక, అంతేకాక. Is అంతే wrong39 ? అంత.+ఏ = అంతే. కోలుపులి = పెద్దపులి. ఎను పోతు = ఎనుబోతు. ఉన్మదకరి (-?) మదకరి, ఉన్మత్తకరి. Is not ఐనను repeated needless 40?

కోలుపులిం గారెనుమును మత్తకరిం గ్రుద్ధసింహ...
బెట్టిదముగ = with force కాలఁగేలను = కాలాచేతా = కాళ్లాచేతులా. అనంగలవాడ41 = అనబోతాను = అంటాను; అనవలసినవాణ్ణి. అమ్మోయి (Frequent) 42.

---

నేపాటనైన నడవఁగ నోపుమఁ దత్తద్విధప్రయోగముల
మెయిన్.

34 క. పెక్కండ్ర నొక్క పోరను నుక్కఱ భంజింతుఁ జంపు
ఁ బుడుగుదు రాజుం
దక్కటిచూపఱు లెంతయు వెక్కసపడఁ జిత్రగతుల విహ
రింతుఁ దగన్.

35. 'పోరులో' అనే పదము ఈ అర్థమున విశాఖజిల్లా వాడుకలో లేదు. 36 పోట్లు అనేదానినుంచి పోట్లాట బహుశా వచ్చివుంటుంది.

37. ఉడుగు - అకర్మకక్రియ,

38 చ. అదియునుగాక కోలుపులినైనను గారెనుపోతునైన ను
న్మదకరినైన నుగ్రమృగనాథునినైనను గిట్టి ముట్టి బె
ట్టిదముగఁ గాలఁ గేలను గడిందిమగంటిమి యుల్లసిల్లఁ బ
ట్టుదు నడఁగంగ మాత్స్యుఁడు గడున్ వెఱఁగందుచుఁ బిచ్చ
లింపఁగన్.

39 'అంతే' అనే ప్రయోగము తప్పా యేమిటి? గీ. అట్టికన్నులు లేవనుటంతెకాక.... (నన్నయ)

40 మీది పద్యములో ఐనను అనే శబ్దము మాటిమాటికీ అనవసరంగా ప్రయోగింపబడలేదా.

ఆ ఖండలుడున్న గద్దియ-ఉన్న=కూచున్న. ఉండు 43=కూరుచొను.

అరిగినయెడ - ఎడ= time 43. సేసికొని=చేసుకొని. the ఉ in సు objects in కొని. చేసుకొని is looser than చేసికొని 44. మాటు 45 =Cover.

ఉత్తమకన్యాజనులకు - should it not be కన్యాజనమునకు? This is an elegant verse 46. The ప్రాస is obtrusive. అతని మెచ్చింతున్ = మెప్పింతున్ 47. ఇది వోలున్ = సరిగ్గా వున్నది. నకులుని వలనుసూచి=నకులుని వైపు చూసి. వలను = towards. దిక్కు, వైపు. గదుర = అతిశయించు; వ్యాపించు. ఉమ్మలికము = దుఃఖము 48. ఒప్పెడు49 - Beautiful; delicate; used by itself independently like ఒప్పారు-ఒప్పెడు

---

41 వ. అమ్మహీపతి నీవెవ్వరివాఁడవనిఁ యడిగెనేని ఖాండవాగ్రజునకు ఖానసంబు సేయుదునంగలవాఁడ ననిన విని ధర్మజుండమ్మెయికి సమ్మతించి....

42 'అమ్మెయి' అనే పదము తరుచుగా ప్రయుక్తము,

43 ఉ. ఖాండవమేర్చె దేవతలఁ గానని యీశ్వరుఁ గాంచె దోర్బలో
ద్దండ మహాసురప్రతతి దర్పమడంచి ప్రియం బొనర్చి యా
ఖండలుఁ డున్న గద్దియ సగంబుననుండె మహానుభావుఁ డీ
తండొక మర్త్యుఁ జేరి....

అరిగినయెడ=వెళ్ళినపుడు: కాలము సూచితము. వ. అమరనగరంబున కరిగినయెడ. 44 చేసుకొని అనే పదానికి చేసికొని అనేదాని కంటె బిగి తక్కువ.

45 .... పేడితనంబుదాల్చి బాహులదీర్ఘత్వంబునకు గుణకిణంబులకుఁ గంచుకంబును శంఖవలయంబులును మాటు సేసికొని ....

మేను. పెంపు = nobility. ఔదార్యము-పెంపుగల యుల్లము. డెప్పరము = ఆపద, అశక్యము, దుస్సహము.

---

46 క. ఉత్తమకన్యాజనులకు నృత్తము గఱపంగ నాకునేర్పుగలదు త
ద్వృత్తమునకు నన్నేలుము చిత్తమునకు నెక్కఁ బనులు
సేసెద నందున్.

ఇది సౌకుమార్యముగల పద్యము. ప్రాస ప్రయత్నపూర్వకము. 'ఉత్తమకన్యాజనులకు' అనేది ఉత్తమకన్యాజనమునకు అని వుండ వద్దా.

47....లాసికతనమున నిపుణుండనై అతని మెచ్చింతున్.

48 తే. అనిన నిది వోలునని యియ్యకొని యజాతవైరి యల్లన నకు
లుని వలను సూచి
నెమ్మనంబున నుమ్మలికమ్ము గదుర నెలుఁగుచందంబు
వేఱుగా నిట్టులనియె.

49 ఉ. ఒప్పెడుమేనుఁ బెంపుగల యుల్లము నాగరికంపుఁజందముం
జెప్పక చూప కీతనివిశేషము దెల్పెడుఁ గొల్చుటెంతయున్
డెప్పర మేమిసేయుదున్....

# బిరుదులు

పూర్వం యుద్ధానికి పోయేటపుడు రాజులు తమతో పాటు కొన్ని బిరుదచిహ్నాలను తీసుకువెళ్ళే ఆచారం వున్నట్లు కనిపిస్తుంది. యుద్ధరంగంలో పరాజితులై, కౌరవులు వదలి పెట్టిన బిరుదులను అర్జునుడు తనతోపాటు తీసుకుపోయినట్లు తిక్కన తన విరాటపర్వంలో పేర్కొన్నాడు. *

సంస్కృత మహాభారతమున బిరుదుల ప్రస్తావన కలదో లేదో వొకసారి పరిశీలించి నిర్ధారణ చేసుకోవాలి. సూర్యభాను, చంద్రభాను, మరాతబు మొదలైనవి రాజచిహ్నాలు. ఇవి బిరుదసహితములో కావో సందేహం. అయితే గండభేరుండ సాల్వ బిరుదసహితరాజచిహ్నములు. ఇవి పతాకాలపై గుర్తుల రూపంగానో బొమ్మలరూపంగానో సూచితము.

---

* వ.... అర్జునాననంబు నాలోకించి ధార్తరాష్ట్రరక్షణతాత్పర్యంబున శౌర్యంబు సాలించి భీష్మవాక్యప్రకారంబు సేసి రిత్తుందఱు ముందర దమవచ్చినవంకన తిరిగి యరుగుచున్నం గని కిరీటి శంఖరవజ్యానాదంబులు సెలంగఁ గొండొకదవ్వు వెన్నడిందటిమి బిరుదులతోడి గొడుగులు నడియాలంబులతోడిసిడంబులును వైపించుకొని తృప్తిం బొంది మరలువాఁడై యెల్లవారును వినం బెద్దయెలుంగునం బోయి వచ్చెదనని చెప్పి గాంగేయద్రోణకృపాచార్యులకుఁ బ్రణామబాణంబు లేసి వారి వీడ్కొనినవాఁడై మిట్టకోలల రారాజుమకుటంబుమణులు డులిచి .... ....

జైమినిభారతకృతిభర్త * సాళ్వగుండ నరసింహునిది ఆత్రేయసగోత్రం. ఈ విషయాన్ని వివరించి చెప్పవలసివుంది.

అతని సేనాధిపతిపుత్రుడు నరసింహుడు ♦ తుళువవంశస్థుడైనప్పటికి, తాను సాళువవంశీకుడునని చెప్పుకున్నాడు. శ్రీకృష్ణదేవరాయలు తాను సాళువవంశస్థుడనని ఎక్కడైనా చెప్పుకున్నాడో లేదో నిర్ధారణ చేసుకోవాలి. రాయపలైసాళువ...

---

* సాళువ నరసింహరాజు : 1487-1490. విజయనగరరాజ్యపు తూర్పుభాగానికి అధిపతిగా వుండి అనేక యుద్ధాలలో ఆరితేరినవాడు. రెండవ దేవరాయలు అనంతరం అతని కుమారులు మల్లికార్జునరాయలు విరూపాక్షరాయలు వరసగా విజయనగరరాజ్యాన్ని పరిపాలించారు. విరూపాక్షరాయల్ని అతని తమ్ముడు చంపించగా, అతన్ని పరాజితుణ్ణి చేసి రాజ్యంలోంచి వెళ్ళగొట్టి సాళువ నరసింహరాజు తాను ఆరాజ్యాన్ని ఆక్రమించుకున్నాడు. అంతటితో ఇంతవరకూ దండనాయకులుగావున్న సాళువ వంశమువారు విజయనగర రాజ్యాధిపతులయారు, విజయనగరంలో నరసింహ విగ్రహప్రతిష్టాపకుడు యితనే. గొప్ప పరాక్రమశాలి. అన్యరాజులు ఆక్రమించిన భూభాగాలను తన అధీనం చేసుకొన్నాడు. జైమినిభారతమును రచించిన పిల్లలమర్రి పినవీరన యితని ఆస్థానకవి.

♦ తుళువ నరసరాజు: 1490 - 1509. ఇతను తుళువ ఈశ్వరరాజు కొడుకు. సాళువ నరసింహరాజు అన్న మనుమడు. సాళువ నరసింహరాజు తన అవసానదశలో ఇతన్ని పిలిపించి, తన ఇద్దరి కొడుకుల్నీ అప్పగించి వాళ్ళు పెద్దవాళ్ళయేవరకూ రాజ్యభారాన్ని స్వీకరించవలసినదిగా కోరాడు. తన కుమారులు పెద్దవాళ్ళయాక అందులో ఎవడు బుద్ధిమంతుడో అతనికి రాజ్యం యిమ్మని ఆదేశించాడు. కాని నరసరాజు అలా చేయక తానే రాజుఅయాడు. ఇతనికి ముగ్గురు భార్యలు. వారిపేర్లు తిప్పాంబ, నాగాంబ ఓమాంబ. తిప్పాంబకు వీరనరసింహరాయలు, నాగాంబకు కృష్ణదేవరాయలు, ఓమాంబకు అచ్యుతదేవరాయలు జన్మించారు.

ఎందులో వున్నదో మరి!...బిరుదములు కొనియె...ఇవి ఎక్కడో చదివినట్లు నాకు బాగా జ్ఞాపకం.

పరాజితుని బిరుదులు వశంకాగానే విజేత వాటిని వహిం చేవాడా? బహుశా వాటిని మార్చి తన కన్వయింప చేసుకొనే వాడు కాబోలును!

• • •

## శ్రీ పూసపాటివారి బిరుదావళి

స్వస్తి సమస్త పంచమహాశబ్ద మహామండలేశ్వర రాజ పరమేశ్వర దుర్జయ వైరికులాచలామరేంద్ర మత్తవైరి గజ మృగేంద్ర శౌర్యగాంగేయ కుంతకౌంతేయ యలరాజరక్కాశ పరబలకర్కాశ మల్లికావల్లభా భయలోకదుర్లభ రణరంగభైరవా రాజన్యగౌరవా సమరజయోత్సవ సహాకారబాంధవ చండికా ప్రియ గండధనుంజయ ఆహవభీమ అరిబలరామ విమతరౌద్రక విక్రమశూరక బహుశాస్త్రపరిరక్షక కలుషవీరభద్ర కరవాల రుద్ర అరిరాయపురిగరుడ దయావల్లభ అరిగిరికులిశాయుధ శౌర్యచక్రాయుధ ఉత్తమగజవాహినీరోహణ జలదగంభీర జగదేకవీర గర్వితరిపురాయ కదనసంహార మేదినీరాయ మృగ వేటకాడ మండలీకరగుండ మహితప్రచండ సమరదోర్దండ చల మేచ్చుగండ వసబిరుదరగండ బిరుదురాయరాహుత్తురాయ మానవేశ్యాభుజంగ మత్సరరిపురాయమానభంగ గుంగిమంగి తలగుండుగుండ చాళుక్యరాజ్యస్థాపనాచార్య నొడ్డియరాజ మానజాల కళింగరాజ్యప్రళయాంతక కిమిడిరాయమాన వేశ్యాభుజంగ పాండ్యగజరాజసింహచోళభల్లాణగోధూమ ఘట్టనఘరట్ట భోజరాజదిశాఘట్టణ అద్రిదావానల నెల్లూరెల

మంచికంచిద్వారకాపురినిర్ధూమధామా• లాటగౌళనేపాళ పురిసర్వస్వాపహరణ కృష్ణవేణీజలక్రీడాపరాయణ అష్టసహస్ర దంతిదశలక్షవాజివల్లభా। సేతుశీతాద్రి హేమాద్రి బిరుదశాసన స్తంభ పరమవైష్ణవ శ్రీజగన్నాధనారాయణదేవదివ్య శ్రీపాదపద్మారాధకులైన శ్రీ వశిష్ఠగోత్రపవిత్ర అను జనార్ధన బెజవాడి పాటి నిల్పిన బుద్ధవర్మ మాధవవర్మ చిక్కభీమ మొదలగు పూసపాటి రాజాన్వయ విజయబిరుద ప్రసిద్ధి. విజయీభవ విజయీభవ-

## ధనంజయ గోత్రీకులది

స్వస్తి సమస్త పంచమహాశబ్ద మహామండలేశ్వర రాజపరమేశ్వర యీశ్వరపదవీవిరాజమాన విజయవినోద సిద్ధవధూ మంగళా సూత్రాహరణ యేకాంగవీర వీరకామినీ కచాహరణ షట్సహస్రాశీతిగ్రామావనీవల్లభా మల్లచోళసింహ్వాచోళ శార్దూలమత్త మాతంగ హరిరాయాస్థానగజసింహ బౌద్ధకంధ కుద్దాల పాండ్యరాయామగ ధనంజయగోత్రపవిత్ర కాంతే ఘనాతే కుమారాయాంచామ్లా.

రాజు పేరు జయమెచ్చుగండండు బంటు పేరు పగమెచ్చు గండండు ఖడ్గంబు పేరు కాలమృత్యువ రేవు పేరు పాపవినాశనంబు నది పేరు కృష్ణవేణి దేవర పేరు అమరేశ్వర దేవుండు పట్టణంబు పేరు ధరణాలకోట వాటి పేరు శ్రీ ధాన్యవాటి వీటి పేరు గండర గండవీడు పడగ పేరు గండభేరుండలలాటసిలా టంకంబు ఘూర్ణరజ్వాలంబు మాళవమహేశ్వరమన్నెతోరణంబు భద్రసముద్రబడబాలనంబు కేరళకుంతలముయ్యు విహారమండపంబు పాండియమాండూకా సర్పరకార్పాశతోరణంబు శకశుక

సామాన్యంబు నతివహించిన హోమదత్త దేవరయేలిన కుమారుండు హరిసీమకృష్ణుండు శ్రీ విష్ణువర్ధనుండు అంబర దేవర భూపాలుండు మొదలయ్ను శ్రీ కోటరాజుల అన్వయ విజయ బిరుద ప్రసిద్ధి. విజయీభవ విజయీభవ—

## కాశ్యప గోత్రీకులది

స్వస్తి సమస్త పంచమహాశబ్ద మహామండలేశ్వర రాజ పరమేశ్వర ఉద్దండ మండలాగ్ర ప్రచండ నెలబడుగండ పెషిణీ (పెశిణీ) హన్మంత త్రిభువనీరాయరాహుత్తరాయ ధనుర్విద్యా హరణ విజయప్రతిహాతి షణ్ముఖా ఆశ్రితజనకల్పవృక్షా అసుదు భూతిరాయమానమర్దన అష్టదింక్కురాయాంచామ్లు నహిపట్న పతే రాయాంచామ్లు దేశబహుతొక్కుళో రాయాంచామ్లు దంచు గండు చిచ్చులో రాయాంచామ్లు కుటుల దేదేబాకు దేదే కుమర మీసరగండ మిసమండలీకాంచామ్లు రణే భార్గవ రాణివాస ముఖత గతే రాయాంచామ్లు యియ్యబిరుదుమదియ్యకొని మనియ్య మత్సనడే కాత్తె ఘనాతే కుమారరాయాంచామ్లు యోగ నంద నరసింహ్వదేవు దివ్య శ్రీపాదపద్మారాధకులైన శ్రీకాకిత రాజులన్వయ విజయ బిరుదప్రసిద్ధి. విజయీభవ విజయీభవ—

## కౌండిన్య గోత్రీకులది

స్వస్తి సమస్త పంచమహాశబ్ద మహామండలేశ్వర కల్యాణ కటకసింహ్వసనాధీశ్వర బిరుదులకోట బిరుదులగజాంకుశ పరగండభైరవా అప్రతీపప్రతాప కుంతిసింహ్వసనాధీశ్వర నాస్తింబరగుంతీ మృగేంద్ర కుమారనాయాంక భీమప్రతిరూప బ్రహ్మరాక్షస త్యాగ మహారాయాంకుశ తపోవరగండ అయో

ధ్యాపురవరాధీశ్వర దన్నాడరాయరాహుత్తువేశ్యాభుజంగ యెక్కినకొమ్మపొడుచుదక్షిణసాధక దర్పణప్పుకొయ్య పందిటి మీదిగుండు పడనున్నపిడుగు దారాఘూరాంచామ్లా తిసివర్న మండలీకరగండ హన్మంతుతలాటలా హుళేంచామ్లా విరిగివచ్చు వీడుచొచ్చురాయాంచామ్ల శ్రీ కౌండిన్యగోత్ర పవిత్ర అను జనార్ధనదేవుదివ్యపాదపద్మారాధకులయిన వర్నాటికులుండు రాజేంద్రచోడుండు అతని కుమారుండు పెదచెన్నభూపాలుండు మొదలయిన వర్నాటరాజులు అన్వయ విజయబిరుద ప్రసిద్ధి. విజయీభవ విజయీభవ—

మరియు శ్రీమన్మహామండలేశ్వరుండును మహీమండలరాయండును మన్నెసరత్రాణుండును దర్భజకులకలశరాకాశశాంకుడును హోసబిరుదగండాకుండును ధారాపురీగహనదావధనంజయుండును గండధనుంజయుండును మేదినీరాయమృగవేటకారుండును వీరకేదారుండును కృష్ణవేణీజలక్రీడావినోదపరాయణుండును ఖడ్గనారాయణుండును దుర్జయకులకులాచలకంఠీరవుండును రణరంగభైరవుండును మాళవరాజమస్తకశూలంబును కర్ణాటరాజకందకుద్దాలంబును వైరిరాజోరగవైనతేయుండును శౌచగాంగేయుండును వీరసేతుప్రతాపభాసురుండును రామభురీధరుండును నెల్లూరుయల మంచిలికంచిదేవగిరిచూరకారుండును ఆంధ్ర కటక వజ్రప్రాకారుండును మానగోవిందనామధేయుండును కుంతకాంతేయుండును విజయవాటికా సింహాసనాధ్యక్షు మాధవవర్మాన్వయలలాముండును ఘోరాహవభీముండును కనకదుర్గాప్రసాదలబ్ధవైభవుండును గరుడభైరవధ్వజప్రాభవుండును కొలిపాకపురీధవుండును సహకారబాంధవుండును దశలక్ష

హయాష్టసహస్రగజవల్లభుండును మల్లికావల్లభుండును లాటభోటచోళగౌళాదిరాజపురసర్వస్వాపహారుండును పరిచ్ఛేది వంశాభరణంబును బిరుదరాయరాహుత్తవేశ్యాభుజంగుండును కళ్యాణరాజదుర్మదవిభంగుండును సేతుసీతాచలస్తోదయాద్రి బిరుదశాసనస్తంభవిభ్రాజితుండును భారుహామన్నెగండపెండేర విరాజితుండును కిమిడెరాయమానవిభాళుండును గుంగిమంగితల గుండుగండండును మండలీకరగండండును కరవాలరుద్రుండును విమతవీరభద్రుండును బల్లాడగోధూమఘట్టనఘరట్టుండును భోజరాజదిశాధట్టుండును చాళుక్యరాజరాజ్యస్థాపనాచార్యుం డును ఒడ్డియరాయమీనజాలికవర్యుండును జలదుర్గదేవిమన్ని యనివేశుండును స్థలదుర్గకేతవరపట్టణాధీశుండును వనదుర్గ మొగలితుర్త్రిప్రభుండును నగదుర్గానంతగిరివిభుండును యెల రాయరక్కెసరాయుండును తెల్లదలాటరాయుండును ననం బ్రసిద్ధంబులైన భవదీయవంశ్యుల బిరుదంబులన్నియు నీ యందన్వయర్థంబులై యున్న వది యునుంగాక—

అరిబలంబుల నందపురపుశైలమునొద్ద మర్దించి గజపతి మాన్యుడయ్యె

భూరిసైన్యములతోఁ బోదివి బెల్లముకొండ సాధించె నిశ్శంక సాహసమున

ధట్టించి లగ్గలు పట్టించి చేకొనె ప్రబలుడై శ్రీరంగరాజుకొండ

బల్లిదుడై యోడపల్లె గైకొనియె విపక్షులందరు పటా పంచలుగను

త్రిభువనీరాయబిరుద ప్రదీప్త రావుసింగన జయించె పెద వీటిచెంత బోదవి

కలన శరణన్న బాహాదిఖాను గాచె రాజభూపాలు
తమ్మధరావరుండు.

—శ్రీకృష్ణవిజయము *

అని నందాపురశైలసన్నిధి గజేంద్రానీకముంగూల్చియం
దెనసెన్ శ్రీగజపత్యభిఖ్యు గుడశైలేంద్రుండు శ్రీరంగ రా
జనరేంద్రుండల యోడపల్లె విభుడున్ జన్యంబునం దోడఁ గై
కొనియెన్ వారల పట్టణంబుల సిరుల్ ఘోరప్రతాపంబునన్.

—ఉషాభ్యుదయము +

---

* ఇది అయిదు ఆశ్వాసముల ప్రబంధం. నరకాసురవధాదులు యిందు వర్ణితం. దీనిని రచించిన కవి పూసపాటి తమ్మభూపాలుడు. ఆయనకే తమ్మిరాజు అని యింకొక పేరు. "ఇంద్రకీలాద్రిచెంత నిరుపమంబైన కృష్ణవేణీతటమున" బెజవాడను రాజధానిగా చేసికొని రాజ్యమేలిన మాధవవర్మ సంతతివాడు. ఈ కవి పదిహేడవ శతాబ్ది ఉత్తర భాగంలోవున్నట్లు గురజాడ అప్పారావుగారి నిర్ధారణ. కీ. శే. అడిదము రామారావు పంతులుగారు "ప్రౌఢదేవరాయలకు సమకాలికుఁడగు పూసపాటి రాచిరాజీతమ్మభూపాలునకు నారుతరములు క్రిందటివాఁడు. తరమునకు 30 సంవత్సరములు చొప్పున లెక్కించి చూచినయెడల నీ కవికాలము 17వ శతాబ్దముయొక్క యుత్తరభాగమునకు సరిపోవుచున్నది" అని వ్రాస్తూ ఈ కవికాలాన్ని కొన్ని ఉపపత్తులతో క్రీ. శ. 1620 - 1700 గా నిశ్చయించారు. (చూ: విస్మృత కళింగాంధ్రకవులు)

+ ఇది అయిదు ఆశ్వాసముల ప్రబంధం. ఉషానిరుద్ధుల పరిణయం ప్రబంధకథావస్తువు. కవి పూసపాటి వేంకటపతిమహీపాలుడు. ఇతని కాలం: క్రీ. శ. 1660 - 1720; అన్నమరాజు మనుమడు. కృష్ణమరాజు పుత్రుడు. తల్లిపేరు కేసమాంబ. "క్రీ. శ. 1757 సంవత్సరమున బొబ్బిలియుద్ధములో వీరస్వర్గము గాంచిన విజయరామరాజునకు నీ వేంకటపతిమహీరాజు పెదతండ్రి. ఈయన తమ్ముఁడును, విజయ రామరాజు తండ్రియునగు ఆనందగజపతిమహారాజు బాలుఁడైయున్న

కాలమున నీ వేంకటనృపాలుఁడే రాజ్యభారమును వహించి తమ్మునికిగాఁ బరిపాలన మొనర్చుచుండెను" (చూ: విస్మృత కళింగాంధ్రకవులు)

మీదను ఉదాహృతములైన శ్రీకృష్ణవిజయ, ఉషాభ్యుదయ పద్యములనుబట్టి గజపతి అనే బిరుదు పూసపాటివారికి తమ్మిరాజు కాలంలో వచ్చిందని చెప్పవచ్చును.

### రే చ ర్ల వా రు

పంచవాద్యాయ దళవిఫాళ : the conqueror of the armies of those who had the five sounds, that is the 'Pancha nahasabdas'.

కాకతిరాజ్య స్థాపనాచార్య : who reestablished the kakati throne.

సోమకుల పరశురామ : the destroyer (పరశురామ) of the race of the moon.

సర్వబిరుద కుమార వేశ్యాభుజంగ; కంచికవాటచూరకాళ

### రే పా ల వా రు

నిడ్డవోలు వీరక్షేత్రాణో భారతీకమల్ల; పర్వ రాజ్య స్థాపనాచార్య; తెల్ల తలాటరాయ రాహుత్త వేశ్యాభుజంగ కోలాహక నాయంకరగండ.

### వి ప్ప ర్ల వా రు

గండభేరుండ తలాటరాయరాహుత్త వేశ్యాభుజంగా వేంగి చాళుక్య హన్యాలవోడు గండ ఏకాంగివీర

### మి రి యా ల వా రి ని

భారామండలీకచ్ఛాప్లా కాకతిరాజ్యస్థాపనాచార్య కన్నరళవిభళ. సాహసహనుమంత బసవశంకరయువరాజ్య

స్థాపనాచార్య సామంతకుమార ఖండెరాయ కోరుగంటి పిన్నని తలగుండుగండ విజయరాయుని దిశాపట్టా సాహసార్జున కృష్ణవేణీ జలక్రీడావినోదా ఉత్తారుగండ దండోరు మండలీకర గండా.

## పునుగోటివారు

సరగరుద్రదేవుని వున్మపట్టణంబుగట్టిన కాకతిరాజ్య స్థాపనాచార్య

## పట్నార్లవారు

పంట్లరకోటకాంగా కళ్యాణిచూరకాడ పర్వగోకర్ణుని దక్షిణభుజాదండా

## మట్నాళ్ళవారు

నల్లతలాటరాయరాహుత్తవేశ్యాభుజంగా ఏకాంగివీర ఉత్తమగండ రణరంగభైరవ కొంకణ దిశాపట్ట రణరంగభీమ బసువశంకరబిరుదంబుగైకొన్న మహామేటిప్రతాపశూర బిరుదరాజభయంకర చోడకటక వజ్రప్రాకార సంగడి రక్షపాలక బిరుదుగైకొని.

## మల్లెలవారు

హోసబిరుదురగండ వొడ్డియదళవిభాళ రాయదండి పెదమోట్ట గండమన్నియల మోరచిక్కమ గరుడతలాట రాయ రాహుత్తవేశ్యా భుజంగ.

## మారుట్లవారు

శరభ తలాటరాయ రాహుత్త వేశ్యాభుజంగ

## పా నె ప ల్లి వా రు

మాదిమదిరుగు బిరుదుకు మానాయకాచ్చామ్లా గుది గుంట వీరక్షేత్రణే జంరుఘా నిలపంచఘట్టా

## జ మ్మ లూ రి

వలసిన రాజుకు పళ్ళప్రసాదమున్నూ వల్లనిరాజుకు ఖడ్గ ప్రసాదమున్నూ వలసిన రాజుకు జగధాభి వల్లనిరాజుకు వృప దాఫి.

## రుక్మక (చెరుంతువారు)

నెల్లూరు వీరక్షేత్రశే భారతీకమల్లా పంచపాత్రి (ది) యలరాజ్యస్థాపనాచార్య యెరుగంది వీరక్షేత్రశే భారతీ కమల్లా.

## ప సు పు నూ ళ్ళ వా రి వి

అరిగండ భైరవ (గండినళించె) కలుబరిగిచోరకార కాకతిగణపతి... రక్కసా.

## ప ల్ల వ ళ్ళ వా రు

చంద్రగిరిసోమనాథునిర్ది (ది)శాపట్టా ఘూసూరి పాంళ్చత్య మంగనిదళ విఘాలా

## వే ట కూ రి వా రి వి

రణరంగభైరవ మల్లికావల్లభ గండధనుంజయ యల దాయ రక్కసా బుద్ధవర్మదావంశోద్భవా.

## వే స ట్ల వా రి వి

వద్దిటిమీరిగండా వద్దనున్నబిడుగా నీళ్ళలోనిముల్లా దెప్పరపుకొయ్యా దున్నాలకోటిరాయరాహుత్తవేశ్యాభుజంగా.

శ్రీ మ ల్లె వా రి వి

చలమ_ర్తిగుండా తిక్కయ్యతలగుండుగండా ఆహూరి గంగని సప్తాంగహరణా.

ఆ దూ ళ్ళ వా రి వి

తెరాసామంత జలధి బడబానల గండభేరుండా ఉభయ రగండ యలవరాజ్యస్థాపనాచార్య తెల్లతలాటరాయ రాహుత్తవేశ్యా భుజంగ,

వా లూ రి వా రు

కంచిచూరకారా జగమల్లుతలగుండుగండ గంగేశ్వర భైరవునిపురంబు నాటబొడిచి దండించి సురలాంఛనము దెచ్చిన చలమ_ర్తిగండా.

పే ర నూ ళ్ళ వా రు

ఛల్లానారాయణి దళభయంకరా భారామండమకర గండ మేదినీరాయమలవరగండ

దౌ భ్య రు ల వా రి వి

రాజనాయక రాజాధిరాజ రవికులతిలక రణరంగభైరవా భనివార సిద్ధమాధవా మర్మమశ్వవిస్తారా బెజవాడ దుర్గాంబికా లబ్ధప్రసాదకా

అ ర ట్ల వా రు

బల్లరగండ రుద్రబిరుదు బ్రహ్మరాక్షస కొరిపాక గొకు త్రినేత్రా త్యాగసింహాసన

42

రఘురాజ రాజ్యస్థాపనాచార్య పిరిణీ హనుమంత నవ బిరుదర వేశ్యాభుజంగ

43

కొమరవెల్లి కల్యాణచూరకారా గడిమన్నెభీమ్మా[illegible]కతి రాజ్య స్థాపనాచార్య

44

పరబలభీమ పరగబేకీలుగండా

45

ప్రతాపరుద్రమహారాజుపట్టపదంతాకార

మంగిపూడివారివి

బిరుదు నాయకురాది రణరంగరాఘవత్రాణ సహస్ర బాణ

51

పేరిణీ హనుమంతా దక్షిణపురీ సాధక అయోధ్యాపుర వరాధీశ్వర

52

కటక చూరకారా హరిరాయ వెన్నుసంపేట.

పాలూరివారివి

వోసబిరుదుకమరవేశ్యాభుజంగా - కొత్తబిరుదులు - నెత్తిపిడుగా వెంగిరాయ మానుమర్దన.

పైడిముక్కలవారు

కన్నిదేవునితలగుండుగండా యేర్వగోకర్ణుని దక్షిణ భుజదండా.

పాయేటివారు

అరికాల మండలీకరగండ దేశింగురాయ భయంకర

పూర్వడివారు

బారామన్నెకుమారనాయకాచ్చామల్లా నడిగినమాట రెండాడేనాయకరగండా

నరమాలవారు

రణరంగమల్ల ఆహవమల్లా రామరాజ్యస్థాపనా చార్యా తిభువనకటకలమిండ నరుగొండ.

నింగివెల్లివారివి

త్యాగకులవంశ త్యాగకుల మహాకుండలేశ్వర మరులమెట్టు
63
కటారచూరకార కటారసామంతరగండా రణముపాడ గని రాజుతో మంతనము చేశేచ్చామల్లా.

ధాన్యవోలువారివి

స్వామిద్రోహిమురారి తలగుండుగండా యేల్వారాజ్యస్థాపనాచార్య

గూడూర్వారివి

కోటలగొంగా కారమనాయకరగండా కొండమ్రాజ సప్తాంగచూరకారా యవ్వనరాజ్యదురంధరా.

పల్లవులవారివి

పల్లవాదిత్య పల్లచక్రవర్తీ పల్లవత్రినేత్రా పట్టుకరారి రాయజనవశంకర రాయపుల కోటగట్టుముదువరగండా గండభేరుండా ఉజ్వలతలాటరాయరహుత్తవేశ్యాభుజంగ.

పట్కనూరివారివి

ప్రజమెచ్చుగండ భారమన్నియరగండ నగళ్ళమంతన మాడేనాయకరగండ దళముచలాచితోలగివచ్చె నాయకాచ్చామల్లా.

గూ దే వా రి వి

మల్లికమార్తాండ కానంగిదిశాపట్ట అల్లకల్లోల

గుం డె క వా రి వి

కాకతిపో జకార్యధురంధరా

అ ను గం టి వా రి వి

అప్రతీకమల్లా తేరాసామంతా గండరగండా గండబేరుండా భటాచ్చా.

గుం దే టి వా రు

గండరభరణా గండరధనుంజయా మండలీకరసంస్తుత్యాపర్వరేంద్రుని దక్షిణభుజాదండా

అం ప ల్లి వా రి వి

హిరినాయకరగండ

జ య ప ట్ల వా రి వి

మద్రనాపిడుగా మగనితలచూరకార

శె ల వో రి వా రు

చెంచుమన్నియఘిఫాల

చె ర్కు నూ ళ్ళ వా రు

అలివరుఖాన్ తలగుండుగండా పాలకొండరణరంగస్థల రిపురాయభయంకర

పె ను గొం డ వా రు

ఔదుంబరాభరణామల్లా ఖండేరాయభటాంతరదోర్వంతర అరిరాజమండలీకల తలగుండుగండా.

ఏకాంగివీర means one who would fight by himself unassisted.



# *కన్యాశుల్కము రచన: ప్రదర్శన: ప్రశంస

గురజాడ అప్పారావుపంతులుగారు రచించిన కన్యాశుల్కమను తెలుగు నాటకమునకు స్వామి వ్రాసిన ప్రొలోగ్ +
(13-8-92)

శ్రేయోదేయా త్పరమ పురుషః పావనః పాపహారీ
దూరీ భూతాగ్రహలవతయా నిర్భయం చింతనీయః
సద్వాఽసద్వాయ ఇదమఖిలం సృష్ట్వా నిచ్ఛయా దౌ
నిస్సంగాయ నిఖిల మవధూయాంత రా స్వా దయంతే.

(నాంద్యంతే సూత్రధారః)

---

* కన్యాశుల్కం ప్రథమ ముద్రణం : 1897 జనవరి మొదటి తేదీ. రచనాకాలం : అంతకు అయిదేళ్ళకు పూర్వం. 1892 ఆగస్టు నెలలో జగన్నాథవిలాసినీ నాటకసమాజంవారు కన్యాశుల్కాన్ని ప్రదర్శించారు. అదే తొలిప్రదర్శనం. నాటి ప్రదర్శనాన్ని ప్రస్తావిస్తూ 1892 ఆగస్టు 26 తేదీన విజయనగరం నుంచి వెలువడుతూవుండే 'ది తెలుగు హార్ప్' అనే ఆంధ్రాంగ్ల పత్రిక వొక సమీక్షను ప్రచురించింది.

కన్యాశుల్కము కృతిసమర్పణోత్సవ సందర్భంలో అది పునః ప్రదర్శితమయింది. నాడు కళాశాలలో ఉపాధ్యాయులుగా పనిచేస్తూవుండే నిష్ఠల చలపతిశాస్త్రిగారు గిరీశంపాత్రను అభినయించి ఆనందగజపతి మహారాజావారి ప్రశంసలను పొందారు. ఆ కాలంలో గిరీశం పాత్రను అభినయించే వారిలో మండపాక కొండలరావుగారొకరు.

వీరు మహాకవికి బంధువులు. ఎఫ్. ఏ. క్లాసులో ఆయనకు శిష్యులు. చిన్నతనంలోనే లలితకళలలో ప్రావీణ్యం సంపాదించిన వ్యక్తి. హస్త లాఘవాది విద్యలను ప్రదర్శించడంలో నేర్పరి. నాటకాలలో స్త్రీ పాత్ర లను ధరించి చిన్నతనంలోనే పెద్దలమన్ననలను పొందినవారు. కొండు భట్టీయంలో చిత్రితమైన సాహేబు పాత్రయందు కొండలరావుగారి లక్షణములు ద్యోతకమౌతవి.

+ ఈ ప్రొలోగ్‌ను రచించినవారు నాటి విజయనగర ఆస్థాన పండితులు ముడుంబై వరాహనరసింహస్వామిగారు. ప్రదర్శననాడు దీనిని పఠించినవారు మేదేపల్లి వెంకటరమణాచార్యులవారు. తమ నాయనగారు భద్రపరిచివుంచిన ఈనాందీభాగాన్ని దయతో మాకిచ్చిన శ్రీ మేదేపల్లి వరాహ నరసింహస్వామిగారికి మాకృతజ్ఞత. వీరు విజయనగరం మహారాజావారి ఆంగ్ల కళాశాలలో రసాయనిక శాస్త్రశాఖాప్రధానాచార్యులుగా పనిచేసిపదవీ విరమణానంతరం తెలుగుభాషాసమితి అధ్వర్యమున వెలువడనున్న భౌతికరసాయనిక శాస్త్ర సంపుటానికి సంపాదకులుగా నియమితులైనారు.

కీ. శే. మేదేపల్లి వెంకటరమణాచార్యులు గారు (1862-1943) జననం: విశాఖపట్టణం జిల్లా అనకాపల్లిలో. వీరి చిన్నప్పుడే వీరిజన కులు రఘునాథదాసుగారు ఉద్యోగరీత్యా విజయనగరంలో స్థిరపడ్డారు. రమణాచార్యులుగారు మెట్రిక్యులేషను పరీక్షలో ఉత్తీర్ణులై సుప్రసిద్ధ సంస్కృత పండితులు మంజులనైషధాది సంస్కృతనాటకకర్తలు పరవస్తు రంగాచార్యులవారివద్ద, ఆనందగజపతి ఆస్థానవిద్వాంసులు, ఉభయభాషా ప్రవీణులు ముడుంబై నరసింహాచార్యుల వారివద్ద వేదాంత విద్యను అభ్యసించారు. ముడుంబై వరాహస్వామివారివద్ద ద్రావిడాగమ పరిశ్రమచేసి మహారాజావారి కళాశాలలో సంస్కృతపండితులుగాచేరి నలభైతొమ్మిది సంవత్సరాలు పనిచేసి 1936 లో విశ్రాంతివేతనాన్ని పొందారు.

వీరు రచించిన ముద్రితగ్రంథాలు: దేవవ్రతచరిత్ర; ఆంధ్ర గీర్వాణశరగోపసహస్రము: ప్రవరసేనుని సేతుబంధ మహాకావ్యానికి

కాలోఽసౌ చామరాణాం భువి భువి విపణై ర్వి_స్తృణాతీ
వకాశై

రారణ్యా తు(తపానాం ఘనాశ్చాతప(త్రాణి శు(భ్రాః
(పాగు(ద్రేకేణ గత్వా స్ఫుటమతి బలినాసంగమే మధ్య
మానాః

పారావారేణ కార్శ్యం సరిత ఉపగతా మందమందం
వహంతే॥

(సభాముద్దిశ్య)
చిత్రైః (ప్రాసాదశృంగై ర్మకుటగణమివస్వీయ
శీర్షేషుధత్తే
జాలద్వారాదిబద్ధై స్తరళరుచిఘనై ర్దర్పణైః పశ్యతీవ
క్లిష్టాస్వర్నిర్జయే నే త్యలమివ మరుతావీజ్యతే యాధ్వ
జాగ్రైః
అంభోధేర్నాతి దూరే విజయనగరనామ్న్యస్తి సా
రాజధానీ॥

---

(ప్రాకృతమునుంచి తెలుగున అనువాదము. బాణుని హర్షచరిత్రకు ఆంధ్రానువాదం. అలంకారశాస్త్రచరిత్ర; పాకృతభాషోత్పత్తి, నిఘంటు చరిత్ర; కులశేఖరాళ్వారుల (ప్రబంధము; గీర్వాణభాషలో ల్యాంబ్స్ షేక్స్పియర్ కథలు. ఇత్యాదులు.

వావిళ్ళవారు (ప్రకటించిన భాస్కరరామాయణము గోపీనాథ రామాయణము, ఆముక్తమాల్యద, శీతారామాంజనేయ మనే యోగ శాస్త్రము, మొదలైనవాటికి విపులమైన పీఠికలు.

అముద్రిత (గ్రంథాలు: విభీషణశరణాగతి; ఉపనిషద్విద్యలు; విశిష్టాద్వైత మతసం(గహోపన్యాసము; పాతంజలయోగశాస్త్రము.

కించ తస్యాంచ రాజధాన్యాం ఆంగ్లేయవైద్యకవిరచిత విమల వివిధౌషధ సుసమృద్ధా వైద్యశాలాః ఆంగ్లేయ భాషా మహాపాఠశాలాః సర్వకళాశిల్పశాలాః బాలికాపాఠశాలాః సంగీత నాట్యాది స్థానాని దీనజనరక్షార్థ పరికల్పితా అన్నశాలాః, తదా తదా విజ్ఞేయ విశేషాంశోపన్యాసోచిత సభా స్థానాని, ద్రష్టవ్య ప్రదేశాశ్చ, బహూనిచ రమ్యాణి రాజోద్యానాని, బహూన్యతివిమలాని రాజభవనాని, అశ్వ రథ గజపదా

తం, నానాయుధవాహినీ సభేయు సు శిథిల చతుష్కూటం, మళ్ళ దుర్గం విచిత్రాణి చయంత్రాణి సంతి। తామధితిష్టన్న సావానంద గజపతిర్నామ మహారాజోఽయమపూర్వః పరిదృశ్యతే। తథాహి సామాన్యేన రాజభి రాశాస్య మానే తు కేవల ధనే అనేన గ్రంథ ధన మపార మాశాస్యతే। ఏవ మన్యై రాష్ట్రే కేవలే శ్రద్ధయా పరిశీల్యమానే విద్యారాష్ట్రమనవరతమవలోక్యతే। తథే తరై ర్బాహ్యాశత్రుషు నిరస్యమానేషు అనేనాంతశ్శత్రవో నిరస్యంతే। యస్య నికటే శ్రుతిస్మృతీతిహాసపురాణాగమ వేది నో ధర్మోపదేష్టారః షడ్దర్శన నిపుణాః నిరూపకాః కావ్యాలం కార ప్రపంచధారిణ స్సాహిత్యపరాః కవయో మహాకవయా గాథకా దైవజ్ఞాః సంస్కృత వివిధనాటకప్రయోక్తారో నాటకి నశ్చసంతి। కించ ఆంగ్లేయపాఠశాలాదిక్కృతా ఇతరేచ ఆంగ్లేయ విద్యా శాలినః ప్రాప్తోత్తమపరీక్షాప్రశస్తిపత్రాః। పరం నిపుణాః విప్రప్రచురావిద్వాంస ఏనం సేవంతే। తేష్వే కోయమాంగ్లేయభాషాకవిర్గురుజాడ వెంకటప్పారాయ నామా షేక్స్పియర్ మోలియర్ బెంజాన్సన్ ఇత్యాది మహా కవి గ్రంథ నిరంతర పఠనాదరీ ఆంగ్లేయనాటక క్రమ మాంధ్రే ష్వవతారయితుం కుతుకీ, ఆంధ్రేపి గ్రంథభాషాయా అగ్రాంధిక ద్రష్టృజనాబోధ్యస్వభావప్రయోగతయా తాము పేక్ష్య స్వభావప్రయోగయోగ్యామానుభావికీం కేవల వ్యవహార రూపాం ఆంధ్రభాషామాదాయ ఆంగ్లేయీామేవ నాటకపద్ధతి మవలంబ్య కన్యాశుల్కంనామ నాటక మకార్షీత్। తద్వయం ప్రయోక్తు మారభా మహే, అనుమతి మనుగృహ్ణంతు మహాం తోభవంతః.

శ్లో॥ అన్యైశ్చపార్థివై రత్ర కాంత్యా మాణే పరంధనే
అనేన కాంత్యతే రాజ్ఞా నానాగ్రంథ ధనంమహత్॥

శ్లో॥ పాల్యతేஉన్యైర్నృపై రాష్ట్రం విద్యారాష్ట్ర మనేనతు
అంతశ్శత్రు నిహంతాయం బహిశ్శత్రు హరాః పరే॥

శ్లో॥ పండితై స్సేవ్యతే నిత్యం నానాశాస్త్ర విచక్షణైః
ఉపాస్యతే శథాంగ్లేయ విద్యా వ ధ్భిరయం విభుః॥
ఆంధ్రేపి సంఘటయితుం ఆంగ్లేయం నాటకం క్రమం
అగ్రాంధికీ మాంధ్రభాషా మాదాయ సుఖబుద్ధయే॥
కన్యాశుల్క ప్రహసనమకార్షీ ద్రూపకం మహత్
వ్యాసవంశజగన్నాథ సహాయోప చితావయం.

అర్ధం : నిస్సంగులై నవాళ్ళు దేనికీ ఎడమీయకుండా తమ మనస్సులలో ఎవణ్ణి నిక్షేపించుకొని ఆనందిస్తారో, ఎవడు ఇచ్ఛామాత్రంచేతనే సదసత్తులను సృజించాడో, లవలేశమూ ఆగ్రహం లేనందువల్ల ఎవడు నిర్భయంగా చింతింపతగినవాడో పావనుడై పాపాలను హరించే వాడెవడో అట్టి పరమపురుషుడు శుభాలను ఇచ్చుగాక !

(నాంద్యంతమున సూత్రధారుడు ప్రవేశించి)

రెల్లు పూవులు పూయడంవల్ల వింజామరలఅంగళ్ళను ప్రతిచోటా విస్తరింపచేస్తున్నదానివలెనూ, అరణ్యక్షేత్రపులకు తెల్లని మేఘాలతో వెల్లగొడుగుల్ని సమకూర్చుదానివలెనూ ఈకాలం వున్నది. తొలుత, నదులు ఉద్రేకముతో ప్రవహించి మహాబలవంతుడైన సముద్రునితో సంగమించి మథింపబడినవై మందమందంగా కృశత్వమును పొందుతున్నవి.

సౌధశిఖరాలనే కిరీటాలను ఏరాజధాని తనశిరస్సులపై ధరియిస్తున్నదానివలెనూ ద్వారప్రదేశాలలో కిటికీలసమీపంలో అమరివున్న కాంతివంతములైనఅద్దాలనే నేత్రాలతో చూస్తున్న దానివలెనూ స్వర్గనగరితో పోటీపడి జయించి అలసిపోవడంవల్ల జండాలను పూని గాలిచే వీచబడుతున్నదానివలెనూ వున్నదో అట్టి విజయనగరము సముద్రానికి అనతిదూరంలో విరాజిల్లు తున్నది.

ఆ రాజధానిలో ఆంగ్లేయవైద్యశ్రేష్ఠులు తయారు చేసిన మంచిఔషధాలుకల వైద్యశాలలు, ఆంగ్ల పాఠశాలలు కళాశాలలు, శిల్పశాలలు, బాలికాపాఠశాలలు సంగీత నాట్య ప్రదర్శనశాలలు, పేదలకోసం కట్టించిన సత్రాలు, సభలకు సమావేశాలకు తగిన మందిరాలు, చూడతగిన రమ్యప్రదేశాలు, అనేక రమణీయమగు రాజోద్యానాలు, అతివిమలమగు అనేక రాజభవనాలు, చతురంగబలాలు, వివిధాయుధములుగల సైన్యము, నిరంతర జనసమ్మర్దమైన చవికెలు, రాతితో కట్టిన కోట, వివిధయంత్రాలున్నూ కలవు. దాని పరిపాలకుడు ఆనంద గజపతి మహారాజు అపూర్వుడై భాసిస్తున్నాడు. అది ఆలాగునే కదా!

సామాన్యంగా రాజులు ధనాన్నే కోరుకొంటారు; కాని ఇతడు అపారమైన గ్రంథధనాన్ని అపేక్షిస్తాడు. ఇతరులు స్వరాష్ట్రాన్ని కాపాడుకుంటూవుంటే ఇతను విద్యారాష్ట్రాన్ని కాపాడుకుంటాడు. ఇతరులు అంతమొదించేది బాహ్యశత్రువు లను; ఇతను నాశనమొనరించేది అంతశ్శత్రువులను.

ఇట్టి ఆనందగజపతి ఆస్థానంలో శ్రుతిస్మృతిపురాణ ములు ఆగమములు ధర్మశాస్త్రములు షడ్దర్శనములు మొద

లగు వానియందు ఆరితేరిన పండితులు, కవులు, గాయకులు, నటకులు, సాహిత్యపరులు, రసజ్ఞులు ఎందరోవున్నారు. వీరితో పాటు ఆంగ్లేయవిద్యాప్రవీణులు, ఆభాషలో ఉత్తమపరీక్షల ఉత్తీర్ణులై ప్రశంసాపత్రాలను పొందిన అనేకులు, ఆనందగజపతి మహారాజును సేవిస్తూవుంటూరు. అలాంటి ఆంగ్లవిద్యావేత్త లలో వొకడును, ఆంగ్లంలో కవిత్వంచెప్పగలవాడును, షేక్స్పి యర్, మోలియర్ బెంజాన్సన్ ఇత్యాది మహాకవుల గ్రంథ నిరంతర పఠనాదరుడును ఆంగ్లేయనాటకక్రమాన్ని ఆంధ్రమున అవతరింపచేయడానికి కుతూహలము కలవాడునూ అయిన గురజాడ వేంకట అప్పారావు గ్రాంథికాంధ్రము జనసామాన్య మునకు తేటతెల్లంగా తెలియనిది కావడంవల్ల దానిని ఉపేక్షించి స్వభావయోగ్యమైన వ్యావహారికభాషను స్వీకరించి ఆంగ్లేయ నాటకపద్ధతిని అనుసరించి కన్యాశుల్కమనే నాటకాన్ని రచించి నాడు. ఆ నాటకాన్ని మేము ప్రయోగించడాని కుపక్రమిం చాము. పూజ్యులైన మీరు అనుమతింతురు గాక !

## 'తెలుగు హార్పు' సమీక్ష

మన స్థానికనాటకసమాజం వారిచే గతశనివారం రాత్రి కన్యాశుల్కమనే స్వతంత్రనాటకం హృదయంగమముగా ప్రదర్శింపబడింది. ప్రదర్శనశాల ప్రేక్షకులతో కిటకిటలాడుతూ వుండెను. డబ్బుకాశపడి తల్లితండ్రులు తమ కుమార్తెలను ముసలివాళ్ళకై నాసరే యిచ్చి వివాహంచేసి తమకు కాబోయే అల్లుళ్ళవద్దనుంచి ధనాన్నిపొందే కన్యాశుల్కమనే దురాచారం ఎట్టి దుష్ఫలితాలకు దారితీయగలదో చూపడమే ఈ నాటక లక్ష్యం. ఇలాంటి దురాచారాన్నిమాన్పించి సంస్కరించవలెనని

మన మహారాజావారు ఎంత కాలంనుంచో హృదయపూర్వకంగా వాంఛిస్తున్నారని సంస్కరణోద్యమానికి ప్రధానవ్యక్తులుగా వున్నారని మనకందరికీ తెలిసిన విషయమే.

నాటకం ఆద్యంతమూ మనోరంజకం. హృదయోల్లాస కరమైన సంభాషణలు ఛలోక్తులు లెక్కకు మించినన్ని. నాటకంలో ఛలోక్తులు చమత్కారాలు మాటిమాటికీ మెరుపులవలె మెరుస్తూ ఆదినుంచి అంతంవరకూ ఉత్తమహాస్యాన్ని కలిగిస్తూ ప్రేక్షకులను విస్మయచకితులనూ తన్మయులనూ కావించాయి.

కన్యాశుల్కం రచనతో ఆంధ్రనాటకసాహిత్యంలో వొక సరికొత్తని పద్ధతి వొక నూత్నపంథా ప్రారంభమయింది. దేవుళ్ళనూ దయ్యాలనూ దేవతలను రాక్షసులను కథాపాత్రలుగ స్వీకరించి రచించబడిన పాతనాటకాలవలె కాక తద్భిన్నమైన వర్తమాన కాల యితివృత్తంతో మనకళ్ళఎదుట మసలే ఆధునిక స్త్రీపురుషులజీవితచిత్రీకరణతో ఈ నాటకం అలరారుతోంది. సన్నివేశకల్పన, హాస్యరసపోషణలతోపాటు పాత నాటకాలలో సాధారంగా మృగ్యమైవుండే పాత్రీకరణమనే ప్రధాన లక్షణంతో కన్యాశుల్కం విరాజిల్లుతోంది.

ఈ నాటకాన్ని రచించినవారు సుపరిచితులైన మన నగర వాస్తవ్యులు మహారాజావారికళాశాలాధ్యాపకులు శ్రీ జి. వి. అప్పారావుపంతులు బి. ఏ; ఇంతకుపూర్వమే ఆయన ఇతర రంగాలలోనేర్పు కలవారని పేరుపొందినవ్యక్తి. ఆయన, ప్రత్యేకించి పేర్కొనదగిన ఎంతో సాహిత్యకృషిని కావించారు. ఆంగ్లములో గద్యపద్యాలను అనేకం రచించి పత్రికలకు ఆయన సమర్పించారు. పురావస్తుతత్వశాస్త్రరంగంలో ఆయన అమిత

by its absence in our old plays.......The author of the piece is our well-known townsman, Mr. G. V. Apparao Pantulu B. A. of the Maharajah's College. He has already reputation for skill in other directions and has displayed an amount of literary activity that entitles him to distinguished mention. His facile pen has often contributed English prose and verse to periodicals and he is an earnest labourer in the field of local archæology. We now congratulate him on his successful *debut* as a play wright, and wish him a long and brilliant career. *The Telugu Harp*. 26th August 1892.

శ్రద్ధాసక్తులతో కృషిచేస్తున్న పరిశోధకులు. తొలిప్రయత్నంలోనే విజయాన్ని సాధించిన రచయితగా అభినందిస్తూ ఆయనకు ఉజ్వలభవిష్యత్తు చేకూరాలని మేం కాంక్షిస్తున్నాం.

— తెలుగుహార్పు 26 ఆగస్టు 1892.

ఈ నాటకం అనేకసార్లు ప్రదర్శింపబడినది. ప్రతిప్రదర్శనానికి క్రిక్కిరిసవుండే ప్రదర్శనశాలను సామాజికులను గమనించినట్లయితే యింతటి విజయాన్ని సాధించిన నాటకాన్ని రచించినందుకు రచయిత అభివందనీయుడు.

— ది ఈస్టుకోస్టు న్యూస్.

ఈ నాటకంలో ప్రధానరసం హాస్యం. గ్రంథాన్ని జాగ్రత్తగా చదివిన పాఠకునికి సాంఘికసంస్కరణము విధిగా ఎంత ఆవశ్యకమో అవగతమౌతుంది. రచయిత తన పీఠికలో పేర్కొన్నట్లు 'బ్రహ్మవివాహము' వలెనో లేక సామాజిక సంస్కరణను వాంఛించే తదితర నాటకాలవలెనో కాక భిన్నమైన రచనా

పద్ధతులపై ఈ నాటకం రచింపబడింది. ప్రజల మేలుకోసం కూర్చబడిన ఈ నాటకం దేశంలోగల కొన్ని దురాచారాలను పోగొట్టుగాక. జనులకు సులభద్యోతకంగా వున్న ఈ నాటకం సాంఘికసంస్కరణోద్యమానికి దోహదం చేయుగాక !

— చింతామణి.

ఈ నాటకము అయిదంకములు గలది. కథ హాస్యరసముగను నీతిబోధకముగను నున్నది. శైలిసులభముగ, నింగ్లీషు పదమిశితముగ నున్నది. అట్టిశైలి ప్రయోగించుటకు గారణములు, గ్రంథముం జదివిన తేటయగును. ఈ గ్రంథమునందు కన్యాశుల్కమేగాక, ఇంకననేక దురాచారములు, ఖండించబడినవి.

— బాలిక.

కథాసంవిధానం చక్కగా ఊహించబడి నేర్పుతో చాకచక్యంతో నిర్వహించబడింది. పాత్రలను నిపుణతతో ఎన్నుకొని వాటిని రచయిత తగినవిధంగా మలచడంలో కృతకృత్యులయారు. పోలీసుల వికారచేష్టలు ఈ నాటకంలో బహిర్గతం కావడంసైతం మనం గమనించగలం.

—ది ఇండియన్ జర్నల్ ఆఫ్ ఎడ్యుకేషన్.

కన్యాశుల్కం అందరూ చదవదగిననాటకం. నాటక పఠనం ఎంతో ఆనందజనకం. తెరిచినదిమొదలు చివరివరకూ దాన్ని ఎక్కడా ఆగకుండా ఒక్కసారి మేం పఠించాము. సహజభావవ్యక్తీకరణ నుడికారపుసొంపు ఇతివృత్తనిర్వహణములవన్నీ నాటకంలోని అనేక గుణాలలో కొన్నిమాత్రమే. ప్రకృతికి ఈ నాటకం అద్దంపట్టుతున్నది. కన్యాశుల్కం ఇతి

వృత్తం అటువంటిది. భారతీయశీలస్వభావాదుల్ని బహుళభంగుల చిత్రించడానికి కన్యాశుల్క కథావస్తువు ఎన్ని అవకాశాలను కలగచేస్తున్నదో వేరే చెప్పనక్కర్లేదు; ఆ అవకాశాలను రచయిత వినియోగించుకోవడంలో కృతార్థుడైనాడని ప్రత్యేకించి పేర్కొనడం అనవసరం.

— ది వీక్లీ రివ్యూ, మార్చి 37, 1897.

సాదరముగా మీరనిచ్చిన భవద్విరచిత కన్యాశుల్క ప్రహసనము వందనపూర్వకముగా నందుకొని యామూలాగ్రముగా చదివినాను. హృదయరంజకముగా నున్నది. కల్పనాచమత్కృతికి సంతసించినాను.

—వడ్డాది సుబ్బారాయుడు.

మీరు పంపిన కన్యాశుల్కం అందింది. ధన్యవాదాలు. నాటకం ఉపదేశకమే కాదు; దానితోపాటు పఠనాసక్తిని కలిగిస్తున్నది. ఇటువంటి నాటకాన్ని రచించినందుకు తెలుగువాళ్లు మీకెంతో రుణపడివున్నారు.

—రాయ్‌బహద్దూర్ టి. వి శివరావు పంతులుగారు

తాము పంపిన కన్యాశుల్కం నాటకప్రతి 16 వ తేదీన కృతజ్ఞతతో అందుకున్నాను. నాకు తెలుగు పుస్తకాలు చదివే అలవాటు బొత్తిగాలేదు; మీరు కోప్పడతారనే భయం లేకపోయినట్లయితే దీన్ని అవతలపెట్టి వుండేవాడిని. తీరానాటకం చేతపుచ్చుకుని కూర్చునేసరికి మొదటిపుట చదివానోలేదో గ్రంథాన్ని విడువబుద్ధి పుట్టిందికాదు; ఇంకా చదవాలనే కోరికా ముందు ఎలావుంటుందో అనే ఆసక్తి కలిగాయి. క్రమక్రమంగా చిత్రవిచిత్రమైన రంగులతో పాత్రలు పెరుగుతూ

నా కళ్ళముందు ప్రత్యక్షమైనాయి. నావృత్తికి సంబంధించిన అత్యావసరమైన పనివున్నా ఆమాటే మరిచిపోయి పఠన నిమగ్నుణ్ణయాను. నేను అగ్రహారంలో జన్మించడంవల్ల పట్టణంలో నివాసం వుండడంవల్ల నాకు అగ్రహార నగరజీవితాలను గురించి బాగా తెలుసును. అందువల్ల మీ నాటకాన్ని చదివి ఆనందించ గలిగాను; సమ్మోహితుణ్ణయాను. గిరీశం, అగ్నిహోత్రావధాన్లు, లుబ్ధావధాని, రామప్పపంతులు అత్యద్భుత పాత్రీకరణకు ఉదాహరణలు. ఉత్కృష్టమైన యిలాంటి నాటకాన్ని రచించి నందుకు మీకు నా హృదయపూర్వకాభివందనాలు.

**—పి. వెంకన్న. జిల్లాకోర్టు ప్లీడరు, గంజాం.**

శ్రీ అప్పారావు సాహిత్య విషయాలలో స్వతంత్ర యోచనలు అభిప్రాయాలు గల వ్యక్తి. ఆంధ్రపండితులు ఆదరిస్తున్న అనుచితవ్యర్థప్రాముఖ్యమిస్తున్న నిరర్థక అసహజ కృతక గ్రాంధిక భాషను ఆయన త్రోసిపుచ్చి దానికి ప్రత్యామ్నాయంగా ఈరాష్ట్రపు ఉత్తరసర్కారు జిల్లాలో వాడుకలో వున్న అన్నితరగతులవారు మాట్లాడుకునే సామాన్యజీవితానికి సంబంధించిన సహజ సులభవ్యావహారికభాషను తమ నాటకంలో ప్రయోగించారు. కనక తెలుగునాటకసాహిత్యంలో నిజం చెప్పవలసివస్తే ఆంధ్రసాహిత్యంలోనే ఈ కావ్యం వొక సాహసోపేతమైన నూత్న మార్గానికి ఆస్పదం. ప్రస్తుతకాలంలో ఆచరణలోవున్న సాహిత్యపద్ధతులు ధోరణులు కదలికలేనివి; ఒకే గిరిలో తిరిగినచోటనే తిరుగుతూ చలనరాహిత్యమైన ఈ మార్గాలను త్రోసిపుచ్చగలిగిన అధిగమించగలిగిన ధైర్యసాహసాలు ఈరచయితలో ద్యోతకమౌతాయి. క్షీణిస్తున్న ఈ యుగపు అర్థరహిత నిష్ప్రయోజక సాహిత్యప్రమాణాల

ప్రమేయంలేకుండా, తెలుగుసారస్వత రంగంలో పాతుకుపోయి వున్న వ్యాకరణసూత్రాలను కవితాసమయాలను ఛాందసత్వాలను తృణీకరించి వాటికంటె ఉన్నతమైన ప్రమాణాలను రచయిత అందుకుని కృతకృత్యుడు కాగలిగాడు. సమకాలిక రచయితలకు అనంగీకారమైనప్పటికీ ఈ రచయిత ధైర్యస్థైర్యాలతో సర్వజనులకూ ఆమోదకరమైన బహుళప్రచారంగల వొక నూత్నకావ్యభాషను ప్రయోగించడమే కాక, తన అసాధారణప్రతిభతో సర్వస్వతంత్రమైన మనోహరమైన ఇతివృత్తాన్ని కల్పించి జీవితానికి సత్యసమ్మతంగావుండే వివిధ ఫణితుల పాత్రలను సృష్టించారు. గంభీరయితివృత్తంతో జీవిత యథాతథ చిత్రీకరణతో వివిధఫణితుల పాత్రీకరణతో అలరారుతున్న ఈ నాటకం తమ గదులలోను పఠనాలయాలలోను చదువుకునే పాఠకులకే కాక ప్రదర్శనశాలలో రంగభూమిమీద తెలుగుప్రేక్షకులకు రసానుభూతిని కలిగించి తీరుతుంది. ఈ కారణాలవలన కన్యాశుల్కాన్ని చదవవలసిందిగా తెలుగుపాఠకులను మేం కోరుతున్నాం. నాటకంలోని పాత్రలు పరిపూర్ణంగా చిత్రితమయాయి; కథాసంవిధానం కళాత్మకంగా నిర్మితమై నాటకమంతా మోదజనకంగా నిర్వహింపబడి రచయిత నాటకీయచాతుర్యమూ స్వతంత్రయోచనాశక్తీ అమేయమని తేటతెల్లం చేస్తున్నాయి.

— ది పీపుల్సు ఫ్రెండ్, జనవరి 21, 1892.

# అంకితం

హిస్ హైనెస్ ది మహారాజా మీర్జా శ్రీ ఆనంద గజపతిరాజ్ మన్యసుల్తాన్ బహద్దర్ ఆఫ్ విజయనగరం, జి. సి. ఐ. ఇ. వారికి:

## ఘనత వహించిన మహాప్రభూ,

పూర్వం వొకప్పుడు మీ రాజవంశపు దేవతాస్వరూపుడు తన సహధర్మచారిణిని చెరనుంచి విడిపించే ప్రయత్నంలో సముద్రానికి వారధి కట్టవలసి వచ్చింది. అదిచూసి విశ్వాసంతో వొక ఉడత తనతోకను సముద్రతీరాన పొర్లించి కొన్ని యిసుక రేణువులను పట్టుకువచ్చింది. వారధి నిర్మాణానికి తానుతెచ్చిన యిసుక ఏదో ఉపకరిస్తుందనే నమ్మకంవల్లనే కాక తన సేవాసక్తిని కనపరిచేటందుకే అది అలా చేసింది. నైతికపతనంవల్ల ఉత్పన్నమైన సామాజికరోగలక్షణాలలో నిండివున్న దుర్భర హింసాత్మక బానిసత్వంతో క్రుంగిపోయే స్త్రీ జాతిని ఉద్ధరించడమెలాగ అనే సమస్యపై పదేళ్ళక్రితం మీదృష్టి లగ్నమైవుండగా ఈ సమస్యమీదకు ప్రజాబాహుళ్యపు దృష్టిని మళ్ళించి ఆలోచించేటట్టు చేయడానికై సామాజికదోషాలను బహిర్గతం చేస్తూ వినయవిధేయతలు గల మీ యీభృత్యుడు వొక నాటకాన్ని రచించాడు. రంగభూమిపై ఈ నాటక ప్రదర్శనానికి కలిగిన విజయమూ నాటకప్రతులు కావాలని దేశం నలుమూలలనుంచి అనేకులు కోరిన కోరికా రచయితకు దీన్ని ప్రచు

రించే ధైర్యాన్ని కలగచేశాయి. అయితే తనరచనలో ఎంతెంత లోపాలు వున్నవో ఇతరులకంటె ఈ రచయితకు బాగా తెలుసును; అంతేకాక ఉన్నతస్థితిలోవున్న, పరిణతమనస్కులు పండితులు అయిన మీవంటి ప్రభువులకు అంకితమిస్తున్న తన కృతి వరహీనంగా వుంటున్నదని రచయిత ఎరగకపోలేదు. కాని గుణశోభితం కాకపోయినప్పటికీ తన ఉపజ్ఞాఫలితాన్ని అంకితమిచ్చే మహదాశయంతో రచయిత ప్రభువుల సమ్మతిని అర్థించ సాహసిస్తున్నాడు. ఎవరికి నిరంతరమూ జ్ఞానసముపార్జనే ఏకైకలక్ష్యమో, ఎవరి సాహిత్యపోషణ మహోనక్షత్రాలనదగిన సాహితీవేత్తలను తన ఆస్థానానికి ఆకర్షించి తెలుగుసారస్వత చరిత్రలో ఉజ్వల యుగాన్ని ఆవిష్కరించినదో అట్టి ప్రభువులైన మీకు తన కృతిని అంకితమిచ్చే అవకాశం లభించడంకంటె ఈ రచయితకు మహద్భాగ్యమింకేమున్నది!



# తొలి కూర్పు పీఠిక*

విశాఖపట్టణం జిల్లాలో మూడేళ్ళకాలంలో జరిగిన బ్రాహ్మణశుల్క వివాహవివరాల్ని తెలిపే ఒక జాబితా, విజయనగరం మహారాజావారి ఆజ్ఞానుసారం పదేళ్ళక్రితం తయారుచేయబడింది. కన్యలను శుల్కానికియిచ్చినట్లు సహజంగా ఎవరూ అంగీకరించరు; అందువల్ల ఈ పట్టిక యేవిధంగానూ సమగ్రమైనదికాదు; కాని ఉన్నంతవరకు యిది ఆసక్తికర అమూల్యపత్రం. మూడేళ్ళల్లో ఏటా సరాసరి మూడువందల నలభైనాలుగు చొప్పున మొత్తం ఒకవెయ్యాముప్పైనాలుగు పెళ్ళిళ్ళు జరిగినట్టు ఈ పత్రం దాఖలా చూపింది. అయిదు సంవత్సరాల ప్రాయంవున్న బాలికలు తొంభైతొమ్మండుగురికి, అయిదేళ్ళపిల్లలు నలభైనలుగురికి, మూడేళ్ళ ముక్కుపచ్చలారని ముప్పైఆరుగురు పాపలకి, రెండేళ్ళ ఆరుగురుపసికందులకి ముగ్గురు ఏడాదిబిడ్డలకి మూడుముళ్ళూ పడ్డాయ్! ఇంతదాకా యెందుకు, ఒక్క మాటలో చెప్పాలంటే, పొత్తిళ్ళలోవున్న శిశువులకు తలఒక్కొంటికి మూడువందలయాభైనుంచి నాలుగువందలదాకా, ధర పలుకుతోంది. వింతనిపించవచ్చును కాని, వాస్తవానికి కడుపులోవున్న శిశువులను సైతం అప్పు

---

* కన్యాశుల్కపీఠిక రచనాకాలం : 1 జనవరి 1893; స్థలం విజయనగరం.

డప్పుడు అడగవస్తున్నారు. పరువూ ప్రతిష్టా మంటగలిపే ఇలాంటి పరిస్థితులు తలెత్తడం సమాజానికే సిగ్గుచేటు. ఇటువంటి దురాగతాలను బహిర్గతం చేస్తూ ఉన్నత నైతికభావాలను వ్యాప్తి చేయడంకంటె, మిన్నఅయిన లక్ష్యమూ ప్రయోజనమూ సాహిత్యానికి వేరొకటిలేదు. అయితే ఇలాంటి ఆరోగ్యదాయక ప్రభావాన్ని ప్రసరింపచేయడానికి ప్రజలలో పఠనాసక్తి అభ్యాసమూ కలిగేవరకు, మనం రంగభూమివైపుకు దృష్టిని మళ్లించక తప్పదు. ఈ ఆలోచనలు నన్ను కన్యాశుల్క నాటకరచనకు ప్రోత్సహించాయి.

వ్యావహారిక భాష, గ్రాంధిక భాషకంటె ప్రజా సామాన్యానికి సులభద్యోతకమనే కాక, తెలుగు నాటకరచనకది సముచితశైలి అనే విశ్వాసంతో సైతం నేనీ నాటకాన్ని వాడుకభాషలో రచించాను. నాటకశైలి కొంతవరకు ప్రయోగప్రాచుర్యాన్ని బట్టి నిర్ధారితమౌతున్నమాట నిస్సందేహమే; అయినా తెలుగున నిజమైన నాటకసాహిత్యవిలుప్తత, తన భావప్రకటనకు అత్యంతార్హమైనశైలిని స్వీకరించే స్వాతంత్ర్యాన్ని రచయితకు ప్రసాదిస్తోంది. మిస్టర్ వార్డు చెప్పినట్లు నాటకానికి అత్యావశ్యకమైనది అవిచ్ఛిన్నత సంభాషణల సౌలభ్యం. ఇందులో దాని అసలుజీవం యిమిడివుంది. తెలుగున ప్రయుక్తమౌతున్న ఛందస్సులు అనుప్రాసాది నియమాలవల్ల భాషకీ అవిచ్ఛిన్నతను సౌలభ్యాన్ని కలిగించలేకపోతున్నాయి. అలాగ కలిగించలేక పోతున్నాయికదా అని నాటకశైలిలో నూత్న పద్యరచనారీతులను ఎవరైనా కల్పించుకో ప్రయత్నించవచ్చును; కాని ఈ ప్రయత్నం, ప్రపంచమంతటా నాటక ప్రయోజనాలకోసం, వచనం, ప్రాముఖ్యానికి వస్తున్న ఈ

రోజుల్లో అనవసరం; కనీసం, హాస్యనాటకాలలో మోదాంతకా లలో యిది శుష్కదండుగ.

ఏ వాడుకభాషనైతే నీచార్థంకల్పించి, 'గ్రామ్యం' అని తప్పుడుపేరు పెట్టి వ్యవహరిస్తున్నారో ఆ వాడుకభాషను ప్రయోగించడంవల్ల ఉత్తమకావ్యాల కుండవలసిన గౌరవానికి కళంకం ఏర్పడుతుందని కొందరు అంటున్నారు; వ్యావహారిక భాషాప్రయోగంవల్ల సాహిత్యగ్రంథాల స్థాయి దిగజారిపోతుం దనే ఈ విమర్శను మనం ఖాతరు చెయ్యనక్కర్లేదు. ఎందువల్ల నంటె, కావ్యగుణాలను కావ్యప్రయోజనాలను నిర్ధారించేవి పాతకాలపు వైయాకరణుల ఛాందసాలు కావు. భాషాశాస్త్ర జ్ఞానం అమితంగా పురోగతిచెందిన ఈకాలంలో ప్రాచీన వ్యాక రణపండితుల సూత్రాలకంటె మిన్నఅయిన ప్రమాణాలు ఉత్పన్నమయాయి. ప్రస్తుతం పనికిరాని ప్రాచీనవ్యాకరణ సూత్రబద్ధ సాధ్యరూపాలతో వ్యావహారికభ్రష్ట జటిలశబ్ద జాలంతో, కేవలం కృతకవ్యాకరణసూత్రాలు విధించిన ఆదేశాగ మాది వికారసహిత ధాతువుల వివిధరూపాలతో గ్రాంథికభాష సమ్మిశ్రితమైవుంది. ఈ విధంగా రూపుచెడిన కృతకశబ్దరూపాలను యమకాదులకోసం పాదపూరణార్థమై తెచ్చిపెట్టుకున్న పద్య నియమాల ఛందస్సులచట్రంలో ఒదగడంకోసం, ఆశ్రయించ వలసిన దుస్థితి కలుగుతోంది. సంస్కృతపదాలను ఎంతమేరకైనా తెలుగున ప్రయోగించ వీలిచ్చే వ్యాకరణసూత్రాల ఆమోద ముద్రవల్ల కొన్ని అవకాశాలు కలగడం నిస్సందేహమే;అయినా అవకాశం దొరకడమే తరవాయిగా, పాండిత్యప్రకర్షకోసం, నిఘంటువులను వెదకవలసిన దురవస్థను తెచ్చిపెడుతూ, పటా టోపంతో దీర్ఘవ్యర్థసమాసాలను బిగించి, కవులు అసలేచచ్చి

Kanyasulka

a comic play

in seven acts.

by

G. V. Appa Rao B.A.

Asst. Maharajah's College Vizianagaram

పడివున్న గ్రాంథిక భాషను చావగొట్టి చెవులుమూశారు. భాషా సంస్కరణావశ్యతకను,పద్ధతులనుగురించి ఎంతోవిపులంగా ముచ్చటించ వచ్చును కాని అందుకీ పీఠికలో ఆస్కారంలేదు. కాని ఒక విషయంమాత్రం చెబితేచాలు. నాగరికతా సంపన్నమైన దిగా కావ్యభాషను పెంపొందించుకోవాలంటే గ్రాంథికంలో చొరబడిన వ్యవహారభ్రష్టపదాలను, తెనుగు సంప్రదాయ విరుద్ధ సంస్కృత శబ్దరూపాలను పరిహరించి, వాడుకపదాలతో పుష్టివంతం చేసుకొని దాన్ని వ్యావహారిక భాషకు సన్నిహితంగా వుండేటట్టు రూపొందించుకోవలసి వుంటుంది. తెలుగుదేశపు వివిధ ప్రదేశాలలో వినబడుతున్న మాండలికాలభేదం అత్యల్పం. కనక, శక్తివున్న రచయితలు, సంకల్పబలంతో సరళమైన ఒక కొత్త కావ్యభాషను ఏర్పరుచుకో వచ్చును.

ఈ మధ్యనే నేను రాయ్‌బహద్దర్ వీరేశలింగం పంతులు గారు రచించిన బ్రాహ్మవివాహమును చదవడం తటస్థించగా మాఇద్దరి నాటకాల్లోను సమానపోలికలు గల వాక్యకదంబా లుండడం గమనించాను. ఆయన నాటకం బ్రాహ్మణవివాహా లను సాకల్యంగా చర్చించే యితివృత్తంకలది కనక, మానాట కాలలో ఈతుల్యత వుండడం సహజం. కాని మా రచనాపద్ధతి పూర్తిగా విభిన్నం కనక ఈ రెండు నాటకాలలోను సమాన ధర్మం ఎంతమాత్రం వొకటికాదనేది స్పష్టం. బ్రాహ్మవివాహం ఆచారవ్యవహారాల అవహేళన ప్రధానంగా గల మోదాంత నాటకం. కన్యాశుల్కం అలాకాదు. స్వతంత్ర సంకీర్ణయితివృత్త నిర్వహణకు పాత్రీకరణకు ఔచిత్యపోషణకు కన్యాశుల్కంలో ప్రయత్నించబడింది. ఈ ప్రయత్నం ఎంతవరకు జయప్రదంగా నెరవేరిందో నిర్ణయించవలసింది ప్రజాబాహుళ్యం.

* * *

## ప త్రి క లు *

**భా**రతదేశంలో పత్రికల నిర్వాహణను గురించి వొక వ్యాసమును వ్రాయాలి. ది అమృతబజారు పత్రిక; దాని యోగ్యతలు; లోపములు. ది నేషనల్ గార్డియన్, న్యూ ఇండియాపత్రికలు; పత్రికల వ్యాపార ప్రకటనలు, పాఠకులు. యువకులను ఆకర్షించే విషయములు.

ఇది యుగసంధి. కాలము ప్రమాదకరముగా వున్నది. ఇంగ్లండు దేశములో పత్రికా ప్రచురణవల్ల కలిగిన ఫలితములు; చెడుసంప్రదాయములను మనవాళ్లు అనుకరించడంవల్ల కలుగు తున్న దుష్ఫలితములు అవివేకపద్ధతులు. అనేక సంఘర్షణలనుపడి,

ఆంగ్లేయులు సాధించుకున్న పత్రికలు, అచ్చుయంత్రము. అవి భారత దేశంలో కలిగించినమార్పులు. ఇక్కడ పత్రికా రచయితలు, విద్యాధికులు తగినంతకృషి సల్పక కేవలం జాగుచేస్తున్నారు. పత్రికా రచనకుగల భవిష్యత్తు. జాతీయపత్రిక అనేది అక్షరాలా జాతీయంగానే వుండవలెను.

ది నేషనల్ గార్డియన్, మలబార్, లాల్ మోహన్ ఘోష్; టి. మాధవరావు.

భిన్నభిన్న అభిప్రాయములను ప్రకటించడం, ఇతరుల అభిప్రాయాలను గౌరవించడం. అసలు అభిప్రాయమంటూ లేకపోవడంకంటె ఏదో అభిప్రాయం వుండడంమంచిది. విద్యావంతులతో కులీనులతో సంబంధం. చందాలు సరిగా వసూలు కావు. సాధారణ హిందూవిద్యాధికుని మనస్తత్వంపై విమర్శ.

ఈ దుస్థితిలో వున్నందుకు హిందువును తప్పుపట్టనక్కర లేదు.

ఆర్నాల్డు, మార్లో ప్రభృతులవలె ఉత్సాహపరిచే గొప్ప వ్యక్తులులేరు.

భారతదేశానికి వచ్చిన దొరలతీరు. ఆంగ్లో ఇండియనులకు నిజానికి విద్యాగంధం పూజ్యం. కవిత్వము. క్రిష్టిగున్ కాలేజి పత్రిక సాధించిన అభివృద్ధి. ఆనందాచారి పత్రిక. ఇండియన్ రిఫార్మర్; పొలిటీషియన్ పత్రికలు.

ఇంకొక వ్యాసం

భారతదేశపు కులీనుల స్థితిగతులు. వారి గతచరిత్ర. ఇప్పటిస్థితి; వారి భవిష్యత్తు. ప్రభుత్వం వారికి ఏమిచేసినదీ, వారు తమ దేశమునకు ఎలా ఉపకరించవలసినదీ.

---

* రచనాకాలం : 18 జనవరి 1893.

# హరిశ్చంద్ర నాటక పీఠిక*

విజయనగరం 'జగన్నాథవిలాసినీ నాటకసమాజం' వారి అభ్యర్థనను పురస్కరించుకుని రచయిత యీ నాటకాన్ని రచించగా 1893 వ సంవత్సర మధ్యకాలంలో తొలిసారి యిది ప్రదర్శితమయింది. అటుపిమ్మట అనేకసార్లు రాష్ట్రనగరాలలో వివిధ నాటక సమాజాలవారు దీనిని అభినయించారు. జయప్రదమైన యీ ప్రదర్శనలు రచయితను తన నాటకాన్ని ప్రచురించేటట్టు ప్రోత్సాహపరిచాయి.

అయితే సాహిత్యప్రమాణాలు కలవని అనుకునే యిలాంటి నాటకాలను విదేశభాషలో ఎందుకు రచించవలసి వచ్చిందో అందుకు సబబు యేమిటో చెప్పుకోవలసిన అగత్యం వుంది. ఇప్పుడు ఆంగ్లం భారతదేశంలో ప్రభుత్వభాషగా స్థిరపడి

---

* హరిశ్చంద్ర నాటకకర్త కీ. శే. గోమఠం శ్రీనివాసాచార్యులు గారు. 1847లో చెంగల్పట్టుజిల్లాలో జననం. "ది మద్రాస్ ఓరియంటల్ డ్రమెటిక్ కంపెనీ" స్థాపకులు: అధ్యక్షులు. శాకుంతలము ఉత్తర రామ చరిత్రము విక్రమోర్వశీయము యిత్యాది సంస్కృత నాటకాలలో ప్రధాన భూమికలను ధరించి పెద్దల ప్రశంసల నందుకున్ననటులు. 1880లో వీరి దుష్యంతపాత్రను రాష్ట్ర గవర్నరు 'ది డ్యూక్ ఆఫ్ బకింగ్‌హాం అండ్ ఛాండాస్'వీరికి "ఇండియన్‌గారిక్" అనే బిరుదును ఇచ్చారు. ఆనంద గజపతి మహారాజా వీరి నటనాకౌశల్యాన్ని చూసి 1880 లో తమ ఆస్థానానికి ఆహ్వానించారు. స్త్రీ చాతుర్యం, కమలాపహరణం, పెంకి

పోయి అందరినీ ఆకర్షిస్తోంది, ఉన్నత తరగతులవాళ్ళు తమ యవ్వనదశలో అమూల్యకాలాన్ని ఆంగ్లాన్ని అభ్యసించడానికి ఆభాషాజ్ఞానాన్ని పెంపొందించుకోడానికి వినియోగిస్తున్నారు. అలాంటప్పుడు యే కొద్దిమంది పండితులు మాత్రమే ఆనందించే అతి కఠిన కృతక ద్రావిడ గ్రాంథిక భాషలలో రచించడంకంటె హెచ్చుమందిని మెప్పించే ఆంగ్లభాషలో తమ కావ్యాలను రచించి వారిని ఆకట్టుకొని అధికప్రయోజనాన్ని పొందుదామని రచయితలు ఆశపడవచ్చును. ఆంగ్లభాషలో రచన కొనసాగించే యిటువంటి ప్రయత్నం హర్షణీయం కాకపోయినా, పోనీ అభ్యంతరకరం మాత్రం కాదు. భారతదేశంలో వివిధ రాష్ట్రీయుల భావప్రకటనకు ఆంగ్లభాష వొక సాధనంగా ఉపయుక్తమౌతూ సంస్కృత హిందీభాషలను అవతలకునెట్టి అధిగమిస్తోంది. అంతేకాక ప్రతి సంవత్సరం అధికసంఖ్యాకులౌతున్న విద్యార్థులలో, నూత్న భారతదేశ స్వరూపాన్ని సాక్షాత్కరింపచేస్తూ నిద్రాణమైవున్న జాతీయభావాన్ని చైతన్యాన్ని మేలుకొలుపుతోంది. నిరవధికోత్సాహాన్ని కలిగిస్తూ కొత్త కొత్త ఆలోచనలను 'రేకెత్తిస్తూ' కాల్పనికతను పెంపొంది

---

పంతులు ప్రహసనం మొదలైన గ్రంథాలను శ్రీనివాసాచార్యులుగారు రచించారు.

పీరు ఆంగ్లమున రచించిన హరిశ్చంద్రనాటకానికి మహాకవి గురజాడ, 1897 జనవరి నాలుగవ తేదీన వ్రాసిన పీఠికను ఆంధ్రీకరించి యిక్కడ పొందుపరుస్తున్నాను. పీఠికను వ్రాసిన అప్పారావుగారికి తమ తెలుగు పద్యాలను నాటకంలో ముద్రించుకోడానికి అనుమతించిన ఆనందగజపతి మహారాజావారికి శ్రీనివాసాచార్యులుగారు తమ పీఠికలో కృతజ్ఞత తెలిపారు.

స్తోంది. పురాతనప్రపంచపుభావాలకు నూతన్నప్రపంచపు భావాలకు సంబంధం యేర్పడినపుడు యిటువంటి పరివర్తన కలగడం సహజం.

---

ఆనందగజపతి వ్రాసిన తెలుగు పద్యములు:

కులశైలములు చలించిన
జలనిధు లింకిన దినకరచంద్రల సన్మం
డలములు ధరఁగూలిన సౌ
రుల చల వాక్ప్రి విలాసలురు గుణసదనా.
కసవుందిను పసరములకు
నసువులపై నాసజేయనౌ సహజముగన్
అసమత దూషితమగు నీ
వసుమతి జీవేచ్ఛమృతికి వచ్చు సమమనన్.

శ్మశానవాటికలో చంద్రమతి తలను ఛేదించడానికి ఉద్యుక్తుడవుతున్న హరిశ్చంద్రుని విశ్వామిత్రుడు వారించగా, అతను పలికిన పలుకులు మొదటిపద్యం. తరువాత చంద్రమతి హరిశ్చంద్రునితో చెప్పిన మాటలు రెండవపద్యం· ఈపద్యాలకు శ్రీనివాసాచారిగారి ఆంగ్లానువాదం:

The kula mountains eight may even fly,
The mighty oceans seven entirely dry,
The Sun and moon and stars fall down from sky,
But Solar kings will never tell a lie:
Let thoughtless cattle cling to life in simple mirth;
To thinking man creation's lord of nobler birth,
Life is but death if lived on this sad changeful earth
For transient life when naught is equal has no worth.

నాటకాంతమందు అప్పారావుగారి తమ్ములు శ్యామలరావుగారు రచించిన ఆంగ్లపద్యాలను అచ్చొత్తిస్తూ శ్రీనివాసాచార్యులుగారు తమ

సహజంగా భారతదేశంపట్ల ఆసక్తివున్న పాశ్చాత్యులెవరికైనా మనదేశపు భూతవర్తమాన కాలాల జాతీయజీవితాన్ని తెలుసుకోవాలనే కోరికవుంటుంది. మనమేధావులు రచించిన కావ్యాలను పరిశీలించి భారతదేశ జాతీయజీవితస్వరూపాన్ని అవగతం చేసుకోవాలనే కాంక్ష వుంటుంది. అలాంటపుడు మన జీవితంలో ఆకర్షవంతమైన సంఘటనలను అన్యదేశీయులకు చూపుతూ ఆంగ్లభాషలో రచనలు సాగించే భారతీయులు తమ మాతృదేశానికి అపారమైన సేవ చేసినవారౌతారు.

భారతీయ సాహిత్యంలో పాశ్చాత్యులను రంజింపచేసేది సత్యహరిశ్చంద్రుని జీవితచరిత్ర. అందుకు ఇంతచక్కగా కుదిరిన కథ యింకొకటి లేదంటే అతిశయోక్తికాదు.

సత్యహరిశ్చంద్రుని జీవితకథను ఇతివృత్తంగా స్వీకరించి దానిని రసవత్తరంగా పరిపోషించడంకోసం కథాసన్నివేశాలను రచయిత మలుచుకొన్నాడనేది స్పష్టం. కొన్ని సంఘటనలను యిలాగ మలుచుకోవడమేకాక, కథాగమనానికి పాత్రనిర్మాణానికి అనువుగ మరికొన్ని సన్నివేశాలను రచయిత కల్పించుకున్నాడు.

ఈ నాటకంలో కొన్ని ప్రకృతికతీతశక్తుల లక్షణాలు గర్భితమై వున్నప్పటికీ అవి మానవ జీవితానురక్తికి భంజకములు కావు. అవి, ఈశ్వరేచ్ఛ అలాంటిదనే భావాన్ని కలిగిస్తాయే

---

కృతజ్ఞతను ఈ విధంగా వ్యక్తపరిచారు: "నామిత్రులు కీర్తిశేషులు గురజాడ శ్యామలరావు బి. ఏ; గారు పన్నెండు సంవత్సరాల క్రిందట రచించిన రెండు బ్లాంక్ పద్యాలను వారి జ్ఞాపకచిహ్నముగా వుండుటకు యింతకంటె మంచి మార్గములేదు కనక యీ నాటకంలో అచ్చొత్తించాను."

తప్పు జీవితంపై విరక్తిని కలిగించవు. హరిశ్చంద్రుని కుటుంబీకు లకు అన్ని విపత్తులు కలగడం ఆ విధంగా ఊహాతీతమైన కష్టపరంపరను చిత్రించడం అసహజమని కొందరు అంటు న్నారు. వారిలా అంటున్నపుడు వొక విషయాన్ని విస్మరిస్తున్నారు. మానవశ్రేయస్సుకోసం ప్రొమెథియిస్ ఎన్నో కష్టాలపాలయాడని కాన్కసస్ పర్వతానికి బంధింప బడ్డాడని అతని శరీరాన్ని పేగులను గద్దలుతిన్నా భరించాడని అతని విపత్తులు సత్యహరిశ్చంద్రుని కష్టాలకంటె అధికతరమైనవని జ్ఞాపకం పెట్టుకోవలసి వుంటుంది. ఒకగుణం అది మంచిదైనా చెడ్డదైనా హెచ్చుస్థాయిలో వున్నపుడు కలిగే ఫలితాలదృష్ట్యా గ్రీకులు తమ నెమిసిస్ దేవతను ఊహించుకున్నారు. ఈభావమే క్రైస్తవ నాటకసాహిత్యంలో సైతం ప్రస్ఫుటమై తన ప్రభా వాన్ని నెరపుకుంది. ఈ సందర్భంలో నేను మర్చంటాఫ్ వెన్నిస్, ఒథెల్లో నాటకాలలోని ఆంటోనియో డెస్డిమోనాల ఉదం తాన్ని ఉదహరించదలుచుకున్నాను. అయితే అతిమంచికోసం ఎంతటి దురవస్థలనైనా అనుభవించాలనే భావం ఎవరినీ సంతృప్తి పరచదు. న్యాయమంటే వారికిగల అభిప్రాయాన్ని ఆ భావం తృప్తిపరచదు. అదీకాక లోకంలో ఏ వస్తువూ సర్వమూ సుగుణోపేతంగా ఆద్యంతమూ ఉత్తమోత్తంగా వుండబోదని ఎవరికైనా తోస్తుంది. వాతావరణ వంశపారంపర్య ప్రభావాలు శీలస్వభావస్థితిగతులను నిర్ణయిస్తాయనే ఇబ్సనీయను సిద్ధాంతం

---

కీ. శే శ్యామలరావుగారు రచించిన ఆంగ్లపద్యాలు :

NARADA:
Long be thou spared to live the spotless life
That fits king Harischandra's only son !

యింతవరకూ పెంపొందిన జ్ఞానదృష్ట్యా యెంతో హేతుబద్ధంగా కనిపిస్తుంది. అయినప్పటికీ జీవితంలో హెచ్చుతగ్గులు ఎందుకు కలుగుతున్నవో కర్మసిద్ధాంతం సమాధాన పరిచినంతగా మరియేదీ అది ప్రాచీనమైనదైనా ఆధునికమైనదైనా జవాబు చెప్పడంలేదు. అన్ని విశ్వాసాలకంటె సూత్రాలకంటె కర్మసిద్ధాంతం జీవితవ్యత్యాసాల హేతువులకు బలమైన సమర్థింపు.

---

And now, great monarch and you, worthy spouse,
Depart ye to hence to your ancestral home.
Return ye to Ayodhya there to reign
To spread among your people peace and joy
And gladden all your faithful subjects' hearts,
Who long to greet their well-loved soveriegns back;
And when your peerless son grows up in years
And proves his worth to reele your wide domains
Resign their charge, with blessings, to his hands.
Then, resting from your kingdom's anxious cares
When you shall start to travel Heavenwards
Your well-won garden will await you there.

HARISCHANDRA:

Almighty Lord, soul of the Universe,
Eternal source of life and light to all!
Since now it has been granted unto me,
Thy ever-beaming countenance to see,
My transient troubles dwindle into naught,
Before the bliss of this and auspicious hour;
Thy glorious presence and thy gracious speech
Have banished from mind all thoughts of woe,
And doubly strengthened by Thy tender love
I lay my all before Thy feet divine!

కేవల విషాదాంతాలను భారతీయుల ఉపజ్ఞ సహించ లేదనేమాట వాస్తవమే అయినా ఉత్తరరామచరితము నాగానందము ఇత్యాది సంస్కృత నాటకాలలో ఆ లక్షణాలు బహుళంగా స్థానం కల్పించుకున్నాయి. ఈ నాటకాలన్నిటా యీ నాయకులు పడే అనంతమైన దురవస్థలకు హేతువులేమో తెలుసుకోవాలంటే వారి ప్రస్తుత జన్మలనుకాక మరొకచోట పరిశీలించవలసివుంటుంది. కనుకనే 'హరిశ్చంద్ర' నాటకకర్త తగురీతిని నాయకునిచేత యీ మాటలను పలికించాడు:

" This sage was saviour of my sire
Nor my... son can harbour ire
From sins of by gone births by troubles feigned
He purged this wretched soul and fame attained."

భారతీయ సాహిత్యచరిత్రలో హరిశ్చంద్రకు గల స్థానం అద్వితీయం. ఆత్మత్యాగంలో వున్న ఉదాత్తత నాటకీయ చాతుర్యంతో అత్యంత గంభీరవంతంగా చిత్రింపబడింది. సత్యం పట్ల హరిశ్చంద్రుని విశ్వాసం అచంచలం. సత్యభాషణము ఆచరణము జీవితధ్యేయాలుగా ఉపలక్షించుకొని వొక ఉత్కృష్ట ధర్మంకోసం హరిశ్చంద్రుడు తన జీవితసర్వస్వాన్ని త్యజించాడు. సత్యంపట్ల భారతీయమేధ ఆ విధంగా భావిస్తున్న కాలంలో అతని కథ ఊహింపబడింది. ఆనాటి జాతీయమేధకు అది వొక అభివ్యక్తీకరణ. భారతీయులఆదర్శాలు యెట్టివో ఇతరదేశాల కారుణ్యావాదులకు హరిశ్చంద్రుని జీవితకథ విశద పరుస్తుంది. అదే విధంగా అది భారతీయులకు వొక విషయాన్ని తేటపరుస్తుంది. శతాబ్దాల తరబడి రాజకీయ హానిసత్వంవలన మరుగుపడివున్న ఉదాత్తజాతీయమనఃప్రవృత్తిని విద్యా

వంతులైన హిందూవులకు బహిర్గతంచేసి వారిలో వారి ప్రభావానికి లోనౌతున్న వ్యక్తులలో అట్టి ప్రవృత్తిని కలిగించడానికి ఇది దోహద పడవచ్చును.

ఈ నాటకప్రదర్శనాన్ని అనేకమంది పాశ్చాత్యులు తిలకించి యెంతో శ్లాఘించారు. విక్టోరియాహాలులో ఓరియంటల్ డ్రమెటిక్ కంపెనీవారు తనకోసం ప్రత్యేకంగా యేర్పాటుచేసిన ప్రదర్శనానికి మద్రాసు గవర్నరు లార్డువెన్లక్ విచ్చేసి పై నాటకకంపెనీ స్థాపకుడూ అధ్యక్షుడూ అయిన ఈ నాటక రచయితను అభినందిస్తూ యీ దిగువ ఉదహరించిన విధంగా వొకలేఖను * వ్రాశారు.

---

* పీఠికాంతమందు ముద్రితమైవున్న గవర్నరు లేఖకు అనువాదం :

గవర్నమెంటు హౌస్, మద్రాసు.
6 మార్చి 1896

ప్రియమైన అయ్యా,

మీరు ఆంగ్లంలో రచించిన హరిశ్చంద్ర అనే ఉత్తమ నాటక ప్రదర్శనాన్ని చూసినపుడు నాకు కలిగిన ఆహ్లాదాన్ని మీకు తెలియచేయాలని భావించాను. మీరు అభినయించవలసిన భాగం అధికంగావున్నా. అది ఆంగ్లంలో అభినయింపవలసి వచ్చినా యెంతో శ్రమపడి మీ భూమికను మీరు నిర్వహించారు. నాటక ప్రదర్శనం విజయవంతం కావడానికి మీ సమాజం పడిన శ్రమకు తీసుకున్న శ్రద్ధకు మిమ్మల్ని అభినందించవలసివుంది. మీ నటనా కౌశల్యాన్ని అద్భుతంగా మీరు నిర్వహించిన భూమికను చూసి నేనెంతో ఆశ్చర్యచకితుణ్ణయాను. నేను అలసిపోయి వుండడంవల్ల, నాటకం చివర వెళ్ళిపోవలసివచ్చినందుకు విచారిస్తున్నాను.



# ఆనందగజపతి * : దర్బారువింతలు

మహారాజావారి ప్రజ్ఞ పదునైన కత్తివంటిది. ఆయన చూపులకు అందని విషయమంటూ ఏదీ వుండదు. సూక్ష్మాతి సూక్ష్మ విషయాలను సైతం, ఆయన యిట్టే గ్రహించి గ్రహించనట్లు కనబడతారు.

---

* "పండితుడు, కవి, సంగీతకళాకుశలుడు, బహుభాషాకోవిదుడు కళాపోషకుడు, ఆనందగజపతి మహారాజు. పురాణప్రబంధయుగాలు రాజరాజనరేంద్ర, కృష్ణదేవరాయల ఆదరాలవల్ల ప్రారంభమైనట్టే, నవ్యాంధ్ర సాహిత్యయుగానికి ఆనందగజపతి మహారాజు ఆదరాభిమానాలుండేవి. ఆనందగజపతి మహారాజు అకాలమృతివల్ల తెలుగుసారస్వతానికి తీరనినష్టం కలిగింది....ఆయన పోషకత్వంలో 'తెలుగుహార్పు' అన్న ఆంధ్రాంగ్ల పత్రిక ప్రచురించబడేది....'తెలుగుహార్పు' వ్యవహారికాంధ్రానికి స్థానం యిచ్చిన మొట్టమొదటి పత్రిక....అప్పారాయ మహాకవితో వున్న సన్నిహిత సంబంధం బట్టి చూస్తే ఆయనను మహారాజు కన్యాశుల్కం రాయడానికి ప్రోత్సహించివుండవచ్చును, ఆంధ్ర సాహిత్యంలో నూతనశకాన్ని స్థాపించిన ఆ కావ్యానికి కృతిభర్తమై ధన్యులయ్యేరు. కృతులు రచింపించి గణుతికెక్కిన కవిరాజు....ఈ విద్యాభోజుడు విజయనగర కళాశాలను విశ్వవిద్యాలయంగా చెయ్యడానికి ప్రయత్నించారు" - చూ : శ్రీ సెట్టి ఈశ్వరరావుగారి 'మహాకవి; మహాపురుషుడు, గురజాడ అప్పారావు' అన్న గ్రంథం.

ఆనందగజపతి తండ్రి విజయరామగజపతి. తల్లి అలకరాజేశ్వరి. లాటిను ఇంగ్లీషుభాషలలో మంచిపాండిత్యమును సంపాదించిన,

ఒక వస్తువులోని ప్రత్యేకతను పొందిక కుదరని అంశ మును మహారాజావారు పోల్చుకుని, ఆ విషయాన్ని గురించి మరెప్పుడో వారు ప్రసంగిస్తారు. ఆయన ప్రసంగము తెచ్చిపెట్టు కున్నట్లు వుండదు. సహజముగా ఆయన ప్రసంగములో అనేక విషయాలు ప్రసక్తికి వస్తూవుంటాయి.

ఒకసారి నన్నుగురించి నలుగురితోను ముచ్చటిస్తూ "అప్పారావుకి కన్ను రెట్టగించి చూసీచూడనట్లు చూడడం ఒక అలవాటు" అన్నారు. ఆయనమాట నిజమే. నాకు ఏదైనా

---

కోదుభాషకు వ్యాకరణమును రచించిన లింగం లక్ష్మీజీపంతులుగారు వారికి గురువులు. చిన్నప్పుడు కాశీలో వుంటూ, సంస్కృతము, పార్శీ, బెంగాలీ భాషలను మహారాజావారు అభ్యసించారు. ఫ్రెంచి, ఇంగ్లీషు కంపెనీలవారికిని, విజయనగరసంస్థానమునకును జరిగిన సంధులను గురించి 'ట్రీటీ' అన్న పేరుతో ఒక గ్రంథమును ఆయన వెలువ రించారు. మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులుగ వుండేవారు. వేదము లను అచ్చు వేయడములో మాక్సుముల్లర్ పండితునకు ద్రవ్యసహాయ ముచేసినారు. సమాజములోను సాహిత్యములోను మార్పులను వాంఛించి గోష్ఠులను, సభలను ఏర్పాటు చేస్తూవుండేవారు. వారి అకాల మరణము వలన అప్పారావుగారివంటి నూతన ఆలోచనాశీలురకు నాటి సంస్కరణ వాదమునకు కొంత నష్టము జరిగినదని చెప్పవచ్చును.

"రాజతిపండితుడంట, బరాబరి యౌనట మంత్రి రాజుతో
ధీజవ మొప్పునట్టి కవిధీరులు తిర్పతి వేంకటేశులా
రాజును జూడఁ బోయిరఁట.................."
"ఏ భూమీంద్రునిఁ జూడఁ బోయినను నీవే పద్యమున్ జెప్పి నీ
వే భావమ్మును జెప్పికోవలయు నింకీ భూవిభుడన్నఁ దా
నే భావమ్ము గ్రహించువాఁడగుట నీకీ కష్టమేదేటె...."

— తిరుపతి వేంకటేశ్వరకవులు.

ఒక వస్తువు కనిపించినపుడు, దానిని చూసి చూడనట్లు చూడాలని ప్రయత్నించేవాడిని. అది ఒక అలవాటుగా మారిపోయింది కాబోలు.

మహారాజావారు యింకొకమాట అన్నారు: "అప్పారావు నిటారుగా నిలబడతారు; కాని ఒక బుజమును కిందకు కుంచించుకుని నిలబడతారు. ఆయన బుజము కిందకు దించుకుని, నిలబడకూడదు. అది మానవలెను" అంటూ చిరునవ్వునవ్వారు.

* * *

మహారాజావారి ఉద్యోగులలో రెండు రకాలవారు వున్నారు. కొందరు ఆయన చెప్పిన పనిని అతి నేర్పుగా ఆయనకు నచ్చినట్లు చేస్తారు. కొందరు ఆయన చెప్పిన పనిని అతి జాగ్రత్తగా సున్నితముగా చేస్తున్నట్లు నటిస్తూ దానిని పాడు చేస్తారు.

ఆయన ఆదేశించిన కార్యాన్ని నెరవేర్చడానికి నేను సదాసంసిద్ధుణ్ణి. అది కష్టమైనా, దానిని నిర్వర్తించడానికి హృదయపూర్వకంగా ప్రయత్నిస్తాను. ఒకరు మనలను నమ్మి, మనమీద కార్యభారాన్ని వుంచినపుడు విధినిర్వహణలో మనకు ఏమరుపాటు కూడదు. మనవల్లకానపుడు, వారికి మనం ఆ విధముగ సూచించవచ్చును.

• • •

మహారాజావారు ఒక పనిని వప్పగించినపుడు, వారు ఇక అందులో వేలుపెట్టరు. ఆ పని ఏమైనదో ఎప్పటికపుడు తబిశీలు అడగడమంటే ఆయనకు చిరాకు. సర్వస్వతంత్రముగ ఎవరి పను



విజయనగరం మహారాజావారి కోటలోని రెండు మహలు

లను వారు చక్కబెట్టుకోవలెనని వారి కోరిక. అందువల్ల తమ వద్ద పనిచేసేవారికి పూర్తిస్వేచ్ఛను యిస్తారు.

* * *

భవనాల మరామత్తుకు మంజూరయిన సొమ్ము దుర్వినియోగమౌతున్నదని, మహారాజావారికి తెలిసింది. 'జె' గారు శ్రద్ధచూపడం లేదని, ఉద్యోగులజేబులలో డబ్బు పడుతున్నదని, కొందరు ఆయనతో చెప్పారు. ఆయన విని ఊరుకున్నారు. డబ్బు దుబారాఅవడము చూసి సహించలేక, ఫలానా 'ఏ, బి, సి, డీ' గారలు అపసవ్యంగా వ్యవహరించిరని, దాఖలాలు చూపగా ఆయన యిలా అన్నారు:

"ద్రవ్యమన్నది వినియోగంకోసమే కదా వున్నది. ఈ డబ్బు దుర్వినియోగం కాలేదు. కాని యిందులో ఎంతో కొంత భవనాల మరామత్తుకు దుర్వినియోగ పడివుంటే బాగుండేది!"

* * *

మహారాజావారు వ్యక్తులశీలమును గ్రహించడంలో చతురులు. ఆయనచెంత వున్నపుడు, ఎవరికైనా ఆత్మవిశ్వాసం కలుగుతుంది. మనిషిని ఉత్సాహపరచడం ఆయనకలవాటు. ఒకరిని ఉత్సాహవంతులను చేయాలనే తలంపుతో వారికి ఏపాటి శక్తివున్నా ఆయన దానిని రెట్టించి చెబతారు.

* * *

ఆయన మాట్లాడుతున్నపుడు, హృదయం స్పందిస్తుంది. దివ్యానుభూతులు జ్ఞాపకమొస్తాయి. అవి ప్రసంగాలు కావు. ఉపదేశాలు. ఆయన జీవితాన్ని తాత్వికదృష్టితో వీక్షిస్తారు.

* * *

* కంటనీరు పెట్టుకొని ద్వారకనుంచి వచ్చిన తమ్ముణ్ణి ధర్మరాజు చూశాడు. చూసి అందరూ క్షేమమేకదా అని అడిగాడు; తమ్ముడు మాట్లాడలేక పోయాడు. అపుడు తమ్ముని దుఃఖానికి కొన్ని కారణాలను తానే ఊహించుకున్నాడు. 'ఇదా ఇదా ఏది నీ దుఃఖానికి కారణమ'ని తమ్ముణ్ణి ప్రశ్నిస్తున్నాడు.

ఈ ఘట్టాన్ని చదువుతూ పద్యాలలోవున్న భావగాంభీర్యానికి మహారాజావారు ముగ్ధులయారు. చదువుతున్నవారల్లా ఆగిపోయి, కొంతసేపు ప్రసంగించి ఆనందము పట్టలేక

---

* శ్రీకృష్ణుణ్ణి చూసివస్తానని అర్జునుడు ద్వారకానగరానికి వెళ్లాడు. అర్జునుడు అక్కడ వుండగా శ్రీకృష్ణుడు నిర్యాణం పొందాడు. ఆపుకోలేని దుఃఖంతో అతను హస్తినాపురానికి తిరిగివచ్చాడు. ఆదుర్వార్తను చెప్పలేక అన్నను చూసి 'నయనసలిలోత్పాదకుఁడై' దీనుల్లా అతని పాదాలపై వాలిపోయాడు. 'పల్లటిల్లిన యుల్లముతో' నోటమాట రాక తల్లడిల్లిపోతున్న తమ్ముణ్ణి ధర్మరాజు చూసి ద్వారకలోని తమ బంధువులు కుశలముగా వున్నారు కదా అని పేరుపేరున ఆతురతతో అడిగాడు. శ్రీకృష్ణుడు 'ఉత్సాహముగా సుఖముగా' వున్నాడా అని రెట్టించి రెట్టించి ప్రశ్నించాడు. అంతకుముందే, ధర్మరాజుకి కొన్ని అపశకునాలు వచ్చాయి. ద్వారకకు వెళ్ళిన తమ్ముడు అక్కడే వుండిపోయాడు ఎవరికి ఏ ఆపద వచ్చిందో అని అన్నభయపడ్డాడు. 'నరుఁడేగినాఁడు నెలలేడయ్యెంగదా' అని ధర్మరాజు భయపడుతున్నట్లుగానే అర్జునుడు కన్నీళ్ళతో తిరిగివచ్చి అతని పాదాలను తడిపివేశాడు. తమ్ముని కన్నీళ్ళు అన్న హృదయాన్ని కలచివేశాయి. 'శివునితో కాలకేయులతో గంధర్వులతో పోరాడేటపుడు కంట తడి పెట్టని నువ్వు యిపుడు దుఃఖించడానికి కారణమేమిటి' అని అర్జునుణ్ణి అడుగుతూ, తమవంటి పురుషులకు దుఃఖాన్ని కలిగించే కొన్ని కారణాలను ధర్మరాజు పేర్కొన్నాడు:

ఆయనన్నారు కదా: "పోతన సహజకవి. పదలాలిత్యంలో భావుకత్వంలో ప్రసాదవైభవంలో ఆయనకాయనే సాటి. ఈ పద్యాలు యెంత రసోద్దీపకంగా వున్నవో పఠించండి. ఈ భావాలు గొప్ప నైతికభావసంపన్నులకుకాని అలవడవు! 'ఓడితివో శత్రువులకు...*'" అట! శత్రువుల చేతిలో ఓడి పోవడం! దీనికి ప్రాధాన్యమిచ్చి ఆయన ప్రశ్నించాడు అవును మరి.

---

* "ఓడితివో శత్రువులకు నాడితివో సాధుదూషణాలాపములం
గూడితివో పరసతులను వీడితివో మానధనము వీరుల నడుమన్
తప్పితివో యిచ్చెదనని చెప్పితివో కపటసాక్షి చేసిన మేలుం
దప్పితివో శరణార్థుల రొప్పితివో ద్విజులఁబసుల రోగులసతులన్.
అడచితివో భూసురులను గుడచితివో బాలవృద్ధ గురువులువెలిగా
విడిచితివో యాశ్రితులను ముడిచితివో పరులవిత్తములు లోభమునన్."

'ఓడితివో శత్రువులకు' అన్న ప్రయోగం సాభిప్రాయం. అలా ధర్మరాజు మొదట ఊహించడం సహజం ఆయన ఊహించినట్లుగానే, ద్వారకలో శ్రీకృష్ణుని సతులను, బోయలు చుట్టుముట్టగా, పాశుపతాది అస్త్రాలున్న అర్జునుడు వారిని విడిపించలేకపోయాడు. కాని అతని దుఃఖానికి శ్రీకృష్ణుని నిర్యాణం ప్రధానకారణం. ఆతని వోటమి, దానిని ఎక్కువ చేసినది.

"మన సారథి మనసచివుఁడు మనవియ్యము మనసఖుండు మన బాంధ
వుఁడున్
మనవిభుఁడు గురుఁడు దేవర మనలను దిగనాడి చనియె మనజాధీశా"
"కాంతారంబున నొంటి దోడుకొనిరాఁగాఁ జూచి గోవిందు శు
ద్ధాంతస్త్రీలఁ బదాఱువేల మదరాగాయతులై తాఁకి నా
చెంతన్ బోయలుమూఁగి పట్టికొన నాసీమంతనీ సంఘమున్
భ్రాంతిన్ భీరుని భంగి నుండి విడిపింపన్ లేక ధాత్రీశ్వరా"

ధర్మరాజు చక్కగా ఊహించాడు. ఓటమి ఎరగని వారికి ఓటమి కలిగినపుడు కళ్ళు చెమ్మగిల్లుతాయి. జీవితములో పరాభవం బహుదుఃఖకరమైనది. కాని వైఫల్యం వచ్చినపుడు విచారపడకూడదు. దుఃఖపడకూడదు. శ్రీకృష్ణుని నిర్యాణము; అర్జునుని ఓటమి !

కొందరు కొన్ని ఉత్తమ సంప్రదాయములతో సంస్కారముతో పెరుగుతారు. వాటికి వ్యతిరేకంగా కార్యములు జరిగినపుడు విచారం కలుగుతుంది. సాధుజనులను దూషించడం, పరసతుల పొందుకోరడం, ఆడినమాట తప్పడం యిటువంటివి ఉత్తములకు సరిపడవు. ఇలాంటి తప్పుడుపనులు తమ యింటా వొంటా లేనపుడు, ఇందులో ఏది జరిగినా, అది, ఉత్తములకు బాధాకరం. కనుక, ధర్మరాజు ఆ విధముగా అన్ని ఊహాలను ఊహించాడు. చక్కటి ఊహాలు.

ఆనాడు శ్రీకృష్ణుని నిర్యాణానంతరం, ద్వారకా నగరవాసుల స్థితిని, పాండవుల స్థితిని తలుచుకుని భారతదేశ ప్రజలు దుఃఖించివుందురు.

ఇటువంటి విషాద సన్నివేశాలు మన జీవితంలో ఎన్ని! కనక, మనకు ఆత్మనిగ్రహమవసరం. మరి, కమనీయ కవితా కల్పనకు, వర్డ్సువర్తు మొదలైన పాశ్చాత్య కవులు, పోతనతో సరితూగగలరా ?

◆ ◆ ◆

కొంతసేపు కవితాగోష్ఠి జరిగింది. పిమ్మట ఆనందగజపతి యిలా అన్నారు: "యన్. ఎఫ్. కొన్ని కృతులను పాడి మనల్ని ఆనందింపచేస్తారు. ఆయన శతకము వ్రాసి తెలుగు

కవులకోవను చేరినారుకదా. వారిని వీణ వాయించమందాము. ఆయన రాజకీయచతురుడు. గొప్ప బలవంతుని మీదనే యుద్ధము నడిపిన వ్యక్తి. ఆయనకు చమత్కారమన్నదే వుంటే, విజయ నగరమును బంతు లాడించేవారు.

• • •

సాధారణంగా మహారాజావారికి సంతృప్తివుండదు. ఆయన్ని తృప్తిపరచడం కష్టం. ఒకరంటే యిష్టం, యింకొక రంటే అయిష్టం అన్నవి చిత్రంగా కలుగుతాయి. తాను ప్రేమిస్తున్న తనభార్య పోలికలు ఒక పిల్లయందు కనిపించి నపుడు అతనికి యిష్టం కలుగుతుంది. తనపోలికలున్న యింకొక వ్యక్తిని చూసినపుడు అభిమానమేర్పడుతుంది మహారాజా వారికి వెంకటేశ్వర్రావంటే యిష్టం.

ఏ. పి. పి. మహారాజావారిని మెప్పించలేక పోయింది. ఆశ్చర్యంలేదు. ఒకరి ఆకర్షణీయమైన లక్షణాలను పోల్చుకోవడం కష్టం. ఆమెకు ఉన్నత పరిసరాలతో, మనుష్యు లతో సంపర్కంలేదు. తల్లి గుణాలను పుణికిపుచ్చుకుంది. సాధా రణంగా విభిన్నప్రవృత్తులకు ఆకర్షణ కలుగుతుంది.

మహారాజావారికి ఒకదానియందు ఆకర్షణ చిత్రంగా కలుగుతుంది. హృదయ, ప్రజ్ఞాసౌందర్యములంటే ఆయన ముగ్ధ లౌతారు.

• • •

ఆర్. యస్. వివాహవిషయంలో తటస్థపడిన సన్ని వేశాన్ని ఆయన అర్థం చేసుకోలేకపోయారు. ఆయన దానిని బోధ పరుచుకోవడం కష్టం. ఆమె పెళ్ళికి ఆటంకం కలిగించి

ప్రయోజనాన్ని పొందగోరే మనస్తత్వాలను, దిగజారిపోతున్న నైతికశక్తుల స్వభావాలను, అర్ధం చేసుకోవడం సులభంకాదు.

* * *

ఆమెను ఆనందగజపతి చేరదీశారన్న కబురు విని నేను చాలా విచారించాను. ఇంతవరకు ఆయన జీవితంలో యిటువంటి సంఘటన జరగలేదనుకుంటాను. ఇదివరకటి జీవితం, నాకంతగా తెలియదు. అపుడు ఆయన జీవితం ఎలా వుండేదో నాకు కొద్దిగా తెలుసును.

ఏమైనా, ఈ సంఘటన నాకు అమితవిస్మయాన్ని కలిగించింది. మిక్కిలి పరితపించాను. ఆయనంటే నాకున్న గర్వం, దీనితో తొలగిపోయింది. ఆయన అసమాన ప్రజ్ఞావంతుడు. మంచివాడు. ఆశాజనకమైన భవితవ్యమునకు ఇంతటితో స్వస్తి చెబుదురా!

ఆ రోజుల్లో ఆయనతో నాకంత సాన్నిహిత్యం లేదు. ఆయన్ని చూడాలనుకున్నపుడే కోటకు వెళ్లేవాడిని. కాని తరుచు వెళ్లేవాడిని కాదు. ప్రిన్సిపాలుగారితో సరిపోల్చి చూస్తే మహారాజావారు ఏమంత గొప్పవారు కారని అనుకునేవాణ్ణి. అదీ కాక, నేను బి. ఏ; ప్యాసవాలి. ఈలోపున మహారాజావారిని దర్శించకూడదు. ఆ రోజుల్లో నా భావాలు అలాగ వుండేవి.

• • •

ఆమె చెవిపోగులు తీయించడానికి, మహారాజావారు కంసాలికి కబురుచేశారు. తండ్రి యింటలేదు. కొడుకువచ్చాడు. అతన్ని చూసి మహారాజావాగు యోగక్షేమాలు భోగట్టా చేశారు: "మీరు ఎంతమంది అన్నదమ్ములు? అక్కచెల్లెళ్లెందరు?

అతను ఆయన ప్రశ్నలకు సవినయంగా సమాధానం చెప్పాడు:

"నువ్వు భోంచేసివచ్చావా? ఏం వండుకున్నారు. భోం చేసేటపుడు కిందనే కూచుంటారా?"

"చిత్తం"

"ఎప్పుడూ కిందకూచోకూడదు. పీటలు కుర్చీలు చేయించుకో"

"చిత్తం"

"నీకు వడ్రంగం వచ్చునా?"

"చిత్తం"

"నువ్వు చేయగల వస్తువు నీ దగ్గర లేకపోతే ఎలాగు? ఇతరులుచేసే వస్తువుల అనుభవంలోకంటె మనం చేసుకున్న వస్తువుల అనుభవంలో ఎక్కువ సంతోషం వుంది."

"చిత్తం"

"పీటలు కుర్చీలు చేసుకో. అందుకు ఎంత కర్రకావాలో హుజూర్లో అడిగి తీసుకో"

"చిత్తం"

చిత్తం చిత్తం అంటూ అతను వెళ్ళిపోయాడు. అతనికి తాను యెందుకు కబురు పెట్టారో, మహారాజావారు మర్చిపోయారు. ఇతరుల యోగక్షేమాలను విచారించేటపుడు ఆయన అంతే.

* * *

ఆమె యోగక్షేమాలను చూస్తూవుండమని, నన్ను మహారాజావారు ఆదేశించారు. ఆయన ఆదేశానుసారం, నేను

మెలగుతున్నాను. ఒకనాడు ఆయన యిలాగ అన్నారు: "స్త్రీలంటే, విద్యావంతులకు దయ. మీకు నేనెంతో రుణపడి వున్నాను. మీ రుణం తీర్చుకోవడం కష్టం. మనుష్యులు, ఔదార్యమును, అర్థం చేసుకోలేరు. అవివేకులు మూర్ఖులు వేసిన నీలాపనిందలను తట్టుకొని, మీరు అతి ధైర్యంతో ప్రవర్తించారు. కొందరు తెలివి తక్కువవాళ్లు మీపై అపవాదులు వేయవచ్చును: 'ఆమెను కనిపెట్టుకుని ఆయన ఎందుకు వుంటున్నాడు. ఆ పిల్లను ప్రేమించాడు కాబోలును. కాకపోతే, ఆ పిల్లవల్ల యేదో స్వలాభాన్ని ఆశించివుంటాడు. మహారాజావారి యిచ్ఛకముకోసం, ఆ పిల్లను మంచి చేసుకుంటున్నాడు. ఇలాగ అనేకులు అనేక విధాలుగా ఏవేవో పుట్టగింపులు పుట్టగిస్తారు."

కొంతసేపు ప్రసంగించి ఆయన యిలా అన్నారు: "మీరంటే మా అమ్మగారికి, అక్కగారికి మిక్కిలి విశ్వాసం."

• • •

ఆమెను, వెంకటేశ్వరులను తమ శిక్షణలోనికి తీసుకున్న కొంతకాలానికి, మహారాజావారికి ఓరిమి సన్నగిల్లింది. చిరాకు ఎక్కువయింది. హృదయానికి హత్తుకుపోయేటట్లు, ఎంత బోధించినా పాఠాన్ని శిష్యుడు అర్థం చేసుకోనపుడు, గురువుకు చికాకు కలుగుతుంది. ఒక విషయాన్ని చక్కగా అవగతంచేసుకొని, దాన్ని ఆచరించడానికి మనవాళ్ళు అంతగా అలవాటు పడలేదు. కొందరికి బోధిస్తున్నపుడు మహర్షికి సైతం, కోపం వస్తుంది. మహారాజావారు నవ్వుతూ యిలా అన్నారు: "నేను బోధించే విషయాలు వాళ్ళ చెవికి సోకవు; వాళ్ళకుసొక్కవు. ప్రపంచంలో యిదితప్ప వాళ్ళు యింకేదైనా కోరుతూవుంటారు. నేను చనిపోయిన తరవాత, గురువుగారి

బోధనలనే బాధ తప్పిపోయినందుకు వాళ్ళు సంతోషిస్తారు. పాయసం వొండుకుంటారు."

♦ ♦ ♦

ఆమె వొంట్లో బాగులేదు. నాఅంతట నేను కలగచేసు కుని "డాక్టరుకి కబురు పంపనా" అన్నాను. "మీరంతట మీరే ఆపని చేయవలసింది. నన్నడుగుతున్నారంటే మీరంతటమీరు ఒక నిర్ణయం చేయలేకపోయారని అర్థం. మీరే కాదు; నేనూ అంతే. అన్నిటా మనకు ఆలోచనే. ఆమె చనిపోతుందో యేమో! కాస్త బ్రాందీ యివ్వమనండి" అన్నారు మహారాజా వారు.

నేను ఆమె చెంతకు వెళ్ళాను. "కొద్దిగా బ్రాందీ కావాలా" అని అడిగాను. ఆమె అక్కరలేదని తల ఊపింది. నాడి పరీక్షించి చూశాను. నిస్త్రాణగా వున్నదని మూలిగింది; డాక్టరుకోసం, మనిషిమీద మనిషిని పంపాము.

మహారాజావారు లోనికివచ్చి తొందరగా ఒక ఔన్సు బ్రాందీని ఒన్సు నీళ్ళల్లో కలిపియిచ్చారు. ఆమె అది పుచ్చుకుని కొంత సేపటికి నెమ్మదిగా తేరుకొంది.

♦ ♦ ♦

ఆయనతో పరిచయం ఎక్కువౌతున్న కొద్దీ ఆయన హృదయాన్ని నేను బాగా అర్థం చేసుకోగలుగుతున్నాను. ఆమె మనస్తత్వాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తున్నాను. ఆమెలో కొన్ని మంచి గుణములు, మరికొన్ని చెడుగుణములు వున్నవి. 'కొన్ని' కంటె 'మరికొన్ని' ఎక్కువ. ఆమె మంచిచెడ్డలను చూసే బాధ్యత నాకు వప్పగించిన తరవాత నా అభిప్రాయాలు

మారజొచ్చాయి. నిజానికి గత ఆరేడు సంవత్సరాలలో కొత్త కొత్త అనుభవాలు కలిగి జీవితపరిజ్ఞానం అధికమయింది. జీవితానుభవాలు' వైవిధ్యము అనుభూతులు, నా కొక నూతన దృష్టిని కలిగించాయి.

ఇష్టము లేనపుడు, అసంతృప్తి కలిగినపుడు, ద్వేషము పుట్టినపుడు, అవమానము రేకెత్తినపుడు మనిషికి నిగ్రహము అవసరం. ఈ దుర్గుణములను పోగొట్టుకుందుకు నేను ప్రయత్నిస్తూవచ్చాను. ఇందుకు సాధన ముఖ్యం. సాధనకు అందనిదేదీ వుండదు. ఇలాంటివాటిని సాధనమీద పోగొట్టుకున్నాను. కరుణ భావమును పెంపొందించుకుంటూ వచ్చాను.

అన్నింటికంటె, జాలి గొప్పది. మానవులను ప్రాణులను ప్రేమించాలి. ప్రపంచాన్ని ప్రకృతిని కరుణాదృష్టితో వీక్షించాలి. ఇది సాహితీపరునకు అతిప్రధానం. ఉత్తమ భావుకత్వానికి పరిపోషకం.

వస్తువును వస్తుపరంగా చూడడం ఉత్తమపద్ధతి. నాలో యిలాంటి మార్పు కలగగానే, ఆమె ఆశలను, ఆశయాలను, ఊహాలను, ఉద్రేకాలను, ఛందస్సును విడదీసినట్లు విడదీసి పరిశీలించడ మారంభించాను. ఆపిల్ల బాల్యం ఎలాగడిపిందీ, ఆమె మనోఫలకంమీద ఏఏ భావాలు పడినవీ, ఎలాంటి శిక్షణతో ఆమె పెరిగి పెద్దదయిందీ, నా దృష్టికి తెచ్చుకున్నాను. వాటి దృష్ట్యా ఆమె వ్యక్తిత్వాన్ని ఆకళించుకున్నాను.

ఆమెను గురించి ఇంతకుముందు అనేకకబుర్లు విన్నాను. కాని ఆమెమీద నాకెలాంటి పహ్యాభావం కలగలేదు. పైగా ఆ పిల్ల స్థితిగతులు విని, విచారపడ్డాను. ఇక్కడకు వచ్చాక నా

అనుకంపం మరీ హెచ్చింది. అంతకుముందు మహారాజావారిని గురించి ఖేదపడుతూవుంటిని. ఆ పిల్లను యెందుకు నిందించవలెనో నాకు అర్థం కావడంలేదు. అది ఆమెవృత్తి. కాని ఇక్కడకు రావడంతో, ఒక కొత్తగమనం ఏర్పడింది.

ఆ పిల్ల మనఃప్రవృత్తి విచిత్రమైనది. వింతనడత. క్షణక్షణం మారిపోయే ఆమె పోకడలకు నడవడికి మహారాజావారు అలవాటుపడి సహించగలిగి వుండడం ఆశ్చర్యకరం. అయితే ఆమె మనస్సు అన్న కిటికీనుంచి మహారాజావారిని నేను చూడగలిగాను; ఆయన వ్యక్తిత్వములో అవ్యక్తముకాని అనేక విషయాలను నేను పోల్చుకోగలిగాను. అలా పోల్చుకుంటూనే ఆయన్ని కొన్నిపట్ల గర్హించాను...లేదు. నేనొక వ్యక్తిని గర్హించడమన్నది, వుండదు. అది అసాధ్యం; ఎవరినీ నేను గర్హించలేదు. కాని, ఆమె ఇంకొకచోట సుఖంగా వుండాలని కోరాను. పోనీ, ఇంకొకచోట కాకపోతే, ఇక్కడే ఆయనచెంతనైనా సుఖంగా వుండాలి. ఆమె తన జీవితాన్ని తన చేతులారా భగ్నం చేసుకోకూడదు. ఆమె మాత్రమే కాదు. ఎవరైనా ఇంతే. అందరి జీవితము సుఖప్రదముకావాలి. ఇదిముఖ్యం.

* * *

మహారాజావారికి పెర్షియను ఇంగ్లీషు ఊర్దూ తెలుగు సంస్కృత భాషలు బాగా వచ్చును. ఇన్నిటా వారికి అభిరుచి ఎక్కువ. నిత్యమూ కావ్యగోష్ఠులతో కాలము గడుపుతూ వుంటారు. కావ్యపఠనంవల్లనే కాక, వివిధతరగతుల జీవితపద్ధతులతో వారికి సంబంధం వుండడంవల్ల అపారమగు జ్ఞానం కలిగింది. హిందువులు ముస్లిములు, యూరోపియనులు, మొద

లైన అనేక జాతులవారితో ఆయనకు పరిచయంకద్దు. అన్ని మతాల ధోరణులను వారు చక్కగా అవగతం చేసుకున్నారు. బెంగాలీలతో మద్రాసువారితో వారికి సంపర్కము వున్నది. ఇతరులకు వారి అనుభవములు కలగవు; అవి చిత్రమైనవి. జ్ఞానం అపారం. వివిధ విషయాలలో పాండిత్యము వుంది. వారు ప్రసంగిస్తున్నపుడు గాంభీర్యము తొణకిసలాడుతుంది. మెరుపులవలె భావములు తళుక్కుమంటాయి.

* * *

ఆయనకు సహజసిద్ధమైన అహంకారం. అది సబబైనదే. అయినా, తమ చిన్ననాటి పెరుగుదలవల్ల, సంస్థానములో వుండే వారి పొగడ్తలవల్ల ఏర్పడివుంటుంది. కాని ఆయన తన అహంకారాన్ని ప్రదర్శించరు. అది తన ఆత్మశక్తిని గుర్తెరిగిన అహంకారం; తమ చెంతనున్న వారికి, తాము మహారాజులమనే భావం, తమ మాటలలోకాని, చేష్టలలో కాని కలగనీయరు. ఆయన్ని చూసినవెంటనే అణకువ అన్నది తనంతట తానే పుడుతుంది. పవిత్రభావములలో మెలగవలెనన్న బుద్ధి కలుగుతుంది. అనేక శాస్త్రములలో ఆయన నిధి; గంభీర హృదయుడు.

ఒకరు, ఆయనకన్న ఆంగ్లభాషలో గొప్ప పండితులు కావచ్చును. ఆంగ్లభాషాపండితులై వుండి, పర్షియను భాషలో ఆయన ఆ ఒకరికంటె, పండితులు. ఇంకొకరు ఉర్దూలో మున్షీలు కావచ్చును. మహారాజావారికి ఉర్దూ భాషలో పాండిత్యముండన్నీ ఆ ఇంకొకరికంటె సంస్కృతమున గొప్ప పండితులు. అన్ని భాషలలో పాండిత్యమున్న వ్యక్తికంటె ఆయన సంగీత శాస్త్రమున గొప్ప ప్రవీణులు. సంగీతజ్ఞుడై వుండి అన్ని భాషల

లోను పాండిత్యమున్న వ్యక్తి వుంచే, అతనికంచె ఆయన కొన్ని ఆటలయందు నేర్పరి. పోలో ఆటలో ఆయన మరీ ప్రవీణుడు.

ఇన్నిటిని మించిన గుణము ఆయన మంచితనం. ఆయన సరళస్వభావులు. కాఠిన్య మెరుగరు. ఆర్ద్రహృదయులు. సచ్ఛీలవంతులు. జ్ఞాని. అందువల్ల ఆయన చెంతవున్నపుడు ఎవరికైనా, తాము అల్పజ్ఞులమనే భావం కలుగుతుంది. ఆయన పట్ల పూజ్యభావ ముదయిస్తుంది.

• • •

ఒకసారి ప్రసంగవశాత్తు, ఆయన యిలా అన్నారు: "అధికారులు తనిఖీకి వస్తున్నారనేసరికి భవనాలకు వెల్ల వేస్తారు. అసలుస్థితిని మరుగుపుచ్చి, బాగులేనివాటిని ఓగుగావున్నట్లు చూపిస్తారు. ఇలాగ భ్రమింపచేయడమెందుకు? బాగుగా లేని వస్తువును నిజముగానే బాగుచేయాలి. ఎంతకీ బాగుపడనివాటిని వొదిలివేయాలి. శిథిలమౌతున్న వస్తువులను కళ్ళతుడుపుకోసం అలంకరించవలసిన అగత్యం లేదు. వస్తువులు నశించడం సహజం.

అసలువస్తువను చూడక పైపైమెరుగులు చూసి సంతృప్తి పడకూడదు. వస్తుధర్మాన్ని కప్పిపుచ్చే మెరుగులు నిరర్థకం."

• • •

"కొరడాలతో కొట్టి కొట్టి సర్కసువాళ్ళు గుర్రాలచేత ఫీట్లు చేయిస్తారు. కవిత్వములో ఫీట్లుచేయడంకోసం శబ్దాలను దౌడులు పెట్టించరాదు." అన్నారు మహారాజా వారు

"అలసిన గుర్రాలను అసలే కొట్టకూడదు."

• • •

"ఒకపుడు మేము ఒక గుర్రాన్ని పదివేలకు ఖరీదు చేశాము. అది చాలా మంచిది. తెల్లగా చేయెత్తుండేది. స్వారీ మప్పే నెపముతో మనవాళ్లు చితకకొట్టి దానిని చిత్రహింసలు పెట్టారు. గుర్రం చనిపోయింది!"

• • •

"మా అమ్మాజీ వొకసారి ప్రసంగిస్తూ నాతో యిలా అన్నారు: 'చిరంజీవి ! జీవితంలో చెడ్డ అలవాట్లవలెనే, మంచి అలవాటులను కూడా నేర్చుకోవచ్చును.' మా అమ్మాజీ సెలవిచ్చినదానికి తోడుగా నేనిలాగ జవాబు చెప్పాలనుకున్నాను:" అమ్మాజీ! బుద్ధి చెడ్డఅలవాట్లవైపుకు వేగం వెళుతుంది. దాన్ని మంచివైపుకు మళ్ళించడం కష్టంకాదు. ఒక నియమాన్ని అనుసరించాలని దీక్ష వహించినపుడు దాన్నిబట్టి మరికొన్ని నియమాలుఏర్పడతాయి. అవిమనల్ని నియమబద్ధుల్ని చేస్తాయి. ఒక నియమానికి మనం అలవాటు పడితే, అనేక నియమాలు మనకు అలవడతాయి.'

• • •

"మన దుఃఖాన్ని మనమే భరించాలి. దానిని యితరులకు చెప్పి వారిని ఖేదపెట్టరాదు. అలా వుండడం ఉత్తమ పురుషుల లక్షణం. విషాదమును లోలోపలనే అణచుకుని, మన పరిసరాలను, స్నేహితులను ఉత్సాహవంతముగా వుంచవలెను" అని ఒకనాడు మహారాజావారు సెలవిచ్చారు.

దీనికి కారణం యిలాగ కలిగింది. కళాశాల ప్రిన్సిపాలు దివంగతులైనారన్న వార్త విని అందరూ ఎంతో విచారించారు. అదిజరిగి ఎన్నాళ్లోఅయింది. అయినా విజయరాఘవాచారిగారి దుఃఖము పోయింది కాదు. ఆయన ప్రిన్సిపాలుగారికి

ఆత్మీయులు. వారితో కళాశాలలో కలసిమెలసి పనిచేసిన లెక్చ రర్లలో ముఖ్యులు. తన మిత్రుని మరణంవల్ల ఆచార్యులుగారు నానాటికీ క్రుంగిపోతున్నారు. వారిని ఓదార్చడానికి మహారాజా వారు అనేక విధాల ప్రయత్నించారు. కాని లాభం లేక పోయింది.

ఒకనాడు దర్బారులో గోష్ఠి జరుగుతోంది. అంతా ఉల్లాసంగా వున్నారు. కాని విజయరాఘవాచారిగారు. కలివి డిగా వుండక, విచారవదనులై, ఒకచోట కూర్చున్నారు. మాటా మంతీ లేదు. ఆయనను అనుసయిస్తూ మహారాజావారు యిలా అన్నారు: "పదిమందిలో వున్నపుడు ప్రసన్నముగా వుండాలి. మన స్నేహితులకు మన దుఃఖమును తెలిపి, వారిని నిరుత్సాహ పరచకూడదు. వారివలె ఉత్సాహము చూపి ఆనందిం చవలె. ప్రిన్సిపాలుగారు మరణించినందుకు, మీవలె, అందరూ దిగులుపడుతున్నారు. అయినాసరే, వారు తమ విచారమును దిగమింగి, తమతమ కార్యములలో నిమగ్నులౌతున్నారు. మీవలె వారు కృంగిపోవడంలేదు. మనిషికి స్థైర్యము కావలె,"

"ప్రిన్సిపాలుగారి హయాములో సొమ్ము అపహరణ జరిగినదని శ్రీ కె. ఆర్. గారు చెబుతున్నారు కదా!".

"లేదు. అపహరణ జరగలేదు. ఆయన అలాగ అన కూడదు. చనిపోయిన వ్యక్తినిగురించి ఎవరూ చెడ్డగా చెప్ప కూడదు. చనిపోయిన వ్యక్తులు, తమపై ఒక ఆరోపణ చేసిన పుడు, అది అబద్ధమని చెప్పలేరుకదా! కనక ఇటువంటి మాటలు నా చెవిని ఎవరూ వేయవద్దు. దీనిని యింతటితో ఆపుచేద్దాము"

మహారాజావారికి ఎలాంటి అసంతృప్తి కలిగినా దానిని ఇతరులకు తెలియనీయరు. తమ కష్టములను ఒకరికి చెప్పరు. ఒకరి కష్టములు తమవిగా భావిస్తారు.

ఇంకొక ఏడాదికి చనిపోతారనగా ఆయన ఆరోగ్యం సడలిపోతున్నట్లు పొడకట్టింది. కాని ఆయన ఆ సంగతి పైకి అనలేదు. ఎవరూ ఆ సంగతి పోల్చుకోలేదు. నేను పోల్చుకోగలిగాను. రాత్రివేళ కుర్చీలో ఆసీనులై వున్నపుడు ఆయన అస్పష్టముగా ఏదో అంటూవుండేవారు.

• • •

కళాశాలలో క్లాసుల నిర్వహణగురించి ప్రసంగవశాత్తు మహారాజావారు యిలా అన్నారు: "క్లాసులు సక్రమంగా జరుగుతున్నవో లేదో చూసుకునే బాధ్యత ప్రిన్సిపాలుగారిది. నగర ప్రజలు కష్టసుఖములు విచారించడం నాధర్మం. 'విద్యార్థులకు చక్కటి శిక్షణయిచ్చి ఆదర్శగురుకులమును నెలకొల్పితిమన్న సంతృప్తిని మనం పొందాలి. వేశ్యల జీవిత పరిస్థితులు, నానాటికి అధ్వాన్నంగా వున్నాయి. వారికి జీవనోపాధి కలిగించే విద్యలను బోధించాలి. సంగీత కళాశాలలో ఎక్కువమందిని చేర్పించి లలితకళను నేర్పితే, బాగుంటుంది. మా నాయనగారి కాలంనుంచి విద్యలు యిక్కడ అభివృద్ధి అవుతున్నాయి. వేశ్యలపిల్లలు సంగీతాదికళలను అభ్యసిస్తున్నారు. వారికి సత్ప్రవర్తన అలవడేటట్లుచేసి వారిలో ఆత్మగౌరవ భావాన్ని పెంపొందించాలి. వారి జీవితాన్ని సరిదిద్దవలసివుంది."

• • •

మహారాజావారు: ఒకరిని మనం కించపరచకూడదు. మనిషిని అల్పుడుగా చూడకూడదు. మనిషన్నవాడు. వొకరి

వల్ల భంగపాటు చెందడానికి పుట్టలేదు. అందరిలోనూ అంతో ఇంతో మంచి వుంటుంది. ఆ మంచిని ఇతరులు చూడకపోయి నంతమాత్రాన, వారి మంచికేమీ లోపమురాదు. ఒకరి యోగ్యతా యోగ్యతలు, ఎట్టివో నిర్ధారించడం కష్టం. అపుడు మనం పొరబడినా పొరబడవచ్చును. ఇష్టమైతే ఒకరి చెలిమి చేయవచ్చును. కష్టమైతే మానవచ్చును. అంతేకాని, వ్యక్తులను హీనముగా చూడకూడదు.

* * *

బాహ్యసౌందర్యం, చూడగా చూడగా కంటికి మామూలుగా కనిపిస్తుంది. ఆత్మసౌందర్యం అటువంటిదికాదు. పవిత్ర భావంలో వున్న అందం ఎన్నటికీ చెరగదు. అది నిత్యనూతనం.

* * *

వృద్ధాప్యం మన శరీరాలకు మాత్రమే; మన హృదయాలు నిత్యం పడుచుదనంతో వుంటవి.

* * *

జీవితాన్ని ధారపోసినంతమాత్రాన ఒకడు చరితార్థుడు కాడు. వీరమరణం పొందినందువల్ల అమరుడు కాడు; ఒకడు ఏ ఆదర్శంకోసం జీవితాన్ని ధారపోశాడో, ఆ ఆదర్శపుఔన్నత్యాన్నిబట్టి అతడు చరితార్థుడౌతాడు.

* * *

ఆత్మబలమున్న వ్యక్తిని మీరు ఈసడించినా, అవమానపరచినా, అతను మిమ్మల్ని ద్వేషించడు. మీకు అపకారం చేయడు. కోపగించడు. మీకేవో ఒక ఉపకారంచేసి తన ప్రతీకారాన్ని తీర్చుకుంటాడు. అతని వైఖరివల్ల మీకే జ్ఞానం కలుగు

తుంది. సజ్జనుని అనవసరంగా తూలనాడితిమని మీరే గ్రహిస్తారు. అదే అతను మీకు కలిగించే వివేకం.

♦ ♦ ♦

బలహీనుల్ని, అమాయకుల్ని, ఆడవాళ్ళని, పిల్లల్ని, వంచించడం వారికి హాని తలపెట్టడం మహాపరాధం.

♦ ♦ ♦

మనం మంచిగా వుంటే, ఇతరులు మంచిగా వుంటారు.

♦ ♦ ♦

ఒకరితో మాట్లాడుతున్నపుడు స్పష్టంగా మృదువుగా మాట్లాడాలి. పిరికితనం వొద్దు. బిడియపడరాదు. నసుగుతూ సంభాషించడం మంచిదికాదు.

♦ ♦ ♦

ఇప్పుడు మనమొక మంచిపని చేయలేకపోయినపుడు, వెనక మనం చేసిన మంచిపనులను ఒకసారి తలుచుకోవాలి. నెమలికి అందమైన తన పురి, వెనకనే కదా వుంటుంది!

♦ ♦ ♦

కష్టసుఖాలను సమానంగా అనుభవించడం నేర్చుకోవాలి.

♦ ♦ ♦

అతిధోరణి ఎక్కడా వొద్దు. ఎవరితోనూ, ప్రమేయం లేకుండా సర్వస్వతంత్రునిగా బతకాలనుకునే వ్యక్తి చివరికి ఒకరిమీద ఆధారపడిపోతాడు.

♦ ♦ ♦

ఉదాత్త గాంభీర్యములలో సౌందర్యం వుంది.

♦ ♦ ♦

వాగ్వివాదములు తలయెత్తినపుడు కత్తులు దూసుకో కూడదు. లేనిపోని ఆవేశములు వృథా. వివాదములయందు మౌనము వహించుట ఆత్మకు గొప్ప బలం.

• • •

వివాదములలో ఒక పక్షము వీగిపోయినపుడు ఎదిరి పక్షమువారు 'గెలుపు మాదే' అని గేలిచేయరాదు.

* * *

స్త్రీశరీరసౌఖ్యము పొందడం గొప్పకాదు. ఆమె మేధాశక్తిని గ్రహించి రసానుభూతిని పొందడం గొప్ప.

• • •

మహారాజావారు ఒకనాడు మద్రాసు మెయిలుపత్రికను చదువుతూ యిలా అన్నారు: "దేశంలో సాహిత్య జిజ్ఞాస అధికమయింది. అదే మనం కోరతగింది."

• • •

క్షామనివారణ సంఘాన్ని నెలకొల్పి అందులో మమ్మల్ని సభ్యులుగా వుండమని మహారాజావారు కోరారు.

* * *

ఒకనాడు మహారాజావారు ఒక ముచ్చట చెప్పారు:

"ఒకసారి ఒకాయన నాతో యిలా అన్నారు: 'నావద్ద ఈ కలం, ఇరవై ఏళ్ళనుంచి వుంది. దీన్ని వొదిలిపెట్టడమంటే నాకదోకలాగ వుంది.' అది విని నేనిలా అనుకున్నాను:

'ఆయనకి వస్తువులుమీద ఎందుకింత మమకారం? కలం వంటి అల్పమైనవస్తువుకి జీవితంలో యింత ప్రాధాన్య మిచ్చిన కాపీనపు మనిషితో ప్రసంగించడం ఆనందదాయకం కాదు"

• • •

ఒకమాటు హెచ్. జి. యస్ దొర, నేనూ డాబాతోటలో మాట్లాడుకుంటూ వుంటే డాక్టర్లవిషయం ప్రసక్తికి వచ్చింది. డాక్టర్లమీద నాకు నమ్మకం లేదన్నాను. డాక్టర్లవల్ల నా ఆరోగ్యం చెడిపోయింది. హెచ్. జి. యస్ దొర యిలాఅన్నాడు:

"ఎవరైతే తమకు తెలియని మందుల్ని తమకు బొత్తిగా ఎరుకలేని శరీరతత్వములపై ప్రయోగించి చూస్తారో వాళ్లే డాక్టర్లు!" ఇలా చెపుతూ మహారాజావారు నవ్వుకున్నారు.

• • •

స్నానంచేయడం, భోజనంచేయడం, కబుర్లాడుకోవడం నిద్రపోవడం, రోజూఇరవై నాలుగు గంటలు, ఇంతేనా జీవితం? కాలం అలా గడపకూడదు. ఎపుడో వొకప్పుడు ప్రకృతి, మానవునిపై తన ఆధిపత్యాన్ని చలాయిస్తుంది. అంతవరకూ రానీయక ఈలోపునే మనం ప్రకృతిపై ఆధిపత్యంవహించాలి. కన్నుమూసినపిదప మనంచేయగలిగిందేముంది? కన్ను తెరిచివున్నపుడే మనం ఏమిచేసినాను. కనక బతికివున్నన్నాళ్లూ మనం సత్కర్మలు ఆచరించాలి.

ఒకనికి అబద్ధాలాడాలని వున్నపుడు మనం ఆటంకపరిస్తే, పరులచెంత రహస్యంగా అబద్ధమాడతాడు. కనక అతనికి మనం పూర్తిస్వేచ్ఛను యిచ్చి యిష్టమొచ్చినన్ని అబద్ధాలు చెప్పమందాం. రహస్య వ్యాపారంవల్ల మనసు క్షీణిస్తుంది.

• • •

'ఫిలసాఫికల్ నెససిటి' అంటే ఏమిటని ఒకసారి నన్ను గోపాలబాబు అడిగారు. మిల్లుదొర వ్యాసాలలో యీ పదం వుంది. నాకు అర్థం తెలియదని నేనన్నాను. అపుడే నాకోసం

మదరాసునుంచి బిషప్ వచ్చి కూర్చున్నారు. ఆ పదబంధమునకు అర్థం తెలియచెప్పమని నేను ఆయన్ని అడిగాను. ఆయన నిశ్చయంగా 'యిదీ' అని అర్థం చెప్పక 'యిదై వుంటుందని అదై వుంటుంద'ని ఏమేమో చెప్పారు. బట్లరుదొర గ్రంథములో దీని వివరణ వుందన్నారు. తరవాత నేను ఆ పుస్తకము చూశాను. అందులో బిషప్ చెప్పిన వివరణమే వుంది. అయితే ఆయన అర్థం ఎందుకు స్పష్టంగా చెప్పలేదు? తనకొక విషయం తెలిసిన తరవాత, తెలుసునన్న అహంకారం మనిషికి ఏర్పడుతుంది. బిషప్ అలాంటి మనిషి.

ఇంతకీ ఒక విషయాన్ని మనం చక్కగా అర్థం చేసుకున్నా, దానికి ఇతరులు కొత్తగా ఇంకేమి అన్వయం చెబతారోనని మనం అనుకుంటాం. అలా ఆశించడం మంచిదికాదా!

• • •

ఒకసారి, కొందరు నన్నొక సభకు రావలసినదిగా ఆహ్వానించారు. పెద్దల కోరిక మన్నించాలన్న తలంపుతో, నే నా సభకు వెళ్లాను. వారు నాకొక స్వాగతపత్రాన్ని సమర్పించారు. తాము సంతృప్తితో సుఖముగా జీవితములో ఆనందమును అనుభవిస్తూ వుంటిమని, నాకు సమర్పించిన స్వాగత పత్రములోవారు పేర్కొన్నారు. వారలా వుండడం నాకు సంతోషదాయకమే. కాని జీవితములో సంతృప్తిని పొందుతున్నామని ఎలాగ వారనుకుంటున్నారో. స్వాగతపత్రమును చదివిన తరువాత నాకొక చిత్రకారుని కథ జ్ఞప్తికి వచ్చింది.

పూర్వం ఒకపుడు ఒక గొప్ప చిత్రకారుడు వుండేవాడు. అతను ఒకనాడు, తన స్టూడియోలో కళ్ళమ్మట నీళ్ళు కారుస్తూ కూర్చున్నాడు.

ఒక స్నేహితుడు అదిచూసి యిలాగ అడిగాడు:

"ఎందుకు చెప్పు, నీకా దుఃఖం?"

"ఇవి దుఃఖాశ్రువులా? కాదు; ఆనంద బాష్పాలు!"

"ఆనందమా?"

"అవును; పరమానందం"

"ఎందుకంత ఆనందం?"

"నేను ఎన్నో ఏళ్లనుంచి చిత్రాలు గీస్తున్నాను. అవేవీ నాకు సంతృప్తికరంగాలేవు. కాని ఈవేళ నేను గీసిన చిత్రం అత్యద్భుతం!"

"అంత అద్భుతంగా వుందా?"

"నువ్వేచూడు. ఆ గోడకువుంది చిత్రం; దాన్ని పూర్తి చేసి చూసుకున్నతరవాత అది నాకొక పరమ రహస్యాన్ని తెలియచేసింది."

"ఏమిటో ఆ రహస్యం; నాకూ వినాలని వుంది."

"నా చిత్రాన్ని చూసిన తరవాతకూడా, నువ్వు పోల్చుకో లేదా?"

"లేదుకనకనే నిన్నడగడం"

"ఇది గీసిన చిత్రకారుని ఉపజ్ఞ పూర్తిగా క్షీణించి పోయింది. అదీ రహస్యం!"

ఈ కథచెప్పి మహారాజావారు యిలాగ అన్నారు: "బుద్ధిమాంద్యం నిలవనీరువంటిది. అదెవరూ వాంఛించకూడదు"

• • •

"ది రివ్యూ ఆఫ్ రివ్యూస్" వార్షికసంచికను చూశారూ" అని మమ్మల్ని మహారాజావారు ప్రశ్నించారు. అందులో

'దిస్కెలిటన్ ఇన్ కప్‌బోర్డు' అన్నకథవుంది. తమాషా అయిన కథ. ఇంగ్లండులో ఎన్నికలగడబిడను గురించి ఆకథను వ్రాశారు. కథలో ఇద్దరిసంభాషణ:

"ఛఛ. వొట్టిరోత!" బుజాలను కుంచించుకుంటూ హిస్లింగ్‌యిలాఅన్నాడు: "ఈప్రజలు యింతకంటె ఇంకేం ఒరగ బెడతారు. అంతాద్వేషం; ఎవరన్నా ఈర్ష్య. వాళ్లకి మీరంటే పడదు. మీరు మిలియనీర్లని వాళ్లకు కడుపుమంట. తాముసోష లిస్టులమని డెమోక్రాట్లమని అదని ఇదనిచెప్పుకుంటూవుంటారు. ఎన్నికలతతంగం కోసం మిమ్మల్ని నూదేకినట్లు ఏకి పారేయడమే వాళ్లకు కావలసింది!"

"అంటేఅననీ. నాలాంటివాళ్లకదొక లెక్కా; ఎవరేంఅను కుంటే నాకేం?అన్నట్టు ఈసంగతి విన్నావూ?"

"ఏమిటది?"

"సరిసరి. లాబీని గురించి అపుడపుడు నే నేమిటి అంటూ వుంటానో, నువ్వు విన్లేదన్నమాట!"

"వినలేదే!"

"పూర్వం ఒకప్పుడు వినోదానికి విదూషకుడని ఒక డుండేవాడు. ఇపుడు లాబీ వుంది!"

• • •

లండనులో జరుగుతున్న ఎన్నికల కోలాహలాన్ని ప్రస్తావిస్తూ మహారాజావారు యిలాగ అన్నారు: "మన సంస్థానపు ఆఫీసుల్ని ప్రభుత్వ కార్యాలయాలంత కట్టుదిట్టంగా నడిపిస్తామనుకోండి. మేనేజరు, జాయింటు మేనేజరు పదవులకు

ఎన్నికలపద్ధతిని అనుసరించితే ఏమౌతుందంటారు? అపుడు అయిదేళ్ళ కొకసారి మనకు ఎన్నికలగడబిడ ఉద్రేకాలు పెచ్చుపెరగవుకదా. అన్నీ సవ్యంగా వుండాలని నేను ఖాయిదా చేస్తే ఉద్రేకాలు మరీ జాస్తీ ఔతాయా? ఇంతకీ తమకు నచ్చిన వ్యక్తిని ఎన్నుకుందుకు ఉద్రేకాలు కావేషీలు ఎందుకు?"

• • •

ఒక్కొక్కపుడు వార్తాపత్రికలు అన్నీని. మరొకపుడు అవి ఏమీకావు. వార్తాపత్రికలలో పడినవాటికి ఒక్కొక్కపుడు ప్రాధాన్యం వుంటుంది. మరొకపుడు ఏ ప్రభావమూ వుండదు.

• • •

మహారాజావారు ఒక పర్షియను గీతమును మధురముగా చదివి వినిపించారు. దాని అర్థం యిది: "ఖైదీ చాలా అసాధ్యుడు. ఖైదులోంచి తప్పించుకొని పారిపోతూ తనవెంట ఖైదునే తీసుకుపోయాడు!"

• • •

గుమ్మానికి ఎదురుగా, మహారాజావారు ఆసీనులై వున్నారు. అలసిపోయారు. నీరసపడ్డారు. చేతులతో తలను పట్టుకుని "తలనొప్పి. అదోలావుంది. తగ్గితే బాగుండును" అన్నారు. కుడివైపున మిస్టర్ స్టీవెన్సు కూర్చుని వున్నాడు.

మహారాజావారు అటుతిరిగి చూశారు: "అబ్దుల్ రహీం! నిస్త్రాణగావుంటే, మనిషికి ఏమిటియ్యాలయ్యా ?" అని అడిగారు. అబ్దుల్ రహీం, కొన్ని పేర్కొన్నాడు.

"బ్రాందీ, తీసుకోమని కదూ, నీసలహా"

"అవును"

"ఉహుఁ! నాకది యిష్టంలేదు...సరేలే...బల్లమీదవుంచు. లోపలగదిలోకి వెళతాను. మరీఎక్కువై, తూగిపోతూవుంటే, నిన్ను పిలుస్తాను. వచ్చి బ్రాందీ యిద్దువుగాని..."

మహారాజావారి ఆదేశానుసారం, అబ్దుల్‌రహీం, బ్రాందీ సిద్ధంచేసి, అలమారులో వుంచాడు.

♦ ♦ ♦

నాలుగు రోజులు జ్వరం కాసింది. ఆయాసం ఎక్కువయింది. ఊపిరి సలపని ఎగఊపిరి. మాట్లాడడానికి ఆయనకి ఉత్సాహం లేకపోతోంది.

♦ ♦ ♦

ఎనిమిదయింది. మందు తేడానికి నేను డాక్టరు దగ్గరకు వెళ్ళి వచ్చేటప్పటికి, మహారాజావారి పరిస్థితి, ఆందోళనకరముగ పరిణమించింది. దాదాపు తొమ్మిదయింది. ఆయన నరాలు తోడుకు పోతున్నవి. తొందరగా కంటోన్మెంటుకు డాక్టరు కోసం బయలుదేరాను. ఇట్టే తిరిగి వచ్చాను. తిరిగి వచ్చేసరికి ఆయనచెంత జనానాస్త్రీలు వున్నారు. గదిలోకి వెళ్ళడానికి అవకాశం లేదు.

మనస్సు పరిపరివిధాల పోతున్నది. అధైర్యం హెచ్చింది. గుండె దడదడ లాడుతోంది. ఏ నిముషంలో ఏదుర్వార్త చెవిని పడుతుందో కదా! అక్కడే అలాగే ఆలోచిస్తూ కూర్చున్నాను.

మూడుగంట లయింది. మరి అయిదునిముషాలకు మహారాజావారు పరమపదించారు. పరమేశ్వరుడు, వారిఆత్మకు శాంతిని ప్రసాదించుగాక. ఆయన నిర్యాణానంతరం, యిరవై అయిదు నిముషములు, కోటలో వుండిపోయాను. మర్నాడు

ఉదయం, కడసారి ఆయనను దర్శించుటకు వెళ్ళాను. ఆయన వదనం, మామూలుగానే వుంది. ఏమాత్రం కళ తగ్గలేదు. నిశ్చలముగ, ప్రశాంతముగ, నిర్మల వదనముతో, నిదుర పోతు న్నట్లు కనిపించారు. ఆ గంభీర విగ్రహము అలాగునే వున్నది.

మహారాజావారు మరిలేరు. ఎంత హృదయవిదారకము. నేటినుంచి ఎవరి సుభాషితములు నేను వ్రాయను? ఎవరి ప్రసంగములు విని ఆనందించ గలను? ఎవరితో కవితానందమును అనుభవించగలను ?

♦ ♦ ♦

ఒకసారి,మేం వెలగాడకొండకు వెడుతున్నపుడు, ఆయన "మీరు చేసిన ఏర్పాట్లు బాగున్నాయి" అని మెచ్చుకున్నారు. కొండమీదకు వెళ్లినతరవాత అక్కడి ఏర్పాట్లు చూసి మెచ్చుకున్నారు.

ఆ రోజులు ఉల్లాసంతో ఉత్సాహంతో సంతోషముతో ఆనందంతో గడచిపోయినవి. అవింక మళ్లీరావు. ఎప్పుడూ సహృదయులతో సాహిత్యగోష్ఠులు జరుగుతూ వుండేవి.

వెలగాడకొండమీద, మహారాజావారితో, గడిపిన ఆ రోజులు, నా జీవితంలో మరుపురానివి. చల్లని గాలి; చల్లని గాలికన్న, హృదయమార్దవము కలిగించే మధురసంభాషణములు; సుందరమైనదృశ్యాలు. వాటికన్నా గంభీరమైనది ఆయన హృదయం. అది ఎలాగ మరవగలను!

ఆయనకు కష్టము కలిగించినపని ఎవరుచేసినా వారు ఏమీ అనేవారు కాదు. 'అది నా కిష్టంలేదు' అనేవారు. అంతే. నే నెన్నడూ, ఆయన మనస్సు నొప్పించలేదు. ఈ భావమే

నాకు తృప్తిని కలిగిస్తోంది. నేను ఆయనకు సన్నిహితుణ్ణి. నావల్ల ఆయనప్రతిష్టకు భంగము రాకూడదు. ఆయన కీర్తికి కళంకము తెచ్చేపని నే నెప్పుడూ చేయలేదు. అంతేచాలు!

ఒకసారి మేం వెలగాడకొండమీద కొన్ని రోజులు గడిపాము. ఇక కొద్దిసేపట్లో కోటకు బయలుదేరతామనగా పరివారమును, ఏనుగులమీద, పల్లకీలమీద, మాకంటె ముందుగా బయలుదేరమన్నాను. అందరూ వెళ్లిపోయారు. కొండమీద మహారాజావారు, కె. యన్. నేనూ మిగిలాము.

ముందుగా మహారాజావారు స్నానం చేశారు. ఇంతలో ఉత్తరదిశను పెనుప్రళయంగా, సుడిగాలి లేచింది. దుమ్ము నలువైపులా రేగింది. సుడిగాలి, మా వైపుకు వస్తోంది. అది చూసి ప్రయాణం నిలుపుచేసి, గాలి తగ్గాక వెడదామని మహారాజావారితో అన్నాను. ఒక అరగంటపోతే, సుడిగాలి తగ్గుతుందన్నాను. నా సూచన విని మహారాజావారు యిలా అన్నారు: "అయితే మనకంటె ముందు కోటకు బయలుదేరిన వాళ్లసంగతి?"

"అప్పుడీ సుడిగాలి వస్తుందనుకోలేదు"

"భయంలేదు. బయలుదేరుదాం"

మహారాజావారు ముందువరండాలోకి వచ్చి నిల్చుని తమగుర్రమునకు జీను వేయమని ఆజ్ఞాపించారు. సుడిగాలి ఎక్కువయింది. దుమ్ము రేగిపోతున్నది. ఆయన అక్కడే నిల్చుని కొంతసేపు ఆలోచించి "అవును; సుడిగాలి ఎక్కువయింది. గుర్రంమీద వెళ్లడం ధైర్యమనిపించుకోదు. నేను నడిచి వెళతాను. గుర్రాన్ని వెనక పంపించండి" అన్నారు.

అంటూనే కాలినడకను బయలుదేరారు. ఆయనవెంట నరసింగ రావుగారు బయలుదేరారు.

కొంతదూరం నడిచిన పిదప "ముందు బయలుదేరిన మన వాళ్లు ఏమైనారో! ఏదైనా అపాయం రాలేదుకదా" అంటూ మహారాజావారు శరవేగముతో; గుర్రమును గేలపుమీద దూకించి, వాళ్ళను మధ్యదారిలోనే, కలుసుకున్నారట!

గబగబ ఫలహారం ముగించి, పల్లకీమీద కొండదిగువకు వచ్చాను. అప్పటికే, ఆయన కనుమరుగైపోయినారు. పూల్ బాగ్‌కు వచ్చేసరికి మహారాజావారూ, సిబ్బందీ, అక్కడ ఆగి పోయినారని తెలిసింది. మధ్య దారిలో వానజల్లువల్ల ఆయనా, ఉద్యోగులూ తడిసిపోయినారు.

♦ ♦ ♦

మహారాజావారికి, కోపము వచ్చేది కాదు. అహంకార మసలే లేదు. తమ శక్తి సామర్థ్యములను తామెరిగీ, నమ్రతను అలవర్చుకొని, గాంభీర్యముతో మెలగేవారు. ఇతరులను నొప్పించేవారు కాదు. ఒకరిని సంతృప్తి పరచడమే, ఆయన అభిమతం. రానురాను ఆయనకి ఆత్మ విశ్వాసం అధికమవుతూ వచ్చింది.

వారు నన్నూ, వెంకటరమణదాసుగారినీ, తరుచు మెచ్చుకుంటూ వుండేవారు. అలా మెచ్చుకుంటూ తమను తాము మాతో సరిపోల్చుకునేవారు. అదేచిత్రం; వారిది విశాల హృదయం. ఇతరులను మెచ్చుకుంటూ వారిలో ఆత్మ విశ్వాసము పెంపొందించి, కార్యశూరులను చేయాలని వారి అభిమతం కాబోలును !

ఒకొక్కప్పుడు ఆయన కొందరికి మొదట అనవసరంగా, చనువుయిచ్చి, తరవాత నొచ్చుకునేవారు. మహారాజావారివద్ద చనువువల్ల, కొందరు దారితప్పి ప్రవర్తించడమే దీనికి కారణం. అందువల్ల ఆయనకు ఒకమాటు ఎప్పుడూ రానంతకోపం వచ్చింది. అంటే కొద్దిగా కళ్లు ఎర్రబడినవని చెప్పాలి. అదైనా ఆ కాన్సేపే. యస్. ఆర్; యస్. ఓ. యస్. లిద్దరూ, హద్దు మీరి ప్రవర్తించేసరికి, ఆయనకు కోపం వచ్చింది. వారిని గట్టిగా మందలించారు.

ఆయన గొప్ప విమర్శకులు. వ్యక్తుల పోకడలను పసి కట్టడములో నేర్పరి. ఒకరు యేదిచేసినా, యేమిచెప్పినా, ఆయన నిశితముగ పరిశీలించేవారు. తూచినట్లు మాట్లాడేవారు. ఋజు మార్గమునందు, సదా ఆయన దృష్టి లగ్నమైవుండేది. ఔచిత్య మునకు భంగము వచ్చినపుడు బాధపడేవారు. తమ నడవడికకు కొన్ని సూత్రములు పర్పరుచుకుని, వాటి ననుసరించి తమ జీవిత విధానమును దిద్దుకుంటూ వుండేవారు. కాని రానురాను కొన్నేళ్ళకు ఆసూత్రములు మరీ జటిలము కాజొచ్చాయి. తమ వద్ద శిక్షణ పొందుతున్న వ్యక్తులు యీ నీతి సూత్రములను క్రమము తప్పక ఆచరించాలని ఆయన అభిమతం. శిక్షణలో యివి, వారిపట్లను వారివద్ద శిక్షణ పొందుతున్నవారి పట్లను, క్లిష్టతర మయాయి.

ఆయనవద్ద మెలగే విద్యావంతులవల్ల, అపుడపుడు ఆయ నకు మనఃక్లేశము కలిగేది. ఒకరు విద్యావంతులు కాకపోయి నంత మాత్రంచేత, వారిని ఆయన చిన్నచూపు చూసేవారు కాదు. దగ్గరకు చేరదీసేవారు. ఆదరించేవారు. ఒకసారి చేరిక లభించినదా, వారికి మహారాజావారి ప్రాపు దొరికేది.

అయితే మహారాజావారు, ఒకరికి ఉపకారము చేయడములో కొంచెం తటపటాయించేవారు. దీనికి కారణం లేకపోలేదు. ఆయనవల్ల లబ్ధి పొందాలని ఆశించేవారు ఒకరూ ఇద్దరూ కాదు. ఆశ్రితులు అనేకులు. లేనిపోని ఆశలుపెట్టుకుని కొందరు కేవలం అందుకే, వారిని ఆశ్రయించేవారు.

అందరికీ సదుపాయాలు కలిగించడం కష్టమని ఆయనకి తెలుసును. ఆశ్రితులందరికీ, కోరికలన్నింటినీ చెల్లిస్తూ కూర్చుంటే ఆశ్రితుల సంఖ్య పెరుగుతుంది; కోరికలకొక దారీ తెన్నూ వుండదు. అదీకాక ఒకరి కోరికను మన్నిస్తే ఇంకొకరికి కడుపుమంట; ఇలాగ మహారాజావారు భావించేవారు.

♦ ♦ ♦

ఆయన ఎప్పుడూ ఏదో ఒక పనిచేస్తూ ఆలోచనా నిమగ్నులై వుండేవారు. అసాధ్యమైన కార్యాలను సాధించాలనే దీక్ష ఆయనకు ఎక్కువగా వుండేది. ఒక పనిని తలపెట్టినపుడు, తమకుగల పరిమితులను లక్ష్యపెట్టేవారు కాదు.

నిరంతరం తమవద్ద ఎందరో కొందరు వ్యక్తులు వుండవలసిందే. గోష్ఠి అంటే అంతింతని చెప్పలేని ప్రీతి. ప్రసంగములతో, గోష్ఠులతో నిత్యం, వారి * దర్బారు కలకలలాడుతూ వుండేది. ఇతరుల దృష్టిని అత్యున్నత విమర్శక మార్గములలోనికి

---

* ఆనందగజపతి, రాజ్యభారమును తల్లిగారికిని, మేనేజర్లకును ఒప్పగించి నిత్యము, తాము సంగీత సాహిత్య విద్యా వినోదాలతో కాలం గడిపేవారు ప్రతిరోజు సాయంకాలం మోతీమహలులో పండిత సభ జరుగుతూ వుండేది.

వారి ఆస్థాన ప్రధాన పండితులు, ముడుంబై నరసింహాచార్యులు గారు; అనేక సాహిత్య తత్వగ్రంథాలను రచించారు. కొల్లూరు కామ

మన్నించి, తాము ఏదో ఒక విషయమును ప్రసంగిస్తూ, ఆయన సారథ్యం వహించేవారు. ఆయన ప్రసంగాలలో పునరుక్తి వుండేది కాదు. ఆయనకు జీవితానుభవము ఎక్కువ.

అన్ని జాతులవారితోను, వారి జీవితపద్ధతులతోను మహారాజావారికి పరిచయం వుండేది హిందూవులు, ముస్లిములు, బెంగాలీలు, గుజరాతీలు, ఆంధ్రులు, తమిళులు యింకుమించు అన్ని జాతుల యూరోపియనులతోను వారు కలసి మెలసి వున్నారు. వివిధ జాతుల సంప్రదాయాలను అభిరుచులను తమ అనుభవాలను, తమ ప్రసంగములలో ప్రస్తావిస్తూ వుండేవారు.

ఆయనవి ఆలోచనాపూర్వకమైన నేత్రములు. ఏవేవో తీయతీయని కలలు కంటూ, కాంతులను వెదజల్లుతూ ఆయన కళ్లు రీవిని ఏలుబడి చేస్తున్నట్లుండేవి. ఆయన చూపులు, ఇతరులకందని అందాన్ని కౌన్నత్యాన్ని వెదికి పట్టుకునేవి. ఆ చూపులలో చూపులకందని లోతులు!

---

శాస్త్రి, మండ చిట్టి కామశాస్త్రి, పేరి వెంకటశాస్త్రి, తాతా సుబ్బారాయ శాస్త్రిగారి మామగారు పేరి కాశీనాథశాస్త్రిగారు మొదలైన తర్కవ్యాకరణపండితులు, ఆస్థానవిద్వాంసులు. ఆస్థానవైణికులు దూర్వాసుల సూర్యనారాయణశాస్త్రిగారు. దక్షిణ భారతదేశ వైణికులలో ఒకరుగా పేరొందిన వీణా వెంకటరమణదాసుగారికి, ఆనందగజపతి, గురువు. ఆటలపాటలమేటి ఆదిభట్ల నారాయణదాసుగారు నాటి ఆస్థాన పండితులు. మొహబత్‌ఖాన్ అనే సుప్రసిద్ధగాయకుడు ఆనాటివాడు. క్రీడలలోసైతం తరిఫీదు ఇచ్చుటకు మద్రాసువాస్తవ్యులు రాజామణి అనే యువకుడు ఆస్థానములో నియుక్తుడయాడు. చూ. "ఆనందగజపతి విద్యావినోదములు" - ఆంధ్రపత్రిక తారణ సంవత్సరాదిసంచికలో అడిదము రామారావుగారి వ్యాసం.

సూక్ష్మాతి సూక్ష్మముగ విశ్లేషించే తర్కమన్నా, వేదాంతమన్నా, మహారాజావారికి ప్రీతి యెక్కువ. మిల్ ఆయన అభిమానులలో ఒకరు. జ్ఞానాత్మక ప్రజ్ఞాత్మక కావ్యాలను ఆయన మెచ్చుకునేవారు. అయితే ప్రేమ కవిత్వమంటే వారికి యిష్టములేదని కాదు. ప్రేమకవిత్వమును చదువుతూ అనుభవించేవారు.

ఆయన సమగ్రమైన ఒక తెలుగు వ్యాకరణమును సమకూర్చవలెనని ప్రయత్నించారు. విమర్శించడంలో ఆయనకు నేర్పు హెచ్చు. ఒక కావ్యాన్ని పఠిస్తూ కూలంకషముగ చర్చించేవారు. అనేక ప్రశ్నలు వేసేవారు. ఒకసారి సృష్టిస్థితిలయములను, 'కేవలభావము'ను గురించి ఆయన జరిపిన దీర్ఘమైనచర్చ ఎన్నటికీ మరువరానిది.

• • •

తమఅనంతరం తమ ఆస్తిపాస్తులు చెక్కుచెదరక యింకా అవి అభివృద్ధిచెందాలని, తమ కోరిక ప్రకారం వాటి అజమాయిషీజరగాలని, సాధారణంగా మనుష్యులు కోరుకుంటారు.

మహారాజావారు ఇక కొన్ని నెలలకు చనిపోతారనగా వారు ఆశించిన ఆశయాలను తలుచుకుంటే ఇప్పుడు ఆశ్చర్యం వేస్తుంది. ఆయన ఎలా నడుచుకున్నదీ స్మరించుకుంటున్నకొద్దీ అద్భుతమనిపిస్తుంది; ఆయన ఆశయాలు మహత్తరమైనవి. నిరంతరం శాంతికోసం తహతహలాడేవారు. లాటిను ఫ్రెంచి మొదలైన భాషలను అధ్యయనం చేసేవారు. జ్ఞానసముపార్జనమే వారి ధ్యేయం. ఆయన కృషి అనన్య సామాన్యమైనది. వాటిని చిత్రించడానికి ఎవరికీ శక్తి చాలదు.

తమ ధర్మపత్ని* మరణించిన తరవాత ఆయనకు దిగులు పట్టుకుంది. కాని ఆ దిగులు ఎవరికీ కనిపించనీయక గుండెలలోనే అదిమిపట్టుకుని దాచుకునేవారు. ధర్మపత్ని మరణించిన తరవాత ఒక సంవత్సరమే జీవించారు.

ఎవరో ఒకరిని ఆశ్రయించుకొని, బతుకు తెల్లవార్చుకోవడం గొప్ప కాదు. కాని ఆశ్రయింపులకోసం అందరూ ఆశిస్తారు. ఎవరో ఒకరు, ఎవరైతేనేమి, తమ కోరకలు నెరవేరితే చాలును. ఇతరులకు నష్టం కలిగినా, ఇదివరకు తమను నమ్మిన వారికి కష్టము కలిగినా, ఈ ఆశ్రితులకు లెక్కలేదు. పరుల శ్రేయస్సును పణముగా ఒడ్డడమే వారిపని. కోట్లాటలకు కుట్రలకు అంతూ పొంతూ వుండదు. ఎత్తుకుపై ఎత్తు వేసి ఎలాగైనా, అధికారాన్ని చేతచిక్కించుకోవడమే, వాళ్ళకు కావాలి.

మహారాజావారు మరణించిన వెంటనే, వారి ఆశయాలు, వారితో నశించిపోయినాయి. ఇప్పుడెవరూ, వాటి జోలికిపోరు. ఎవరూ స్మరించరు. అంతా విస్మరించినట్లే కనబడుతున్నది. మహారాజావారిది సమన్వయదృక్పథము. వారి

---

* వనజకుమారి. వీరిది ఉత్తర హిందూస్థానము. విద్యావతి. చిత్రలేఖనమందు, ప్రవీణురాలు. వారు చిత్రించిన చిత్రములు, అంతఃపురపు అద్దపుతలుపులపై నేటికిని వున్నవి. 1896 మే 15వ తేదీన వనజకుమారిగారు మరణించారు. అంతకు ముందురాత్రి ఆనందగజపతికి ఏదో విపత్తు వచ్చినట్లు అప్పారావుగారికి కలవచ్చింది. చూ: మహాకవి డైరీలు-పుట: 178. ఆనందగజపతి నిర్యాణం: 23 మే 1897.

కుటుంబక్షేమము ఎవరికీపట్టదు. ఆయన అనేక ఆశయములతో పరితపిస్తూ వుండేవారు. మరి ఆ గద్దెను, ఎవరు అధిష్టించినా, అది చిన్నబోయినట్లే వుంటుంది!



# రచయిత: కావ్యసృష్టి

అభిరుచి, గుణదోషనిశ్చయజ్ఞానము వున్న రచయిత ఒక కావ్యాన్ని రచియిస్తున్నపుడు అతని సృజన, విమర్శనాత్మక శక్తులు రెండూ, కుడిఎడమలుగా ఆ కావ్యసృష్టిని కొనసాగిస్తాయి. భావ భావోద్వేగ పాత్ర సన్నివేశాదులను మేధ సృష్టిస్తూ వుంటే, వాటికి విమర్శనాత్మకశక్తి గీటుపెట్టి కొన్నిటిని స్వీకరిస్తుంది. కొన్నిటిని తిరస్కరిస్తుంది.

ప్రతిభాక్షేత్రం ఒక టంకసాలవంటిది. రచయిత సృష్టించేవి, అందు తయారయే నాణెముల వంటివి. టంకసాల తయారు చేసిన నాణెములు చెల్లునో చెల్లవో మోగించి చూసినట్లు, వీటిని విమర్శనాత్మకశక్తి ఉపాదేయములగునో కావో పరీక్షిస్తుంది.

• • •

రచయిత తాను రూపొందించే పాత్రలనన్నింటిని జీవితం నుంచి పరిగ్రహించడు. పరిగ్రహించిన పాత్రలను అచ్చంగా పరిగ్రహించినట్లుగానే చిత్రించడు. వెనకటి కవులు నిర్మించిన భావనాత్మక మూర్తుల లక్షణములు, అతనికి తెలియకుండానే, అతనిలో ద్యోతకమౌతాయి.

• • •

నేను ఎంత హాస్యప్రసన్నుడనో అంత గంభీరుడను; భయం కరుడను.

• • •

## పాత్రలు :

షాలంగిరాజు; బూడిదె హరిదాసు; మహర్తి జగన్నాథం; పైసాపంతులు; చిరంజీవి; బుచ్చిశాస్త్రి; మామేనమామ; నందిపిల్లి పూజారి: ఆ ఇంటి పిచ్చివాడు; కృష్ణంరాజు; వైష్ణవ భిక్షువు; ఏకాంగి; నీలయమ్మ సత్రపువాడు; కాళహస్తి; కవి; జంఝామారుతయాజులు: నండూరి తిరువెంగళాచార్యులు; పులిగెడ్డ అరుణాచలం; షరీఫ్; గుంటూరాయన; కపిల వీర్రాజు పంతులు; ఫైల్మాన్ జ్యోతిష్కుడు; సీతన్న; నందిపిల్లి శాస్తుర్లు; రైల్వే రాజపుత్రుడు; ఖాసీం; గంగారాం; పార్వతీశ్వరశాస్త్రి; శ్రీనివాసాచార్యులుగారి తండ్రి; యామిజాల నరసింహస్వాలు: రోవర్ ;

## అగ్రహారీకులు :

ఘంటా కృష్ణయ్య; పులిమిరి శాస్తుర్లు; మండవారు; నరసింహశాస్త్రి. వీళ్ళంతా మహాఘటికులు.

## వెర్రివాళ్లు :

భాస్కరరావు; సకలవిద్యాచక్రవర్తి; రామబ్రహ్మం; చాట్లప్పాయ...'భ' గారి కుమారుడు.

## జట్టీకోర్లు :

మా ఇరుగు పొరుగు రెండు కుటుంబాలవారు.

## వేదాంతులు :

ఉప్పుటూరు రాజుగారి తల్లి. బొబ్బిలావిడ; మా మాస్టరు గారు; మా సిస్టరిన్లా; గాయకుడు; పాపయ్యశాస్త్రి.

## రంగరాజు :

ఆడంబరమగు వేషము. అలంకరణ అంటే ప్రీతి. గుర్రపు స్వారీ. లల్లాయి పాటలు.

• • • •

ఆడంబరముగా దుస్తులు వేసుకోవడం కొందరికి సరదా. కృష్ణమూర్తి; వెంకట రామమూర్తి; సుందర్రావు ప్రభృతులు.

• • •

వడ్డాది కృష్ణభూపతి మహారాజు డేగపోతూ, మేకపోతూ భోగంపోతూ యెందుకూ పనికిరారు.

* * *

కీ. శే. నాగభూషణం పంతులుకు, పరబ్రహ్మమును చూపిస్తూ కళింకోట సిద్ధాంతి యేం తమాషాగా మాట్లాడాడు!

• • •

జులాయిమచ్చు: ఒక యువకుడు. ఇతను వై. బి. వంటి మనిషి. బాగా తాగుతాడు. రెండు చేతులా ఖర్చు పెడతాడు; అప్పులపుట్ట. విలాసాలకు అంతువుండదు. అన్నీ అపసవ్యపు పనులే. ఆడపిల్లలకు ప్రేమలేఖలు.

• • •

---

పాత్రలు అన్న శీర్షికతో మహాకవి అనేక పేర్లు వ్రాసుకున్నారు. ఇవి కొన్నిమాత్రమే.

శ్రీకాకుళం మనిషి : ఇతనిమీద సివిలు వారంటు వుంది. వారంటు వచ్చిందని తెలిసింది. వెంటనే గోడగెంతి అవతలకి ఉడాయించాడు. ఉడాయించి సరాసరి ఊళ్లోవున్న నదిలో పడి ఈదుకుంటూ అవతలగట్టున తేలాడు. అవతలగట్టున వున్న మనిషిని ఇవతలగట్టునవున్న కోర్టు ఏమీ చేయలేదు. అతను సరి హద్దులు దాటిపోయాడు. కనక ఆ పని ఇంకొక కోర్టుది.

* * *

అత్తరువులు ఘూదొత్తులు అమ్మే సాయిబు. అత్తరువు సాయబుతోపాటు, ఒక జ్యోతిష్కుని, భూతవైద్యుణ్ణి ప్రవేశ పెట్టాలి. అవసరమనుకుంటే, ఇంకొక ముసల్మానుమిత్రుణ్ణి పరిచయం చేయాలి.

• • •

'యాంటీనాచ్' కథలో తండ్రికి ఇంగ్లీషు పద్ధతులంటే కిట్టవు. ఈ విధంగా అతని పాత్రను మలచవచ్చును. 'అ' అన్నతను సంపాదకుడు.దివ్యజ్ఞాన సమాజంవాడు. ఎఫ్.ఏ. ప్యాస యాడు. 'ఆ' బి. ఏ. చదువుతున్నాడు. తెలివైనవాడు. మంచి వక్త. చురుకైనవాడు. కళ్లల్లో మెరుపులు. చూసీచూడగానే ఇతరుల దృష్టిని ఆకర్షిస్తాడు.

• • •

రాజుగారికుమారునకు పాఠములుచెప్పే ఒక ట్యూటరు. అతనంటే రాజుగారికి యిష్టము వుండదు. ఇటువంటి పాత్రను ప్రవేశపెట్టాలి.

• • •

అదొక రకమైన వింతమనిషిని పరిచయం చేయవలెను. "డాక్టర్ని తీసుకురా" అంటే "ఆయన ఇంట్లో లేకపోతే"

అంటాడు. "ఉన్నా ఆయనదగ్గర మందులు లేకపోతే; మందు లున్నా జబ్బు కుదరకపోతే..." ఇదీ వరస.

• • •

ఒక రాజపుత్రుడు: గౌరవము, మర్యాద, ఠీవి, కీర్తి వీటిపై అతనికి కొన్ని చిత్రమైన అభిప్రాయాలున్నాయి. అందువల్ల కొన్ని చిక్కులు అతనికి తటస్థ పడతాయి.

• • •

ఒక వేశ్యను ఒకడు ప్రేమిస్తాడు. సంఘర్షణ. మానసిక వ్యథ. నాయిక వేశ్యకాకపోతే, కథ ఇంకొకలాగ వుంటుంది. సంసారులపిల్ల. కొన్ని అడ్డంకులు: ఆ పిల్ల కన్యకాక, పెళ్లయిన పిల్ల అయితే, మరి ఒక లాగ వుంటుంది.

• • •

ఒక ముసల్మాను ఒకానొక బ్రాహ్మణకన్యను పెళ్లి చేసుకోవాలనుకుంటాడు. అతనొక రాష్ట్రానికి అధిపతి. ఆ పిల్లకు వివాహమవుతూ వుంటుంది. అతను ఆ వివాహమును ఆపుచేయిస్తాడు. హిందూదేవాలయాన్ని ధ్వంసం చేయిస్తాడు. ఆ పిల్ల మహమ్మదీయమతాన్ని స్వీకరిస్తుంది. కొంతకాలానికి అతను ఆమె చాలా యిష్టంగావుంటారు. ఇదివరకటి బాంధవ్యం, సన్నివేశములు; ఈ కథ ఒక శిథిలనగరములో జరిగినట్లు చూపవలెను.

• • •

స్త్రీపునర్వివాహఉద్యమంలో చేరి, అటుపిమ్మట ప్రాయశ్చిత్తం చేసుకోవడం. తమాషా అయిన సంఘటన.

• • •

త్రాగుడు : వైద్యశాస్త్రపుదృష్టి, తాగుబోతుదృష్టి.

• • •

బాజాలలో గర్భితమై వున్న వేదాంతం.

• • •

పూర్వాచారపరాయణుని యింట ఇంగ్లీషు చదువుకున్న వాని ప్రవర్తన : అతను దర్భాశాస్త్రి వంటి సనాతనుడు. ఈ యువకుడు, తన ప్రవర్తనవల్ల ఇంటి యజమానురాలిని గాభరా ఎత్తించడం. మామూలు దుస్తులతో పరిషించకుండా, భోజనం. పుస్తకాలు పట్టుకుని వంటింట్లోకి వెళ్ళడం. పల్లెటూరివాళ్ళ దగ్గర డాబులు; వాళ్ళను ప్రగల్భంగా చూడడం గంగవెర్రు లెత్తించడం.

• • •

ఇంగ్లీషు రానివాళ్ళు, ఇంగ్లీషు వచ్చినవాళ్ళదగ్గర అదొక చిత్రంగా ప్రవర్తిస్తారు. ఇంగ్లీషు మర్యాదలు తాము ఆకళించుకున్నట్లు వాళ్ళు నటిస్తే ఎలా వుంటుంది? ఇంగ్లీషు వచ్చినవారి మెప్పుకోసం, ఆ అలవాట్లన్నీ గొప్పవేనన్నట్లు నడుస్తారు... ఇందుకు రామచంద్రుడుగారు ఒక దాఖలా.

• • •

## హాస్యసన్నివేశాలు :

ఒకడు, ఇకకొకణ్ణి, అతడక్కడలేడు కనక ఫరవాలేదనుకొని, ఇతరుల ఎదుట నిందిస్తూ పరమానంద భరితుడవుతూ వుండగా, ఆ వ్యక్తి అవతలనుంచి, ఆ మాటలు వినీవిననట్లు అక్కడకు రావడం.

ఏదో ఒక మూర్ఖపు పని ఇతరులకు తెలియకుండా చేద్దామని, చేస్తూ పట్టుబడిపోయి, దాన్ని సమర్థించుకుందుకు ఇంకొక తెలివితక్కువ పని చేయడం.

ఇతరులను ఒకటి ఆచరించమని చెప్పి, తానది ఆచరించవలసి వచ్చేసరికి, ఇంకొక అర్థం చెప్పి, దాన్ని అతిక్రమించడం.

మూర్ఖపు కౌన్సిలర్లు వీధులలో తామే తమ పొరుగువాడి యింటిముందు చెత్తాచెదారం పోయడం.

• • • •

తమాషాలు : ప్రతిదాన్నీ ప్రతివాణ్ణీ, అతిచులకగా చూడడం కొందరి స్వభావం : "వాడా, వాడిసంగతి యెవడెరగడు?...వీడి మాటలు మరి వినక్కరలేదు."

ఇవతలివాడిమాట కొట్టి పారవేయడం : "నీవు చెప్పిందేపాటి? నేను ఒక రోజున..."

తాతలనాటి గొప్పలు: "మా తాతగారున్నపుడు యెలా వుండేదంటే..."

కొడుకులు తెలివితేటలు : "మావాడు యేమనుకున్నాడనుకున్నారూ..."

తర్జనభర్జనలు : "పూసపాటివారు గొప్పా? బొబ్బిలివారా?"

"పాతసబ్మేజస్ట్రేటా, కొత్తా..."

"నే చూసినన్ని పుల్లూ, పాములూ...అహా!..."

ఉబ్బులింగడు : కొంచెం కదిలిస్తేచాలు, ఇట్టే ఉబ్బిపోతాడు: "శాస్తుర్లుగారు నిజం మాట్లాడతారు."

"ఎవరు ఏమనుకున్నా లక్ష్యంలేదు"

"మహా వేడివస్తువులు తింటారు"

"పేకాట మహాబాగా ఆడతారు"

ఇట్టే ఉబ్బిపోయేవాళ్ళు బలహీనులు.

◆ ◆ ◆

జబ్బుతో మంచాన పడ్డపుడు రోగికీ చిరాకే; చేసేవాళ్లకీ చికాకే. చేయడం ఎంత కష్టమో, చేయించుకోవడం అంత.

◆ ◆ ◆

సుస్తీ చేసినపుడు రోగికి తనను జాగ్రత్తగా మర్యాదగా సున్నితంగా ఇతరులు కనిపెట్టుకొని వుండాలని వుంటుంది. తన కోరికలు చెల్లిస్తూ వుంటే, ఆదేశాలు పాటిస్తూవుంటే, అదొక దర్జా. బాగా వున్నపుడు నోరు మెదపని మనిషికి సైతం మాట్లాడాలని కుతూహలం. ఎపుడూ మాట్లాడని విషయాలు మాట్లాడే ధైర్యం అతనికి వస్తుంది.

* * *

అ అనే కథానాయకుడు జబ్బుతో తీసుకుంటున్నాడు. 'ఆ' అన్నాడు: నువ్విక్కడ చచ్చిపోతే చాలా అదృష్టవంతుడివి. ఎకాఎకీ స్వర్గానికి వెళ్ళిపోతావు !

కథానాయకుడికీ సలహా నచ్చలేదు. మంచి డాక్టర్నెవర్నైనా తీసుకు రమ్మని ప్రాధేయపడ్డాడు.

ఆ : తీసుకువస్తేమాత్రం? నువ్వు స్వర్గానికి వెళ్ళకుండా డాక్టరు అడ్డుపడగలడా ?

అ : డాక్టర్ని తీసుకువస్తారా, సరేసరి; లేకపోతే, నానా అల్లరీ పెడతాను; అవతలకి పారిపోతాను. కొంపకి నిప్పు పెట్టేస్తాను.

ఆ : నీకు రోగం వచ్చిందని విచారించేవాళ్లెవరూ లేరిక్కడ.

అ : అమ్మ; నీ అమ్మకడుపుమాడ! నేను చస్తే నా ఆస్తిపడేసుకుందామనా చూస్తున్నావ్. పట్టుకుపో. నాఅస్తంతా కొల్లగొట్టుకుపో. కాని పోతూపోతూ డాక్టర్నిమాత్రం పంపించి మరీ, పో.

ఆ : నిక్షేపంలాంటి స్వర్గం వస్తూవుంటే డాక్టరో డాక్టరో అంటావేమిటి! స్వర్గం ఎంత...

అ : నేనో పక్కనుంచి చస్తోంటే, స్వర్గం స్వర్గం అంటావేమిట్రా! స్వర్గం మంచిదే, దాన్నలాగ వుండనీ. నేను బతకాలి. బతికి కొన్ని మంచిపనులు యీ ప్రపంచంలో చేయాలి.

ఆ : ఇంతవరకూ చేయలేదుకదా; ఇకముందు చేస్తావని నమ్మకం ఏమిటి ?

అ : నా ఆస్తి నీ పేరున పెట్టమంటావు. అంతేనా ?

ఆ : మరి, కూడా పట్టుకుపోతావా ?

అ : చచ్చినా నీ కియ్యను. సత్కార్యాలు చేస్తాను.

ఆ : జబ్బు నిమ్మళిస్తే ఇప్పుడు పుట్టిన ఈ బుద్ధికాస్తా పోతుంది.

• • •

"ఏది సత్యమో అది చెప్పు. శ్రద్ధాసక్తులతో నువ్వు రుజుమార్గాన్ని అవలంబించి అపమార్గాన్ననుసరిస్తున్న నీ భర్తకు

మహిళా ధర్మాన్ని, ఆదర్శాన్ని అవగత మయేటట్లు చెయ్యి. యువకులకు సహజమైన చెడుత్రోవలను భర్తపట్టినపుడు ప్రశాంతచిత్తంతో, ఓరిమితో అతన్ని మంచి మార్గానికి మళ్ళించు."

"అయితే ఏది సత్యం?"

"నీ మగనికి ఏది ప్రియమైనదో అది."

"అంతేనా, నిజమంటే."

"నిజమాడితే నిష్టూరం."

"కనక నిజమాడకూడదా"

"మరి, నీ భర్తను సంతృప్తి పరచాలంటే ఎలాగ?"

"అదేనా సంతృప్తి అంటే?"

"మన సమాజంలో భర్తదయాదాక్షిణ్యాలమీద భార్య ఆధారపడక గత్యంతరంలేదు. ఏది అతనికి ప్రియమైనదో, దానినే ఆమె ఆచరించాలి. ఏది భర్తకు హితవో, అదే భార్యకుహితవు."

"మా ఆయనకి ఉల్లిపాయలపొడ కిట్టదు."

"అయితే ఇంట అవి తరగకు"

"ఉన్నమాటాడితే ఉలుకు."

"సత్యమనే వెలుతురును.ందు కొందరు వెలవెలబోతారు. కనక అబద్ధాలాడవలసి వస్తుంది."

"అబద్ధాలతోనే బతుకుతున్నాం. నాభర్తను ప్రేమించి పెళ్ళి చేసుకోలేదు."

"పోనీ, పెళ్ళి చేసుకున్నావుకదా, యిప్పుడు ప్రేమించు."

"ఎలాగ? ఆయన గుణాలు మంచివి కావు. తనొక గొప్ప వాడనని నన్ను పొగడమంటారు."

"పోనీ, పొగుడు."

"అబద్ధమెలా ఆడను?"

"నిజమాడితే నిష్ఠూరంకదా?"

"ఆయన నిజమే చెప్పమంటున్నారు మరి?"

"నీభర్తకు ప్రియమైనదేదో అది నిజం."

"నన్ను నేను వంచించుకోనా?"

"ఈ స్థితి వచ్చినపుడు తప్పదు!"

• • •

"ఇదిగో మీ డాక్టర్ని యిక్కడ వున్నాను. మీ ఆడపిల్లల కష్టసుఖాలు నాకు చెప్పండి. వివాహం అనివార్యమైన ఒక వ్యాధివంటిది. తగిన కట్టుబాట్లు లేకపోతే ప్రమాదం."

"మా ఆయనకి అబద్ధాలు కిట్టవు. ఎప్పుడూ నిజం చెప్ప మంటారు."

"ఆమాటలు నమ్మేవా నీ అంత వెర్రిబాగులది యింకొ కతె లేదన్నమాట."

"ఆయన మాటలు నిజమనుకున్నాను."

"అనుకుని?"

"నిజం చెప్పాను"

"ఏమని?"

"మీరు చాలా అందవికారంగా వుంటారండీ!" అన్నాను

"నీ మరణ పత్రంమీద నువ్వే సంతకం చేసుకున్నావన్న మాట!"

"ఇపుడేమిటి చేయడం?"

"నువ్వుకూడా అందవికారంగా వున్నానని చెప్పు. సౌందర్యలోపం, హృదయ సౌందర్యానికి బాహ్యచిహ్నం అని చెప్పు. 'మీరూ నేనూ కురూపులమేనండీ. కనుకనే మనిద్దరికీ ఈడూజోడూ కుదిరింది' అను."

"నేను అందంగా వుంటేనో?"

"మీరు బాగులేరని నేను ఎందుకు అబద్ధమాడేనో మీకు తెలుసునా? అను."

'నేను అందంగావుంటే, ఎందుకు అందంగా లేనన్నావ్?'

'నేను చెప్పను'

'చెప్పాలి; చెప్పితీరాలి.'

'తప్పదా?'

'తప్పదు!'

'అయితేసరే; మీరు అందంగా వున్నారని నేను నిజం చెబితే, నా అంతటి అందగాడిక లేడని విర్రవీగుతారు.'

'విర్రవీగితే నీకేం?'

'విర్రవీగి ఊరుకుంటారూ? లోకంలోవున్న ఆడవాళ్లంతా మీ అందాన్ని చూసి మోహిస్తున్నారని భ్రమపడతారు.'

• • •

"మా ఆయన్ని నేను ప్రేమించడంలేదు."

"ఎందుచేత?"

"అంతకుముందే ఒక యువకుణ్ణి ప్రేమించాను."

"అయితే యితన్నెందుకు పెళ్లి చేసుకున్నావు?"

"నా ఇష్టంమీద ఈ పెళ్ళి జరగలేదు"

"అయిపోయినదానికి విచారమెందుకు?"

"నేను ఈయనతో కాపరం చేయలేను."

"ప్రయత్నించి చూడు"

"నా బాధలు ఎవరికీ అర్థంకావు"

"అవేమిటో చెప్పు. ఆలోచించి చూద్దాం. నలుగురూ ఏమంటారో అడుగుదాం. నీకు ఎంతమంది అనుకూలమో, కనుక్కుందాం. ఈ విషయం చర్చించుదాం."



# 'భ…' గారబ్బాయి

**రూ**పం : చామనచాయ; చూపులలో అసంతృప్తి; నిర్వ్యాచీ. కిందకు చూస్తూవుంటాడు. ముసిముసి నవ్వులు; నవ్వులో కిల్లాడీతనం. తాహతుకు మించిన వేషాడంబరం. నోరు కొంచెం వెడల్పు, పెదవులు దళసరిగా వుంటాయి. పెద్దలతో మాటలాడేటపుడు తడబడతాడు; మామూలు మనుష్యులతో మాట్లాడుతున్నపుడు నిర్లక్ష్యంగా వుంటాడు; డాంబికానికి పోతాడు. తన సర్వజ్ఞతను చాటుతాడు.

నటన : ఎపుడూ ఏదో ఒక పుస్తకం పట్టుకుని తిరుగుతూ వుంటాడు. చిన్నమెత్తు పని చేయకుండా, తానేదో అయిపోవాలని అతని కోరిక. ఒళ్ళు కదపడు: ఒళ్లో అన్నీ పడిపోవాలి. ఎక్కేగుమ్మం; దిగే గుమ్మం. అక్కడిమాట ఇక్కడ; ఇక్కడి మాటలు అక్కడ. కబుర్లు చెబుతూ కులాసారాయుడిలాగ బతకాలని అతని భ్రమ. ఏ వ్యవహారంలోనైనా సరే, తనకు కాస్త లాభసాటిగా వుంటుందని తోస్తే, అదురూ బెదురూ లేకుండా, తల దూరుస్తాడు.

మనిషికి పెద్దంత్రం చిన్నంత్రం లేదు. కొత్తా పాతా అన్న మొహమాటం లేదు. చదువుకున్నవాళ్లూ చదువుకోని వాళ్లూ అంతా వొకటే. ఎవర్నయినా సరే, అబద్ధమో, సుబద్ధమో ఆడి బుట్టలో వేసుకోవచ్చునని చొరాయించుకు

పోతాడు. నూరబద్ధాలాడైనా సరే, తనపని తాను చేసుకు పోవాలనుకుంటాడు.

లోకం తన గొప్పతనాన్ని గుర్తించనట్లూ, తృణీకరిస్తు న్నట్లూ, ఎవరో తనకు అపకారం చేస్తున్నట్లూ వాలకం పెడ తాడు. ఉపకారం పొందడంకోసం, మనుష్యుల్ని యిట్టే ఉబ్బి స్తాడు. తానుమాత్రం ఏపనీ చేయడు. అంతా ఇతరులు తనకు అమర్చిపెట్టాలి. జంకూగొంకూ లేదు. సిగ్గూ బిడియమూ సున్నా. నిలువు నిలుపాదం మోసం!

ఒకసారి నన్ను మోసగించి, బయట పడిపోయాడు. అది మోసమేనట; కాని అతన్ని నేను క్షమించాలట. టక్కరి తనం వల్ల, బతుకు బాగుపడుతుందని అతని నమ్మకం. నిజా యితీపరులు చేయవలసిన పెద్ద పెద్ద పనులు సైతం, తానుచేస్తా నని బయలుదేరతాడు.

తల్లిదండ్రుల్ని బొత్తిగా ఖాతరుచేయడు. వాళ్లగతి వాళ్లది. కన్నతల్లి నానాకష్టాలూ పడుతూవుంటే, ఆవిణ్ణి చూడడు. హాయిగా తాను మదరాసు పోయాడు. విద్యార్థి దశలో తెగతిరిగి చదువు పాడుచేసుకున్నాడు. ఇంగ్లీషున నాలుగుపంక్తులు వ్రాస్తే, అన్నీ తప్పులతడకలు. స్పెల్లింగ్ ఘోరం. ఎవరిసలహా చెవికెక్కదు. బాగుపడేగుణం ఒక్కటీ కనిపించదు. తనబాగు కోరుతున్నవాళ్లమీద సైతం, గౌరవం పూజ్యం.

* సుందర్రావు పంతులు, వెంకటేశ్వర్రావు మొదలైన వాళ్ళ వితరణవల్ల జీవితం నెట్టుకువస్తున్నాడు. మహారాజా

* మద్రాసు విశ్వవిద్యాలయంలో ఆంధ్రభాషాశాఖ ప్రధాన ఆచా ర్యులుగా వున్న శ్రీ నిడదవోలు వెంకటరావుగారి తండ్రి.

వారు, మద్రాసునుంచి వెళ్లిపోతూ, అతన్ని అడ్మిరాల్టిహౌసులో వుండనిమ్మన్నారు. అలాగే వుండనిచ్చాను. ఒకరోజున, వున్నట్టుండి, వెర్రెత్తినట్లు వెంకటేశ్వర్రావుమీద కలియబడ్డాడు. అప్పటినుంచి, అతనంటే నాకు దురభిప్రాయం ఏర్పడింది.

నేను మెత్తమెత్తగా వుండడం కనిపెట్టి, బాగుందనుకున్నాడు కాబోలు, ఇక్కడకు వచ్చిన కొత్తలో, మహాచనువుగా మసలడమారంభించాడు. అసలే అతనికి చొరాయింపు ఎక్కువ. అందులో నేను మెత్తగా కనిపిస్తున్నాను; చనువు దొరికింది. అనువుగాపుంది. ఇక నేముంది; నెత్తికెక్కి పిండి దంపవచ్చు ననుకున్నాడు. ఇట్టే జోస్తీకలిపేశాడు; సాయిలా పాయిలాగా నాతో తిరగాలని ఉబలాటపడ్డాడు. బండిమీద నేనెక్కడికెడితే,అక్కడికి తానూతయారు; రోజూ పొద్దున్నేహాజరు. బుజం బుజం రాసుకుతిరగడం; నేను ఎక్కడ కూర్చుంటే తానూ అక్కడ చతికిలబడడం, మాటల్లో మాటకలపడం. ఇంటికివస్తే వచ్చాడు; వచ్చినవాడు తిన్నగా కూర్చుంటాడా; అన్నిభోగట్టాలూ అతనికే కావాలి. ఎవర్నీ అడక్కుండా పుడక్కుండా, ఏకాఏకీ మెట్లు ఎక్కి మేడ మీదికెవచ్చి రోజూ నాపీకలమీదకి అవాలా అయేవాడు.

వాళ్ళనాన్న నాకు కొన్ని చరిత్ర గ్రంథాలు యిస్తానంటూ కొన్నాళ్ళు నన్ను ఊరించాడు. అవి నా కవసరం. 'మీనాన్న ఊరించడంతోటే సరిపోతోంద'న్నాను. 'నేను తెస్తాన్లెండి' అన్నాడు. తెచ్చిపెట్టమన్నాను. పట్టుకు వచ్చాడు. ఆ మొగమాటంవల్ల, అతనెంత అతిగా ప్రవర్తించినా, పోనీలెమ్మని ఊరుకున్నాను. పుస్తకాలు పొరుగూరులో వున్నాయి. డబ్బు

కావాలన్నాడు. సరే అని రానూపోనూ ఖర్చులు చేతిలో పెట్టాను. కాని ఆ పుస్తకాలు వాళ్ళ యింటనే వున్నాయని తరవాత చూచాయగా తెలిసింది. ఒకసారి గొప్పగొప్ప పుస్తకాలు తనదగ్గర వున్నాయన్నాడు. పేర్లు చెప్పమన్నాను. జ్ఞాపకం లేవన్నాడు. "ఇదివరకు మీ నాన్నగారు మహారాజా వారికి చూపించినవేనా."

"కాదు. ఇవి కొత్తవి." ఏదో ఊరు వెళ్లి పట్టుకువస్తానన్నాడు. అన్నప్రకారం పట్టుకువచ్చాడు. కాని తీరాచూస్తే అవీఇవీ ఒకటే. ఇదివరకొకసారి వాళ్ళ నాన్నగారు మహారాజా వారికి యీ పుస్తకాలను యివ్వగా, పండితులు పరిశీలించి పనికి రావని, వాటిని తిరిగి యిచ్చివేశారు.

"అవీ ఇవీ ఒకటేనోయ్!" అన్నాను.

"కావండీ! ఇవి మొన్ననే సంపాదిస్త" అని అతను ఒకటే మొరాయింపు.

సరే; నాతో అబద్ధాలాడితే ఆడాడు. బాధలేదు. మహారాజావారితో తాను మెట్రిక్యులేషను ప్యాసయినానని చెప్పాడుట. ఈ సంగతి విని, అబద్ధా లాడకూడదని మందలించాను. పెద్దలచెంత జాగ్రత్తగా మసలి ముందుముందు అభివృద్ధికి రావాలని, అబద్ధాలవల్ల అనేక అనర్థాలు వస్తాయని హితబోధ చేశాను. జీవితాన్ని చక్కదిద్దుకొని బాగుపడమన్నాను. ఆత్మవంచనవల్ల అపకారం జరుగుతుందని, తానుప్యాసవని మెట్రిక్ ప్యాసయినట్టు అందరినీ నమ్మించ చూడడం తగదని, అందులోను మంచిని ప్రేమించే మహారాజావారివంటి సత్పురుషుల చెంత అసలే అబద్ధ మాడకూడదని, అతనికి అనేకవిధాల నచ్చ

చెప్పాను. నేను చెబుతున్నదంతా వింటూ అవునన్నట్లు తల ఊపాడు.

కాని అవతలకివెళ్ళి తనంటే నాకు అయిష్టంగావుందని, అందరితోనూ చెప్పుకోవడం మొదలుపెట్టాడు. నాకు ఎన్నడూ రానంతకోపం వచ్చింది. అతన్నెపుడూ, 'డి జి' గారు దగ్గరకి రానిచ్చేవారు కాదు. పెద్ద 'అరిస్టాక్రాటు' వలె అతను అభినయించడం, అర్హతలేనిదే గొప్పగొప్ప అవకాశాలు సదుపాయాలు పొందాలని ఆశపడడం, ఆయనకు కిట్టేదికాదు.

ఆయనలాగ, నేనుమాత్రం అతన్ని ఎడబెట్టలేక పోయాను. ఇలావుండగా, ఒకనాడు తెలుగు పుస్తకాల పెద్ద జాబితావొకటి, తీసుకువచ్చి నాకు చూపించాడు. జాబితా బావుంది. కొన్ని పుస్తకాలు ఎక్కడా దొరకవు. మరికొన్ని అరుదు. జాబితా అకారాది వర్ణక్రమాన్ననుసరించి తయారు చేశాడు.

ఈ పుస్తకాల విషయం * యల్. యల్. గారు విన్నారు. విని మహారాజావారికి చెప్పారు. అతను ఆ జాబితా ప్రకారం శ్రీ నిడదవోలు సుందరరావు పంతులుగారి పుస్తకాలను తీసుకువచ్చి, అవి తనవేనని చెప్పి మహారాజా వారికి సమర్పించాడు. ఎంత సాహసం, ఎంత అబద్ధం !

సుందరరావు పంతులు, యల్. యల్. గార్ల వద్దకు వెళ్లి తన తప్పు మన్నించమని ప్రాధేయ పడమన్నాను. చేసిన

---

* లింగం లక్ష్మీజీపంతులుగారు.

తప్పు సరిదిద్దుకోమన్నాను. ఉహుఁ; వాళ్ళ నాన్నగారు వారి దరి చెంతకుపోయి, ఈ వ్యవహారం సర్దుబాటు చేయాలట! పైపెచ్చు తనకి అవమానం జరిగిందట! "ఏమిటీ వెర్రిమొర్రి వేషాలు; వెళ్లి, యల్. యల్. కి, క్షమాపణ చెప్పుకో"మన్నాను. అబ్బే; తాను తప్పుచేసినా, ఇతరులను క్షమించమని అడగడం అతనికి చిన్నతనం. దర్జాకు లోపం!

అతను తప్పులే చేస్తాడు. ఇతరులు ఏమీ అనుకోకూడదు. అనకూడదు. అనుకున్నా అతనికి ఫరవాలేదు. అన్నా అతనికి లెక్కలేదు. పరువు తక్కువపనులు చేసి, మన్నించమని ఒకర్ని అడగడం అతనికి పరువుతక్కువ!

• • •

మహారాజావారు : చూశారా మరి; ఈ కుర్రవాని సంగతి ఎలావుందో! కొంతసొమ్ము యిచ్చి అతనికి సహాయం చేతామనుకున్నాను. కాని అతనివన్నీ అబద్ధాలేకదా!... ఆయన, అతన్ని ఆ పనిచేయమని అడగలేదు. ఆయనకీ అతనికీ దీనితో పేచీ. ఇవి క్షుద్రమైనవి. జరిగినదేదో జరిగింది. ఇక కావేషీ ఎందుకు?

యస్. హెచ్: ఇంతకీ తప్పుమీది. ఇవ్వకూడనిచనువుయిస్తే ఇలాగేవుంటుంది. అది మీ అలసత్వంగా, ఇతరులుభావిస్తారు.

మహారాజావారు : దానికేమి. వాళ్ళిద్దరూ మంచి వాళ్లే. కాని అపుడపుడు తప్పుచేస్తూ వుంటారు. వాటిని మనం చూసి ఆనందించవలె.

యస్. హెచ్ : ఆనందించడానికి ఇది తమాషావా ?

మహారాజావారు : కోపగించడ మెందుకు? జీవితమే ఒక తమాషా; కాదా?

యస్. హెచ్ : ఇలాగ మీరంటూవుంటే, వాళ్ళకది అమృతంలాగ వుంటుంది. కనకనే, అలా తయారయారు. మీకేదో నచ్చచెబతారు; వాళ్ళు మీతో చెప్పినట్టే చేస్తారని మీరనుకుంటారు. కాని వాళ్లుచెప్పే దొకటీ; చేసేదింకొకటీ.

మహారాజావారు : పోనిద్దురూ. ఇంతలో పుట్టుకేం మునిగిపోయిందీ!

• • •

గిరీశం : ఆడవాళ్లా! అబ్సర్డు. ఆమాటే అబ్సర్డు. ఆడవాళ్ళ అనుపానులు నాకు తెలుసును!

• • •

ఇతరులను చూడనీయకుండా, నాయికను కట్టుఖాయిదాల్లో వుంచారు. గిరీశం ఎలాగయినా, ఆమెను చూడాలనుకున్నాడు.

• • •

గిరీశం : నీకు తెలివితేటల్లేవు. రా, నాతో, రా. ఎంత అమాయకురాలివి. నీ అంతటి వెర్రిబాగులదాన్ని నే నెక్కడా చూళ్లేదు. వేదాంతమట. వేదాంతం. వెర్రిపిల్లా. వేదాంతం వెర్రివాళ్ళది. నీకూ నాకూ అడ్డువచ్చే వేదాంతాన్ని అవతల పెడదాం.

# రెండవ కథ*

నాయిక : నేనేపాపం ఎరగను. జీవితంలో నేనేం తప్పు చేశాను!

రెవ : నువ్వు చేయకపోతే, సరిపోయిందా? మీనాన్న చేసిన పాపం...

నాయిక : నా ఎదటనే ఆ మాటనడానికి, మీకు నోరె లాగ వచ్చింది! ఎంతసాహసం! మానాన్నను నాముందు తూల నాడకండి. తల దాచుకుందుకు నాకు కాస్త చోటిచ్చారనా, మీకా లోకువ? అక్కర్లేదు. మీ ఆశ్రయం నాకక్కర్లేదు. వెళ్ళి పోతాను. ఎక్కడికైనాపోయి తల దాచుకుంటాను.

రెవ॥ కూతురు : అవతలకి వెళితే ఆనక నువ్వేమౌతావ్. ఇక్కడ వుంటే నువ్వు ఎక్కడవుందీ ఎవరికీ తెలియదు.

నాయిక : అందుకా, ఆ ఎత్తిపొడుపు మాటలు?

రెవ॥ కూతురు : ఎవరేమన్నారమ్మా, నిన్ను! అనవస రంగా, మనసు కష్టపెట్టుకోకు. మానాన్న అన్నమాటొకటి. నువ్వనుకుంటోన్న దింకొకటి. మీనాన్నని దెప్పి పొడవాలని ఆయన ఉద్దేశం కాదు.

---

* ఇది, గురజాడవుంచిన శీర్షిక. దానిని దొరికినంతమటుకు, సందర్భానుసారంగా సంతరించినాను.

రెవ : ఆ ఉద్దేశం నాకెప్పుడూ లేదు. నాకు నా కూతురెంతో, నువ్వూ అంతే. అంతకన్న ఎక్కువకూడాను. మీనాన్నని నేను తూలనాడలేదు. అసలు పుట్టుకలోనే కొంత పాపంవుంది. మీ మొదటి నాన్న...

• • •

## రెవ : కథానాయకుడు

నాయకుడు : నాకోరిక మన్నించండి. కాదనకండి.

రెవ : కళ్ళముందు ప్రసరిస్తున్న కాంతిని చూడలేక, కళ్ళు మూసుకుంటున్నావ్. వెలుతురున్న దిక్కుకు వెళ్ళనొల్లక, చీకట్లో పుణికిసలాడడం దేనికి?

నాయ : లేదు, లేదు; నా దారిలోకూడా, కాంతి కనిపిస్తోంది. అది అచ్చంగా, మీరు చెప్పిన దారి కాకపోవచ్చును. కాని అదీ అలాంటిదే! సందేహంలేదు. నేనామార్గం పడితినా, పునీతుణ్ణవుతాను. ఇంకొకమార్గం లేదు. నమ్మండి, నామాట నమ్మండి. ఆమెలేని జన్మ వృథా; కనకనేకదా, ఆ పిల్లను మీ దగ్గర వుంచాను. జీవితంలో అనేక కలలు కన్నాను. ఆ కల లన్నీ చెదిరిపోయాయి. ఇక మిగిలిందల్లా ఒకే ఒక కల. నాకల నిజంకావాలి. నా జీవితాశయం నెరవేరాలి. జీవితంలో ఒక్కటీ, ఒక్కటైనా, సఫలం కావద్దా? అన్ని ఆశలూ నిరాశలయాయి. ఈ ఒక్కకోరిక...జీవితంలో ఒక గొప్పకార్యం సాధించేనన్న సంతృప్తి...అంతేచాలు. నేనుచేసే లోకసేవకు, నేనేప్రతిఫలం కోరను. నాఆత్మ సంతృప్తిపడితేచాలు...గిరీశం! గిరీశం! వాడా? వాడొట్టి దగల్బాజీ! శుద్ధ స్కౌండ్రల్!

రేవ : కాదు, నాయనా, కాదు. నిదానించి మాట్లాడు. ఇతరుల ప్రసక్తి వచ్చినపుడు నింపాదిగా మాట్లాడు. అతని హృదయం మంచిది. నాకతన్ని బాగా తెలుసును. తత్వతః అతను క్రిస్టియను. క్రిస్టియనులు, పాపం చేయరు; చేద్దామన్నా చేయలేరు. గిరీశం, సంఘసంస్కర్త...అతనంటు, నీకు పడదా ?

నాయ : చాలు చాలు. మీతో వాదించడానికి నాకు టైములేదు. అన్నీ తెలుసుకున్న తరవాత, మంచిచెడ్డలు విచారిద్దురుగాన్లెండి ! ఈలోపున ఆతాళం ఇలా యివ్వండి. నేనా పిల్లతో అర్జెంటుగా మాట్లాడాలి.

రేవ : మంచిదికాదు; రహస్యం ఎప్పుడూ మంచిదికాదు.

* * *

## కోర్టు :

**(ప్రవేశం : నాయిక; అంతా ఆమెవంక ఆశ్చర్యంతో చూస్తూవుంటారు.)**

కలెక్టరు : ఎవరాపిల్ల ? ఏమిటి చేస్తోంది ?

నాయిక : నాకు సెక్యూరిటీ అక్కర్లేదు. జైల్లోనే వుంటాను.

నాయకుడు : [ఆత్మగతం] జైలులో వుంటుందా? అంటే? ఏమిటి ఆపిల్ల ఉద్దేశం? నాకు దూరంగా వుండాలనా?

కలెక్టరు : నీకు మతిపోలేదు కద?

నాయిక : పోతే, బాగుండును !

కలెక్టరు : నీ వకీలు ఎవరు ?

నాయిక : ఎవరూ అక్కర్లేదు.

వకీలు : నేనండీ, నేను; నేనే ఆవిడ వకీల్ని.

నాయిక : ఒకరి వకాల్తా నాకువొద్దు.

కలెక్టరు : బాగా ఆలోచించుకో. వకీలు అక్కర్లేదూ? నీకు బెయిలు యిస్తానన్న మనిషి, అక్కర్లేదంటున్నాడా!

నాయిక : అతడనకపోవచ్చును. కాని నేనంటున్నాను. ఇంతకన్న నాకు జైలు బాగుంటుంది. నన్ను జైల్లో పెట్టండి. అక్కడైనా యీ జన్మకు శాంతి వుంటుందేమో!

కలెక్టరు : అంతా వింతగావుంది. చిత్రమైన పిల్ల... మీరు కాస్త హితవు చెప్పండి!

వకీలు : నామాట వింటే సంతోషమే...కానీ...నాకంటె... (నాయకునివైపు చూసి) ఆయన చెబితే మంచిది.

నాయకుడు : (పెదవులు కొరికి, నిలుచును.)

కలెక్టరు : నిజమే, మీరన్నమాట... నిస్సహాయస్థితిలో వున్న స్త్రీకి సహాయపడడం మంచిది. అందుకతను సంకోచించడనుకుంటాను. ఆపదకు అడ్డుపడతాడని, నానమ్మకం. అతని 'యాంటీనాచ్' సిద్ధాంతాలు, మానవసేవానిరతికి అడ్డు రావు.

ఆ : ఇంతకీ ఆవిడ అభిమతమేమిటో?

వకీలు : ఏముంది? జైలుకివెళ్లడం. మీరు కలిగించిన వసతికన్న, జైలునయమని ఆవిడంటోంది.

ఆ : కావచ్చును. మనం ఆవిణ్ణి కష్టపెట్టాం కాబోలు. లేకపోతే ఆమాట అనదు.

వకీలు : ఆవిడకేదైనా సహాయపడగలడేమో, ముందతన్ని అడగండి!

ఆ : [నాయకునితో] ఏమండీ! ఆవిడకి మీరు బెయిలు యిస్తారూ? మీకెంతో అభిమానంకదా; సెక్యూరిటీ యిస్తే బాగుంటుంది.

నాయకుడు : చదవ్వేస్తే, వున్నమతిపోయిందట!

కలెక్టరు : ఆవిడకెవరూ జామీనుండకపోతే, నేనేం చేయను? సరే, అయితే. ఆ పిల్లను రిమాండులో వుంచండి.

ఆ : మరొకమార్గం లేదా?

కలెక్టరు : ఏమిటి చేయడం? ఒదిలిపెడితే ప్రమాదం. 'యాంటీనాచ్' పార్టీకి తీరనినష్టం.

• • • •

## జైలు :

ముసలిది : ఏమిటమ్మా, యీ మొండితనం! ఎంత చెప్పినా వినవ్. నామాట విను. నిన్ను తలుచుకుంటున్నకొద్దీ నాగుండె, నీరైపోతోంది. ముసలిదాన్ని ఇలా దుఃఖపెట్టడం తగునా? నువ్వు లేనిదీ, నే నెలా బతకగలనో చెప్పు!

నాయిక : ఎందుకు బతకలేవు? ఇన్నాళ్లూ, నేనున్నాననే బతికావా? నేనుంటేమాత్రం, నీకేంసుఖం? కష్టంతప్ప! భయ పడకు. నేను లేకపోయినా, నీబతుక్కేం; బంగారం!

ముసలిది : ఇంటికి రావుకదూ?

నాయిక : నీఇల్లుకన్న జైలు నయం. ఇక్కడే హాయీ, ఆనందమూను. ఇలా అంటున్నానని మరొకలాగ అనుకోకు. నువ్వంటే నాకు గౌరవం ప్రేమ, కాని నీ పద్ధతులువేరు. నాకవి నచ్చవు. నచ్చనపుడు వేరే వుండడం మంచిది. కలిసివుంటే ప్రయోజనమేమిటి!

ముసలిది : అయితే, ఈ దరిద్రంతో బతకడ మెలాగ?

నాయిక : దరిద్రమా? దిక్కుమాలినదరిద్రం. వొళ్లువంచి కష్టపడితే, దానంతటదే పోతుంది దరిద్రం. నా రెక్కల్లో సత్తువున్నంతకాలం, తిండికీ బట్టకీ లోటువుండదు.

ముసలిది : మరినామాట ?

నాయిక : బెంగపెట్టకోకు. నే నుండగా నీకేంభయం! మునపట్లాగే నిన్ను నేను పోషిస్తాను.

ముసలిది : కాని...

నాయిక : అంతేటితో నువ్వు సంతృప్తి పడవు. నాకు తెలుసును. నా మార్గం వేరు. అది నీకు సరిపడదు. ఇదివరకు నీకది తృప్తి కలిగించింది కనకనా?

ముసలిది : నేను చెబుతున్న...

నాయిక : నువ్వు చెప్పనక్కర్లేదు. నాకు తెలుసును. నన్ను నరకకూపంలోకి నెట్టి, నా మానమర్యాదలను మంటగల పాలనుకుంటున్నావ్. వొద్దు. వొద్దు. నేను మనిషిని. జంతువుని కాను. మనిషిజన్మ ఎత్తి జంతువులా సంచరించలేను. వెళ్లు, వెళ్లు.

ముసలిది : ఎందుకంత కోపం? ఆడదానివికమా?

నాయిక : అందుకే నాకీచెర!... అవును. ఆడదాన్ని, మానాభిమానాలున్న ఆడదాన్ని. ఆడపిల్లలకు మానాభిమానాలే నగలు.

ముసలిది : వెర్రిపిల్లా! నిన్ను తలుచుకుంటే గుండె నీరవుతోంది.

నాయిక : గుండె నీరుచేసుకోకు. నాకోసం నాకు లేని బెంగ నీకెందుకు? ఈ రెక్కల్లో శక్తి వున్నంతకాలం నా

బతుక్కేం భయంలేదు. నిన్నూ పోషిస్తాను. అయినా నీకేం తక్కువ? కావల్సినంతవుంది!

ముసలిది : నామాట చెవిని పెట్టవుకద! ఎందుకు చెబుతున్నానో, కాస్త ఆలోచించు.

నాయిక : ఆలోచించే, చెబుతున్నాను. నువ్వేం చెబుతున్నావో, ఎందుకు చెబుతున్నావో నాకు తెలుసును. నన్ను అధ్వానపుటడవిలో దిగవిడవాలనుకుంటున్నావ్. సిగ్గూ ఎగ్గూ లేకుండా, సంచరించమంటున్నావ్. నా బొందెలో ప్రాణం వుండగా, నేనా పాపానికి వొడి గట్టుకోలేను. అలాంటి దుస్థితే గనక దాపరిస్తే ఏనుయ్యో గొయ్యో చూసుకుంటాను. నన్నీ రొంపిలోకి దింపి, నువ్వు బావుకొనేదేమీలేదు. నా బతుకు నన్ను బతకనీయి.

ముసలిది : నమ్ము నా మాట నమ్ము. ఇక నీ మాటకు అడ్డురాను. నిన్ను బలవంత చేయను. నువ్వు వేసినంత వొట్టు. రా. ఇంటికి రా. ఎప్పట్లా నా ఇంట్లో కలకల్లాడుతూ లక్ష్మిలాగ మసులు.

నాయిక : హుఁ! లక్ష్మిలాగ మసలడం! నీ ఇంటికివస్తే ఏమౌతుంది? నేనూ నీ స్నేహితులూ; అంతేకదూ?

ముసలిది : కాదులే. మునపట్లాగ, నిన్ను బలవంతం పెట్టను; పెడితే అడుగు. నా మాట నమ్ము. నీమీదవొట్టు!

నాయిక : ఏ వొట్టూ అక్కర్లేదు.

ముసలిది : పెద్దదాన్నే చిన్నదాన్నే చెబుతున్నాను; విను. ఇంటికిరా.

నాయిక : రాను. నీ ఇల్లు వొక మురికికూపం. ఎటు చూసినా నరకం. తలచుకుంటే భయంవేస్తోంది. అబ్బ! నువ్వూ, ఆ సరసులూ, ఆ గదీ, రామ రామ!

ముసలిది : నువ్వు లేకపోతే, ఆ ఇంట్లో నేనుండలేను.

నాయిక : నేను రానపుడు ఎలా వుండేదానివో అలాగే ఇప్పుడూ హాయిగా వుండు. నీ ఇంట్లో, రాత్రి నాతోనే తెల్లవారడంలేదు. నే నావిడయింట తలదాచుకుంటాను. అక్కడ నాకు ఏ హానీ జరగదు. ఆవిడ మంచిది!

• • •

అతను : తప్పుచేశామని ఒప్పుకుంటున్నపుడు, క్షమించ వద్దూ?

నాయిక : [మౌనంగా బొటబొట కన్నీరు కారుస్తుంది.]

అతను : నీకు నేను పరాయివాణ్ణి కాను. నెత్తురు సంబంధం నెత్తురుసంబంధమే. ఎంతకాదన్నా పోదు. మీనాన్న చనిపోతూ చనిపోతూ మానాన్నతో "తమ్ముడూ..." ఆ మాటలు తలుచుకుంటే దుఃఖం వస్తోంది.ఆయన్ని తలుచుకునైనా మనిద్దరం దగ్గరవాళ్ళమని జ్ఞాపకం తెచ్చుకో. ఎందుకు సంశయిస్తావ్? భయపడకు. లేనిపోని అనుమానాలుకూడదు. నీకు హాని చేయాలనుకుంటున్నానా? చెప్పుపోనీ. ఈ ఆపదలోంచి తప్పించుకునే మార్గం చూడు. అందుకే నేనొచ్చాను. నువ్వు హాయిగా ఆనందంగా వుండాలి. అంతే నేను కోరేది; విను. నా మాట వినవూ?

నాయిక : [మాట్లాడదు. వెక్కి వెక్కి ఏడుస్తుంది.]

• • •

[రెవ॥ కూతురు ఇల్లు. నాయిక వార్తాపత్రికను చూస్తూ వుంటుంది. నాయకుడు పెక్కు యిబ్బందులలో చిక్కుకున్నాడు.]

నాయిక : నేను సానిపిల్లను, మాఅమ్మ...మా నాన్న కంటె రాక్షసుడు నయం. తల్లీ తండ్రీ లేరు. దిక్కూమొక్కూ లేదు. 'నా' అనే వాళ్లెవరూ లేరు. అందుకే కదా, నేనంటే మీ కంత లోకువ! దిక్కులేని ఆడదానిజీవితంతో చెలగాటమాడడం మీకు సరదా!

నాయకుడు : కాదు కాదు...నువ్వు సానిదానివే కావచ్చును. అయితేమాత్రం?... నీజాతితో నాకవసరం లేదు. నేను నిన్ను మనసారా ప్రేమిస్తున్నాను.

నాయిక : నన్ను ప్రేమిస్తున్నారా?

నాయకుడు : అవును. మనిషి యోగ్యతను ఎంచడం కష్టం. మనం అపోహలతో కాలం వెళ్ళబుచ్చుతున్నాం. దురభిప్రాయాలు పెట్టుకుని మనుష్యుల మంచి చెడ్డల్ని ఎంచడానికి అలవాటు పడ్డాం. డబ్బువుంటే చాలు; గుణం వొదిలి డబ్బును గౌరవిస్తున్నాం. ఇది మంచీ ఇది చెడ్డా అన్న ఆలోచనలేక పది మందీపోతున్న దారినే, అది ఎంత చెడ్డదైనా, మనమూ అనుసరిస్తున్నాం. ఒకరిగుణం ఎంచేటపుడు సానుభూతి వుండాలి. బాగా ఆలోచించాలి. మీ నాన్న యోగ్యుడు. మీ అమ్మ నీలాగే గుణవతి. సౌందర్యవతి. ఆమెను ఆయన ప్రేమించాడు. ఆవిణ్ణి తాను వివాహమాడడానికి, కొన్ని సాంఘిక ధర్మాలు,

సూత్రాలు అడ్డువచ్చాయి. కనక నీకీ కష్టాలు వచ్చాయి. కాని మీ అమ్మ జీవితం ఆనందంగా గడిచిపోయింది. ఆమెను అందరూ గౌరవించేవారు. గ్రామస్తులు నెత్తినపెట్టుకుని పూజించేవారు. రేపు నిన్నూ అంతే...మీ అమ్మ పవిత్రురాలు కాదనుకుందాం. కాకపోతే, నాకేం? మా నాన్న మీ నాన్నకు అపకారం చేసి వుండవచ్చును. అందుకు నేనా బాధ్యుణ్ణి? నన్నందుకు నిరసిస్తావా? న్యాయమేనా? దయకు ప్రతిఫలం నిర్దయకాదు. పోనీ; నన్ను నువ్వు ప్రేమించకపోతే పోనీ: ద్వేషించకు. అంతే చాలు...నాకొక్క ఉపకారం చేసిపెట్టు. మీ గురువుగారు ఎక్కడ వున్నారు?

నాయిక : ఆయనెందుకు?

నాయకుడు : ఆయనొక్కడే నీకీ ఆపద తప్పించగల మనిషి.

నాయిక : నా దురవస్థ ఆయనకి చెప్పకండి. బాధపడతారు. బాధపడ్డం తప్ప ఆయన చేయగలిగేదేమీలేదు.

నాయకుడు : నీకు తెలియదు. ఆయనెక్కడున్నారో చెప్పు.

నాయిక : నన్నిలాగ బతకనీయరా ఏమిటి? నన్ను వేపుకు తినకండి.

నాయకుడు : ఎందుకలా అంటావ్! నామీద నీకు నమ్మకం లేదా?

• • •

నాయకుడు : నీగదిలో రెండుపెట్టెలున్నాయి. తాళాలిస్తావా?

నాయిక : తాళాలెందుకు? కావాలంటే పెట్టెలు పగల కొట్ట వచ్చును.

నాయకుడు : మీ చెల్లెల్ని అంత క్రూరంగా...

నాయిక : ఆవిడ నాచెల్లెలు కాదు. ఆవిడకి నేను అక్క నని అనుకుంటున్నందుకు సంతోషం...తాళాలు ఎవరు కావాలన్నారు?... ఆ పెట్టెలు నేను తెరిచి చూడలేదు...అందులో ఒక పెట్టె, మానాన్నది...తాళాలు మీచేతికిచ్చి ఎలాగనమ్మను?

నాయకుడు : నమ్మకపోతే పోనీ, పెట్టెలు మీచెల్లెలికి పంపించేయి. పేక్ చేయిస్తాను. నీఎదట నేనుంటే నువ్వు సహించలేవు. నాఎదట నువ్వు లేకపోతే నేను భరించలేను. కాని నిన్ను బాధపెట్టడం కన్న, నేనే బాధపడ్డం మంచిది.

[ నిష్క్రమణ ]

నాయిక : [ఆత్మగతం] సొగసైన మనిషి!...వెనక్కి పిలుద్దునా? అతన్ని నిరాకరించడం అసాధ్యం...ఆ గిరీశం తలపుకు వస్తే... అరుంధతినైనా, చెరపట్టే మహాయోగ్యుడు... ఎందుకా మాయవేషం! [పత్రిక చదువుతూ వుంటుంది.]



# కొన్ని పాత్రలు *

| | | |
|---|---|---|
| రామరాజు | : | రాయడు |
| సదాశివరాయలు • | : | రాజు |
| వేంకటాద్రి | : | రామరాయలు తమ్ముడు |
| తిరుమలరాజు | : | ,, |
| పెదతిమ్మడు | : | రామరాయలు కుమారుడు: బహుకార్యారుడు |
| రామదేవు మాధవవర్మ | : | బెజవాడ పూసపాటి వంశీకులముఖ్యుడు |
| కాకతి కృష్ణంరాజు | : | సహచరుడు |
| కోట నరసింహరాజు | : | ,, |
| ఆలి అదిల్షా | : | బీజపూరు సుల్తాను |
| హడిపంత్ | : | మహారాష్ట్ర దళాధిపతి |

ఒక విశాలమైన భవనములో మాధవవర్మ, కృష్ణంరాజు వేరువేరు భాగాలలో నివసిస్తూ వున్నారు. కృష్ణమరాజు అరవై యేళ్ళవాడు. బుగ్గమీసాలు. చిన్న గడ్డము. బంగారపు కళ్ళ జోడు పెట్టుకొనినాడు. ఎదట భూర్జర పత్రముల గ్రంథము.

---

సౌ దా మి ని

* తాళికోట యుద్ధఘట్టములను ఇతివృత్తముగా, నవలనో, నాటకమునో వ్రాయవలెనని మహాకవి సంకల్పించుకున్నట్లు కనిపిస్తుంది. అందుకవసరమైన కొన్ని చారిత్రక విషయములను, సంగ్రహముగ వ్రాసుకొన్నారు. వాటిలో దొరికినవరకు, యిందు సంకలితము.

గదిలో కొందరు స్మార్తులు, కూచున్నారు. క్షత్రియసేవకులు నిలబడినారు. చేరువను నిలబడి ఒక సేవకుడు విసురుతూవుండగా, కృష్ణమరాజు సాల గ్రాసుములు కడుగుకొంటూ వుండును.

కృష్ణంరాజు : యేమండి మా చిన్నబాబుకుసీతరాము వెర్రి యెత్తిపోయినది. యీ సంస్తానం వదిలి మరి వచ్చేరీతి కన బడలేదు. బెజవాడ కృష్ణవేణిని వదలి యెన్నిరోజులు అయినది. యేదో వక మిషపెట్టి రాజుగారు కాలక్షేపం చేస్తున్నాడు. ఓడలు బండిమీద బండ్లు ఓడలమీద వెళ్లును. యిదే దృష్టాంతరము; చిన్నబాబు వంశమేమిటి, వాళ్ళ ప్రతిష్ట ఏమిటి; చతుస్సముద్రిత భూచక్రానికి కిరీటమాంధాతలు 'కుంజరయూథంబు దోమకుత్తుక చొచ్చెను, అన్నట్టు ఈ సంస్థానం రావడం, సహాయంకోరడం; బంధుత్వం మర్యాదా ఆలోచించక వాళ్లు గడువులు పెట్టడం. మానౌఖర్లు చేసుకున్న రాజ్యం యిది. ఆ విశ్వాసాలు యిప్పుడు వుంటాయా. డబ్బు సహాయంగాని మనిషి సహాయంగాని వక్కనాటికి అడగలేదు. అక్కడ అందమయిన పిల్ల వున్నా మన వెర్రిబాబును వలవడం యీతను ముందూ వెనకా ఆలో చించక మావంటివాళ్లం వుంటూవుండగా ప్రమాదమయిన పనులకు తాను ముందుకు దుమకడం. *

యేమిటండి యింత మయిమరుపు. కనకదుర్గమ్మ వుండగా మనకు మరి వకరి సహాయం యెందుకు. అక్కడ నిలబడితే యిస్తుంది దుర్గ ఫౌజు: యిక్కడ కది అయిదు పాదా లను నడుస్తున్నది. యిక్కడ వుండకూడదు. యీ వైష్ణవం బెడిసికొట్టక మానదు. విరూపాక్షుణ్ణి వదిలి ఆసీలుమానిన తర

* కృష్ణంరాజు పలికిన ఈ పలుకులనే, మహాకవి మరొకచోట ఇంకొకలాగ వ్రాసినారు. అవి రెండవపేరాలో అచ్చొత్తిన వాక్యములు.

వాత మరి రాజ్యం నిలవదు. యీ ప్రళయంలో మనమెందుకు మునగవలె. ఆడవాళ్ళకు యీ సాహసం యీ నిర్లజ్జ. అంతా వైపరీత్యం. +

[ సౌదామిని, మెల్లగా అక్కడకు వచ్చి, వకపక్క నిలబడుతుంది. ఆమెను చూడగానే, బ్రాహ్మణులు లేచి నిలబడతారు. దారికి అడ్డము వుంటివని, కృష్ణంరాజు, సౌదామినికి సూచిస్తాడు. ప్రసంగవశమున, మాధవవర్మ నిర్దయుడని చెబుతాడు. సౌదామిని • మాటలాడక పక్కకు తొలగుతుంది. మాధవవర్మ తన పూజను ముగించుకుని కృష్ణరాజునకు ప్రణమిల్లడానికి అక్కడకువచ్చినంతనే సౌదామిని కనిపిస్తుంది. దూరము నుండి ఇద్దరూ వకరి నొకరు చూసుకుంటారు. మాధవవర్మ, కృష్ణంరాజుతో కొంతసేపు ప్రసంగించిన పిదప అతనిని తన వెంట రమ్మనమని సౌదామిని సైగ చేస్తుంది; దగ్గరకు రాగానే "ఆలస్యం చేయవద్దు. వేగం బయలుదేరు" అంటుంది. మాధవవర్మ, ఆమె వెంట వెళ్ళిపోతాడు. ]

కృష్ణరాజు : అదేతీరు. ఆ పిల్ల కనబడితే, చినబాబుకి కాలు నిలవదు!

• • •

## దర్బారు దృశ్యము

రామరాజు : తెలుసుకోతగిన వార్తలు ఏమయినా అందినవా?

---

+ ఈ గుర్తుగల వాక్యములు మహాకవి తెలుగున వ్రాసినవి; మిగిలినవి ఆంగ్లమున వ్రాసినవి.

దివాన్జీ : నిజాంశాహి కూతురు చాందు బీబీ. బహు అందగత్తె విరూపాక్షుని కిరీటమున వజ్రమును తెచ్చి యిచ్చిన వానిని తాను వరింతునని చాందుబీబీ ప్రకటించినట్లు వినికిడి!

రామరాజు : ఆ వజ్రమును ఒక హిందువు తెచ్చియిచ్చి నట్లయితే?

దివాన్జీ : ఆ దుర్మార్గుడినే వివాహ మాడుతుంది!

♦ ♦ ♦

సదాశివరాయలు అసమర్థుడా. తన పనిని తాను చక్క బెట్టుకోజాలని అమాయకుడు. పేరునకు 'రాజు' అద్భుతమగు సన్నివేశములలో ఇతనిని చూపవలెను.

♦ ♦ ♦

వజ్రమును దొంగిలించి తెచ్చుటకు వక వీరవైష్ణవుడు నియుక్తుడాయెను.

* * *

రామరాజు కుమారుడు శాక్త్యేయుడు, గుడారములో రహస్యస్థలమున శక్తిపూజ, కుంకమ, ఆయుధములు.

♦ ♦ ♦

రామరాజు కుమారుడు ఏ ముస్లిం వనితకోసం, గాలిస్తూ వుండెనో, ఆ పిల్ల ఆలి అదిల్షాకు అంతరంగికురాలు.

♦ ♦ ♦

ఆలి అదిల్షా ధైర్యవంతుడు, వితరణ గలవాడు. సౌదామినిని సోదరివలె, మాధవవర్మను సోదరునివలె ప్రేమించును. రాజకీయ తంత్రజ్ఞుడు. సమయస్ఫూర్తిగల వ్యక్తి. తూచినట్టు ఆలోచించగల నేర్పరి. భార్య చాందుబీబీ ఇతనిని ప్రోత్స

హిస్తూ, బలపరుస్తూ వుంటుంది. విజయనగరము రాజులతో గల స్నేహము సంబంధాలు ఇతని మార్గమునకు అడ్డువస్తూవుంటవి. అదిల్షా చెంత రెండు వజ్రములు వుండేవని, అందులో వకటి కోడి గ్రుడ్డంత పెద్దదని, చరిత్రకారులు వ్రాసినారు. సుల్తానులు కట్టుకట్టి సమర సన్నాహాలు కావిస్తున్నారు. వాటి అంతర్యమేమిటో చెప్పమని, శాంతిని కాపాడే పూచీ వహించమని ఆలిఅదిల్షాను అడగడానికి, రామరాజు నిశ్చయించుకున్నాడు. అతని చెంతకు తన మంత్రి సలహా ప్రకారం మాధవవర్మను పంపించాడు. బెజవాడను సంపాదించాలని మాధవవర్మ మంత్రాంగం చేస్తున్నాడని, అందువల్ల అతన్ని అదిల్షా చెంతకు పంపవద్దని, రామరాజునకు అతని రెండవమంత్రి సలహా యిచ్చాడు. మాధవవర్మ, తాను బయలుదేరి వెళ్లేముందు, రామరాజును సందర్శించి, బెజవాడ తన ఏలుబడికింద వుంటే బాగుండుననే కోరికను వ్యక్తపరుస్తాడు. కలిగిన సందేహము రామరాజునకు ఎక్కువవుతుంది.

♦ ♦ ♦

ఆలి అదిల్షా సమాధానమీయక, మాధవవర్మను తన చెంత అట్టే పెట్టుకున్నాడు. అతన్ని తన చిరకాలస్నేహితుని గానే భావిస్తున్నాడు. ఇదివరకు అహమ్మద్ నగరసుల్తానుతో యుద్ధము చేసేటపుడు తనకు సాయపడమని ఆలి అదిల్షా, రామరాజునకు ఉత్తరం వ్రాశాడు.

మాధవవర్మ, తాను అదిల్షా కొలువులో చేరడానికి నిర్ణయించుకుంటినని, వెంటనే విజయనగరము వదలి తనలో కలియవలసినదని అనుచరునకు ఉత్తరము వ్రాయగా, అది పట్టుబడి పోతుంది.

సౌదామిని గది, గదిగోడలకు చిత్తరువులు. బీజపూరుకు రాయబారమున కయి వెళ్ళగా, మాధవవర్మను, ఆలి అదిల్లా ఖైదుచేశాడని సౌదామినికి తెలుస్తుంది. సరియైన వర్తమానము మొదట ఆమెకు తెలియదు.

ఎదట గోడపై సౌదామిని చిత్తరువు వున్నది. అది, మాధవవర్మ చిత్రించి, ఆమెకు బహూకరించిన, చిత్రము. సౌదామిని విచారముగా, చిత్తరువు వైపు చూస్తూవుండగా, తిరుమలుని ఆఖరి కొడుకు అక్కడకు వస్తాడు. అతని వయస్సు పదహారేళ్లు. సౌదామినివద్ద చేరిక ఎక్కువ.

• • •

సౌదామిని : అతనియందు తప్పు పట్టుట యెంతబుద్ధి తక్కువ మనిషిని. నిప్పుకు చెదపట్టునా. అంత ఆలోచన లేక అతనిని యెందుకు కోపగించితిని. యుద్ధము కాబోవును; యెవరేమవునో, అతని మనమెంత తల్లడిల్లుచుండునో, స్వయంకృతాపరాధముల కనుభవించుటయే గతి. నేను తప్పుచేసితిని. నిజమే అతనంత తొందరపడి కోపగించుకుని వెళ్లిపోవలెను, నాయందంత ప్రేమకదా! ఆలీవద్ద వున్నాడని కొంత ధైర్యముగా వున్నది. +

• • •

## నాలుగవ - ఐదవ దృశ్యం

సౌదామిని బయలుదేరి వెళ్ళునంతలో ద్వారపాలకి లోపలకి వచ్చినది.

ద్వారపాలకి : అమ్మా! యెవరో వచ్చినాడు. యీ ఉత్తరము యిచ్చినాడు.

సౌదామిని : ఉత్తరము (చదువుకుంటుంది) అవును. ఇంతకూ నన్ను నేనే నిందించుకోవాలె. మరి నా పౌంకం యెలా అణగుతుంది. సరే, యీ రాయబారం తెచ్చినది యెవరే! తనంతట తానే వచ్చినాడా? వుత్తరము తెచ్చిన అతనిని పిలు.

(ప్రవేశం : ఆలి అదిల్షా)

సౌదామిని : ఆలీ! నువ్వేనా! ఎందుకింత సాహసం?

ఆలి : నీకోసమే.

సౌదామిని : నా కోసమా. ఆలీ! ఇలాంటి సమయంలో శత్రువుల శిబిరానికి రావడం తెలివైన పనియేనా? నిన్ను చూశాననే సంతోషం లేకపోలేదుకాని, నువ్విక్కడకు వచ్చి నందుకు విచారంగా వున్నది. యెలావచ్చావో అలా వెళ్లిపో.

ఆలి : నా ప్రాణం పోతుందని నాకేమీ భయంలేదు. వచ్చినపని చక్కబెట్టుకోనిదే, వెళ్ళి యేం చేయను? వుత్తరం చదువుకున్నావుకదా, నచ్చినదా?

సౌదామిని : ఈ రాయబారానికి నువ్వే స్వయంగా రావలసి వచ్చిందా?

ఆలి : అవును; రాక తప్పలేదు. ఇదేకాక. నాకింకొక ముఖ్యమైన పనివున్నది.

సౌదామిని : నీ మాటలు నాకేమీ అర్థం కావడంలేదు.

ఆలి : అయితే మారువేషము వేసుకుని నా వెంటరా తెలుస్తుంది.

సౌదామిని : సిద్ధంగానే వున్నాను పద.

[ఒక శిబిరము దగ్గరకు వెళ్లుదురు]

ఆలి : ఆ శిబిరము ఎవరిదో నీకు తెలుసునూ?

సౌదామిని : తెలుసును.

ఆలి : అక్కడ యేమి జరుగుతున్నదో చూడనీ.

[చాలామంది స్త్రీ, పురుషులు మద్యము సేవించి, క్రింద దొర్లుతున్నారు]

సౌదామిని : బోధపడింది.

ఆలి : [వజ్రముతో అటు చూపుతూ) ఈ వజ్రము కావలెనా! తీసుకో.

సౌదామిని : రామదేవును అంత అభిమానించి నందుకు నీమీద నాకు గౌరవం.

ఆలి : మీద వేసుకున్న కార్యము నెరవేరుతున్నది. సంతోషం.

సౌదామిని : అతను యిక్కడకు వచ్చినాడా?

ఆలి : అతనిటు వస్తే ప్రమాదమనుకున్నాను.

సౌదామిని : నీవువస్తే లేనట్టు!

ఆలి : ఇక్కడ వుంటే నా స్వంత శిబిరంలోవున్నట్టే వుంది. శత్రువు శిబిరంలో అందరూ ఒకేలాగ లేరు. కాస్త బంగారం యిస్తామని ఆశచూపితే చాలు; శిబిర రక్షకులు సైతం జోహుకూం.

సౌదామిని : నిన్నిక్కడికి దారి చూపిందెవరో ?

ఆలి : చెప్పకూడదు.

సౌదామిని : అయితే సరే; నీ రహస్యాలు నాకెందుకు? కాని నాదొక కోరిక.

ఆలి : ఏమిటో!

సౌదామిని : నువ్వు జయించి నట్లయితే వక ఉపకారం మాత్రం చేసిపెట్టాలి!

ఆలి : తప్పక.

సౌదామిని : నీకే జయం చేకూరితే, స్త్రీలను శిశువులను హింసించవద్దు. వాళ్ళజోలికి పోవద్దు!

ఆలి : అదిల్షాబొందెలో ప్రాణం వుండగా, అలాగ ఎన్నటికీ జరగదు. నీవు వేరే అడగనక్కర లేదు.

సౌదామిని : సంతోషం.

ఆలి : నాకూ వకకోరిక వుంది.

సౌదామిని : కోరికా?

ఆలి : కాదు; ప్రార్థన!

సౌదామిని : ఏమిటది?

ఆలి : మాధవుడి వుత్తరం నేనే స్వయంగా తేవడానికి కారణం వుంది. నామాట నీవు వింటావని నా నమ్మకం. అందుకు పట్టుబడతాననే భయం వున్నా, తెగించి ఇలా వచ్చాను. నీకోసం చెబుతున్నాను విను, మీ సైన్యం నానా పాడుగా వుంది! మీకు జయం చేకూరితే అది అబ్బురమే! వీళ్లు చేసిన పాపాలవల్ల నీకు నిజంగా ద్వేషంపుడితే, వాళ్ల శిబిరం వదలిపెట్టు. రామదేవుని ప్రేమిస్తున్నట్లయితే, మాపక్షంలోకి రా!

మేం గెలిచినా, ఓడినా. నీవు సుఖంగానే వుంటావు. యుద్ధంలో గెలుపురానీ, ఓటమిరానీ, వాటితో నీకూ రామ దేవునికీ సంబంధంలేదు. అతనికి బెజవాడ యిస్తాను. నీ తండ్రి నిజమైన పరిపాలకునిగ చేస్తాను. మీరిద్దరూ సుఖంగా వుండ వచ్చును. రాజ్యము చేసుకోవచ్చును.

* * *

సౌదామిని : దేవుడు నిన్ను క్షమించుగాక! నీవు నన్ను మోసపుచ్చితివి. స్నేహితుని నమ్మించి ద్రోహము చేసితివి. నీవు యిచ్చిన వుంగరము నా వేలి నుంచనొల్లను నీ రక్షణ నా కక్కరలేదు. [అని వుంగరము పారవేశి వెనుక తిరుగును.]

ఆలి : వెళ్ళకు వెళ్ళకు. యింత నిందవేసి రవంతయినను నన్ను నమ్మకపోవడము న్యాయమా? యీ డేరాలో వుండు. నీకు యేమీ భయములేదు. యుద్దమయిన తరవాత నాయందు తప్పు కనబరచి యే శిక్ష విధిస్తే, ఆ శిక్షకు వప్పుకుంటాను.

సౌదామిని : మిత్రద్రోహివి: నీడేరాలో నేను వుండను! (వెళ్లుతూ వుండును)

ఆలి : హుస్సేన్! అహమ్మద్! అతను ఆవేశం యెత్తి నట్టు వెళ్లిపోతున్నాడు. మీరు వెంటబడి అతను యక్కడకు వెళ్లినా యెవరుగాని అతని సిగపువ్వయినా నంటకుండ కాచు కుని వుండండి. అతనికేమి హానివచ్చినా, మీ మాంసము గెద్ద లకు ఎగరవేసెదను!...యీ మహా సంగరమున యేమి సంభ వించునో నా మనసు తల్లడిల్లుతున్నది. యీ మనస్సు కలత చెందడంతో, యుద్ధోత్సాహమంతా పోతున్నది. మాధవవర్మ యేమయినాడు. కుతుబుషా క్రోధమునకు ఆహుతయినాడా,

అతనిని సౌదామినిని దేవుడు కాపాడు కాక. యీ దురదృష్టపు ఆరంభమును చూడగా యుద్ధమేమగునో అని మనసుకు అను మానం పొడముతున్నది. నా సేన నాకెదురు చూచుచుండును. ఈ ద్రాక్షారసం త్రాగి ఈ కలత మరచిపోతాను. (త్రాగి, ఆయుధాలను ధరించి, బయటకు వెళ్లును.)

♦ ♦ ♦

## కొన్ని విశేషాలు

* అళియ రామరాజుకు అయిదుగురు కుమారులు. కృష్ణప్ప, పెద తిమ్మ, కొండ, చిన తిమ్మ శ్రీరంగ. కొండరాజు కుమారుడు రామరాయడు. శ్రీరంగనికి పెద వెంకట, చిన వెంకట అని ఇద్దరు కుమారులు.

రామరాజు తమ్ముడు తిరుమలునికి నలుగురు కొడుకులు రఘునాథ, శ్రీరంగ, రామరాయ, వెంకటులు.

---

* ఈయన ఆరవీటి వంశీకుడు. తండ్రి. శ్రీరంగరాజు- భార్యలు తిరుమలాంబ, అప్పలాంబ, కొండమ్మ, లక్ష్మమ్మ. తిరుమలాంబ, శ్రీకృష్ణదేవరాయలు కుమార్తె. కృష్ణదేవరాయలు అనంతరం ఆయన సవతితమ్ముడు అచ్యుత దేవరాయలు రాజ్యానికి వచ్చాడు. ఆయన కుమారుని పేరు వేంకటాద్రి. అచ్యుతుని తరవాత, రాజ్యానికి వచ్చిన వేంకటాద్రి బాలుడు. అందువల్ల సలకము తిమ్మంకు అధికారాన్ని స్వీకరించి, రామరాయ తిరుమలులను తరిమి, కొంతకాలానికి వేంకటాద్రిని చంపి తానే రాజయినాడు. రామరాయ తిరుమలులు, తిమ్మనిపై యుద్ధము ప్రకటించి, సదాశివరాయలను పట్టాభిషిక్తుని చేశారు. సదాశివరాయలు అచ్యుత దేవరాయలు తమ్ముని కొడుకు. తండ్రి, రంగరాజు.

+ సలకము తిమ్మయ పలుబడి, చిత్రమైన మరణం ఫెరిష్టా; సదాశివుని పట్టాభిషేకం. రామరాజే నిజముగ పరిపాలన చేయడం. రామరాజు సేనానాయకులు, వెంకటేశ్వర రాయి; వెలపరాయి; అయిసిల్ ముక్కిను, రామరాజు భాయీ అని పిలిచేవాడు. ఇతను రామరాయని కొలువులో వుండేవాడు.

రామరాయలు, అదిల్షా కలసి అమహ్మద్ నగరసుల్తానును ఎదిరించడం, నిజాంషా, కల్యాణదుర్గాన్ని వదలుకొని, రామరాయ, అదిల్షాలు కనుమరుగైనంతనే, ఇబ్రహీంకుతుబ్షాతో చెలిమి చేసి, మరల కల్యాణదుర్గమును ముట్టడించడం. కిష్వర్ ఖాన్, తురబ్, బరిద్‌లను అదిల్షా పంపడం. కుతుబ్షా అదిల్షాపక్షం వహించినా, రహస్యముగా, నిజాంషాకు సహాయపడడం. కిష్వర్ ఖాన్, రామరాజు ఎత్తుగడలు అదిల్షాకు చెప్పి; హెచ్చరిక చేయడం. యట్ ఘర్, బాగల్ కోట ఇత్యాదులను అదిల్షా వదలుకోవడం.

రామరాయలుకు వ్యతిరేకంగా, కిష్వర్ ఖాన్, తురబ్‌లు పన్నుగడ. నిజాంషా కుమార్తెలు బీబీజుమాలి; చాంద్ బీబీ. బీబీజుమాలి భర్తకుతుబ్షా. కుతుబ్షా, తనమంత్రి ముస్తఫఖానును

---

+ ఈయన అచ్యుతుని తోబుట్టువు పెనిమిటి. అచ్యుతుని కాలమున కోశాధికారి రామరాజుతో యుద్ధమున పోరుతూ సలకము తిమ్మంకు చనిపోయినట్లు హండే అనంతపురం కథలలోవున్నది. కాని రామరాయలు జయించనున్నాడని తెలిసి, ఈయన తన గదిలో తలుపులు బిగించుకుని, స్తంభానికి కత్తి దాపి, దాని మొనను గుండెలకు గుచ్చుకొని ఆత్మహత్య చేసుకున్నట్లు ఫెరిష్టా పేర్కొన్నాడు. ఆత్మహత్య చేసుకునేముందు, నగరులోని వజ్రవైఢూర్యాదులను తిరగలిలో విసిరించి, ఏనుగులు గుర్రముల కళ్ళు పీకించి, తోకలను తెగకోయించినాడట!

అదిల్షా, నైజాంషాల చెంతకు పంపి సఖ్యము బాంధవ్యము నెర పడం. హుసన్ నిజాంషా కూతురు చాందుబీబీని ఆలీ అదిల్షాకు, ఆలీ అదిల్షా చెల్లెలు ఫాలాబీబి హుద్యాసుల్తానాను, నిజాంషా కుమారుడు మూర్తుర్జాకు యిచ్చి వివాహంచేయడం. రామ రాజుకు డభై సంవత్సరాల వయస్సు. రామరాజు కుమారుడు తిమ్మరాజును సింహాసనంపై కూర్చుండబెట్ట వలెనని అదిల్షా ఊహ.

కిష్వార్ ఖాన్, ఆలిఅదిల్షా సేనాధిపతి. మౌలానా ఇనా యతుల్షా నిజాంషా సైన్యాధికారి. ఇబ్రహీం కుతుబ్షాకు ముస్తఫ ఖాన్, సచివుడు సైన్యాధికారి. నిజాంషా దగ్గరవుండే రొమి ఖాన్ అనే సేనాధిపతి అతి చతురుడు.

# నవల : సన్నివేశాలు *

కవి, కనురెప్పపాటులో ఆమెతో పరిచయం చేసుకున్నాడు. అందుకు నాకెంతో ఆశ్చర్యంవేసింది. ఆశ్చర్యమే కాదు. అసూయకూడాను. పిల్లల్ని మచ్చిక చేసుకున్నాడు. యాపిల్ పళ్లిచ్చాడు. బొమ్మలు చూపించాడు. అవీ ఇవీ చూపిస్తూ కబుర్లు చెబుతున్నాడు. చూసినవన్నీ చెప్పమనడం పిల్లలకు సరదా. అన్నీ తెలుసుకోవాలని వాళ్ళకి కుతూహలం. కిటుకు కనిపెట్టి, కవి, పిల్లలతో నేస్తంకట్టాడు. వాళ్ళడిగే ప్రశ్నలకు వోపిగ్గా సమాధానాలు చెబుతున్నాడు. అతని లబ్జుల్ని నేను కనిపెడుతున్నాను. నిండైన నీలగిరి అడవి రైలుతో కొంతసేపు పరిగెత్తినట్టే పరిగెత్తి కొంతదూరంవచ్చి అల్లంతదూరంలో ఆగిపోయింది.

కవి, పిల్లలతో కలివిడిగా కబుర్లుచెప్పడం ఆవిడ కనిపెడుతూనే అటు మౌనంగా చూస్తూవుంది. చూపులుమాత్రం మాట్లాడుతున్నట్టే ఆసక్తిని వెల్లడిస్తున్నాయి. అలాగ ఆమె

---

* ఇదిమహాకవి ఆంగ్లమున వ్రాసిన నవలా ప్రణాళిక, స్వతః ఆయన అర్భకుడు, బహు వ్యాపకుడు. అరోగ్యము మంచిది కాదు. మాటి మాటికి అస్వస్థత. ఈ కారణములవల్ల ఆయన రచనా వ్యాసంగమునకు అంతరాయ మేర్పడ్డది. కాగా, తుదముట్ట రచించిన రచనలకంటె రచించని రచనలు ఎక్కువ. అందులో ఇది ఒక చిలకకొట్టు.

మూగనోము పట్టి కూర్చోవడం అతనికి యిష్టంలేదు కాబోలు; మెల్లిగా మాటల్లోకి దింపాడు. ఏవేవో సంగతులు అడిగాడు. ప్రశ్నలు వేశాడు. ఆయా విషయాలపట్ల ఆవిడ అభిప్రాయా లేమిటో చెబితే సంతోషం అన్నాడు. ఆవిడ అభిప్రాయాలకు తాను విలువ యిస్తున్నట్లు ఒక భంగిమ పెట్టాడు. ఆమె పలుకే బంగారంలాగ ఒకటి రెండు మాటలాడి మూతి బిగించుకుంది. ఆమెకు అభిరుచి కలిగించే విషయం ఏమిటో పోల్చుకోవాలని అతను ప్రయత్నించాడు. అనేక ముచ్చట్లు చెబుతున్నాడు. ఆవిడకీ సంభాషణ బాగులేదు. కొసకు ఎలాగైతేనేం, మాటలు దొర్లించగా దొర్లించగా, కవి, ఆమె కభిరుచి కలిగించే విషయ మేమిటో పోల్చుకున్నాడు.

కూనూరు వచ్చేవరకు సంభాషణ నిరాటంకంగా కొన సాగింది. మాటల్లోమాట కలిపి, అతను వెల్లడించే అభిప్రాయాలు సరికాదంటూ అడ్డు తగులుదామనుకున్నాను. అతనన్న ప్రతి మాటా ఖండించాలని బుద్ధిపుట్టింది. అనుకున్నట్లుగానే ఒకటి రెండుసార్లు అడ్డు తగిలాను.

మేం యిద్దరం ఒకళ్ల నొకళ్లం కాదనుకుంటున్నాం. ఆవిడ నాకేసి చూసింది. నన్ను అవునన్నట్టు తల ఊపింది. 'అంతమాత్రంచేత ఆవిడ నీ అభిప్రాయాలతో ఏకీభవిస్తోందని భ్రమించేవు కనక. తాను అనుకుంటున్నదే నువ్వూ అనుకుంటు న్నావని నిన్నావిడ అపార్థం చేసుకుంది. నువ్వు చెప్పేదంతా అపసక్యం.' అంటున్నట్లున్నాయి అతని చూపులు.

రైలు ఆగింది. ఆమెను బసకు తీసుకు వెళ్లడానికి కొందరు స్నేహితులు స్టేషనుకి వచ్చారు. మా దగ్గర సెలవు

తీసుకుని రైలుదిగి ఆవిడ స్నేహితులతో వెళ్లిపోతోంది. వాళ్ళ బంగళా చేరువనే వుంది.

కవికూడా ఆవిడతోపాటు రైలు దిగాడు. వెంట వెడుతున్నాడు. "మీరు మాతో రావడంలేదా?" అని ప్రశ్నించాను. చిన్నపిల్లల్ని ఏయేపద్ధతులమీద చదివించాలో తెలుసుకోవాలని తనకు కుతూహలమట. ఆవిడ నూత్న విద్యాపద్ధతులు తెలిసిన మనిషి. తెలియడమే కాదు; ఆ పద్ధతుల ప్రకారం చిన్న పిల్లలకు శిక్షణ యిస్తున్న ఉపాధ్యాయిని. అతని వాలకంచూసి ఎంతో బిడయపడ్డాను. విద్యా విషయాలపట్ల కవి ఆసక్తిని కనబరచడం యిదే మొదటిసారి. తన చదువు సంధ్యల మాట ఎలా వున్నా ఇతరుల విద్యా విషయాలపట్ల ఆయనకి శ్రద్ధ హెచ్చు. తను తప్ప, ఇతరులు ఎలా చదవాలో ఆయన మొదట్నుంచీ పరిశీలిస్తూనే వచ్చాడు. అందువల్ల ఆయనకి అట్టే విద్యాగంధం అంటలేదు.

ఆమె రూపంలో ఏదో ఆకర్షణ వుందని చెప్పక తప్పదు. వ్యక్తిత్వంవున్న స్త్రీ. ఆవిడ వెళ్లిపోతున్నపుడు మనసుకి కష్టం వేసింది. ఆమెకు దూరమౌతున్నకొద్దీ నాకు దిగులు హెచ్చింది.

స్నేహితులతో కబుర్లాడుతూ దిగువను నిలబడింది. పోర్టరుతో మాట్లాడుతున్నట్టు నటిస్తూ ఆవిడకు దగ్గిరగా నిలబడ్డాను; వాళ్ళమాటలు వొక చెవిని వింటున్నాను. వింటూ అప్పుడప్పుడు ఆమెవంక చూస్తూనే వున్నాను. కబుర్లు చెప్పుకుంటూ ఆవిడ స్నేహితులతో ముందుకు సాగింది. నేను వెనక్కి తిరిగి రైలుపెట్టె చెంతకు నెమ్మదిగా చేరుకున్నాను. 'ఇప్పుడే

వస్తానని' కవి తన సామాను నాకు అప్పగించాడు. అవి నా నౌకర్లకు నేను అప్పగించాను.

బండి బేరమాడమని, రిఫ్రెష్‌మెంటు రూముకు బయలు దేరాను. కాఫీతాగి ఇవతలకి వచ్చేసరికి ఎక్కడా బండిలేదు. వెళ్లేందుకు ఏ వాహనమూ కనిపించదు ఊటీ రోడ్డుకు పరు గెత్తాను. జట్కా కనిపించింది. బేరం వుందన్నాడు. ఎంత కన్నాను. నాలుగురూపాయలకన్నాడు. ఆర్రూపాయలిస్తాను, రా అన్నాను. వెంటనే ఇచ్చేశాను. జట్కా ఎక్కాను. ఎంత అదృష్టం! చివరికి ఎలాగైతేనేం జట్కా దొరికింది. కవి మరీ అదృష్టవంతుడు. ఏనాడో యింత పెట్టిపుట్టాడు. ఈపాటికి, ఆవిడ బంగళాలో కమ్మగా కబుర్లుచెబుతూ కూచుని వుంటాడు; కళ్లు తిప్పుతూ భూమినీ ఆకాశాన్నీ చుట్టబెడుతున్నట్టు వాదిస్తూ వుంటాడు. నేనిక్కడ; ఈ జట్కాలో కుదుపులతో.

చివరకి మంచిజట్కా దొరికింది. గుర్రం శతపెంకె. మొండి. దానికన్నా మొండి బండివాడు. ఎముకలు విరగ్గొడుతున్నాడు. కదలదు. మెదలదు. అతనికి వొళ్లు అప్ప గించి మానవత్వాన్ని పరీక్షిస్తోంది గుర్రం. వాడు ఎంత చెప్పినా వినక దాన్ని తెగ బాదుతున్నాడు. కొట్టినకొద్దీ కాళ్లు వెనక్కి తంతోంది గుర్రం. అలాంటి గుర్రాన్ని నే నెక్కడా చూళ్లేదు. ఇలాంటి బండివాడూ నా కిదివరకు తటపడలేదు. కొరడా ఛల్ ఛల్ మనిపిస్తున్నాడు. దానికి నోరూవాయీ లేదు; వాడికి జాలీ భ్రమా లేదు. అంతకంటె కటికవాడు నయం. 'దాన్ని బాదకురా బాబూ' అన్నాను. 'అయ్యగారూ; మీకు తెలియ' దన్నాడు.

బండివాడికి వచ్చీరాని హిందీలో జంతువుల్ని సైతం ఎలా ప్రేమించాలో బోధ పరుస్తున్నాను. విని విని వాడు నాకేసి కొరకొర చూశాడు. మళ్ళీ ఛళ్ళమనిపించాడు. గుర్రం ముందుకాళ్లు నేలకు దన్నుపెట్టి వెనక్కాళ్ళమీద లేచింది. బండి దడదడ లాడింది. దాన్ని కొట్టకు మొర్రో అన్నాను. చితక బాదుతున్నాడు. బండి దిగిపోతానన్నాను. నడుస్తోన్న జట్కా ఆపాడు. తీరా వాడు ఆపాక బండి దిగనా మాననా అని నాకు సందేహం. సగంలో దిగిపోతే, బండి లాగుతున్న గుర్రాన్ని అన్నివిధాలా అవమానించినట్టే. బండివాడు లేచి నుంచుని జట్కాగూడుమీద కొరడాతో ఛళ్ ఛళ్ మనిపించాడు. గేలప్‌ట, గేలప్ !

గుర్రాలను మార్చేచోటు చేరేసరికి గుర్రం ఠక్కున ఆగి పోయింది. మరి కదిలిందికాదు. బండివాడు కొరడా విదిలిస్తూనే వున్నాడు. కొట్టినకొద్దీ మొండికెత్తుతోంది గుర్రం. కొసకి వెర్రెత్తి నాలుగడుగులు వెనక్కి నడిచింది. మరి లాభంలేదని నేను జట్కా దిగిపోయాను. ఇంకో గుర్రాన్ని తోలుకువచ్చి బండి పూన్తాను, వుండండంటూ అతను వెళ్లిపోయినాడు.

గుర్రాన్ని బండివాడు బాదగా వొళ్ళు తట్లుతేరివుంది. నేను వొద్దని కూకలువేసినా వినేవాడుకాడు. సగంతోవకి వచ్చింతరవాత పెద్ద విదేశపు తుమ్మచెట్లు వున్నాయి. అక్కడ గుర్రాలను మార్చడం మామూలు. గుర్రం మార్చేవాడిలాగనే అక్కడ బండీ విప్పి; గుర్రానికి యింత గడ్డివేసి రెండోగుర్రాన్ని తెచ్చే మిషమీద వెళ్లిపోయినాడు. పావుగంటైంది, అరగంటైంది, గంటైంది. పికరులేదు. గుర్రం వెతకనువాడు వెళితే, వాణ్ని

వెతకడానికి నేవెళ్లాను. ప్రాణంవిసికి నేను తిరిగి వొచ్చేసరికి అదివరకు వున్న గుఱ్ఱం, బండీకూడా మాయమైపోయినాయి. *

ఇంకో గుర్రపుబండీ కుదుర్చుకున్నాను ఇది తిండికి తిమ్మరాజు. పనికి పోతురాజు. చదునుజాగాలోనే చతికిలపడింది. బండబ్బిమీద కలయపడ్డాను. ఇంతలోనే కొట్టొచ్చినట్టు వాన తరుముకువచ్చింది. దూరంగా ముసల్మానుల షాపులు కనిపించాయి. ఎలాగో ఓలాగ బండివాడి ధర్మమాఅని వొక మిత్రుని షాప చేరుకున్నాను. జట్కాదిగి షాపులోకి వెళ్లాను. బట్టలు బాగా తడిసిపోయినాయి. షాపువాడు నాకేసి ఆశ్చర్యంగా చూశాడు. పొడిబట్టలు కట్టుకోమన్నాడు. పైజమా, ఫ్లానలు షర్టు, బనీను, ఓవరుకోటు, రగ్గు, వొకటోపీ తెచ్చి యిచ్చాడు. స్టవ్‌మీద కాఫీనీళ్లు పెట్టాడు. నేను నాకథంతా చెప్పాను. కవి నడతవిని అతను నవ్వాడు. నాబండి ప్రయాణం మరీ నవ్వుతాలుగా వుంది. నవ్వుతూ వేడివేడి కాఫీ యిచ్చాడు. డబ్బాపాల కాఫీ; అయినా ఫరవాలేదు. అదే అమృతం. అతన్ని మనస్సులోనే మెచ్చుకున్నాను!

ఇంకా వాన కురుస్తూనేవుంది. కవి ఏమయ్యాడో తెలియదు. బయలు దేరేటపుడు యిద్దరం బయలుదేరాం. షాపువాడు, లాంతరిచ్చి మనిషిని, వెంట పంపిస్తానన్నాడు. సరే; వాడునన్ను దిగబెడతాడు బాగుంది: కాని, బసఎక్కడో నాకే తెలియదు. కవికి తెలుసును. అతన్ని అడగడం మర్చిపోయాను.

షాపువాడికి ఏంచేయాలో అర్థంకాలేదు. ఇక్కడ నాకో యిద్దరు ముగ్గురు స్నేహితులు వున్నారు. వాళ్ళయిళ్లు కొండ

---

* ఇది మహాకవి తెలుగున వ్రాసిన పేరా.

మీద వున్నాయి. మరికొందరు పరిచయస్థులు వున్నారు; కాని వాళ్ళఇళ్ళు ఎటువైపు వున్నాయో ఇప్పుడు ఈవాన జల్లులో ఎక్కడికి వెళ్లాలో, ఈరాత్రి ఎలా గడపాలో బోధపడ్డం లేదు.

ఆలోచిస్తూ కూచున్నాను. ఇంతలో వొక గుర్రపుబగ్గీ షాపుముందుకు వచ్చి ఆగింది. ఓ, ఏభై యేళ్ళ ముసలాయన లోపలకి వచ్చాడు. మీసాలు తెల్లబడుతున్నాయి; రంగు వేశాడు కాబోలు. చక్కగా తలకు పాగా చుట్టుకున్నాడు. లోపలకి వస్తూనే "స్నేహితుడని నీయింటి కొచ్చేసరికి, వాన వెర్రికుక్కలా పట్టుకుంది. మా అమ్మాయికి మంచిశాలువా వొకటియ్యి. పిల్లకోరగ్గు. నాకొక పెగ్ విస్కీ...ఫరవాలేదు. ఈ వేదాంతి సంగతి నీకు బాగా తెలుసుకదా! ప్రాపంచిక సుఖాలమీద వేదాంతికి ప్రీతిలావు. ఎప్పుడూ ఖుషీ;" అంటూ నేను అవు పించేసరికి "ఎవరీయన"ని ప్రశ్నించాడు. ముసల్మాను నా అవస్థంతా ఆయనకి మనవి చేశాడు.

"ఒస్సి! ఇందులో ఏముందయ్యా! నీస్నేహితులు ఎవరొచ్చినా మనయింట్లో బసచేయొచ్చు; వస్తే రమ్మను; నాకభ్యంతరంలేదు!" ముసలాయనతో వెళ్లేదా మానేదా అని నేను తటపటా యిస్తున్నాను. తటపటాయించక వెళ్ళమని ముసల్మాను కళ్ళతో సౌజ్ఞ చేశాడు. సందేహిస్తూ "సరే" అన్నాను.

ఇద్దరం బగ్గీ దగ్గరకు వెళ్ళాం. ఆయన ఏమిటోఆలోచిస్తూ నిలబడిపోయాడు. సంశయంతో వెనక్కి తిరిగి, "సరే, దానికేంలే...అబ్బాయ్! బగ్గీఎక్కు. లోపల ఆడవాళ్ళున్నారు. మాలవాడివైతే మాత్రం, వాళ్ళని ముట్టుకోకు; అనుంటా కూచో...మాలా మాదిగా కాకపోతే యిబ్బందిలేదు...అమ్మా!

నువ్వు ఎదురుగా, ఆసీట్లో కూచో. దైవకృపవల్ల మనయింటికో అతిథివస్తున్నాడు" అన్నాడు.

ఆయన బగ్గీ తలుపు తెరిచేసరికి ఆకాశం తళుక్కుమన్నా బండిలోనే మెరుపు మెరిసింది. లోపల తళతళలాడే కళ్ళతో మెరుపుతీగెవంటి పిల్ల. ఆ పిల్లముందు మెరుపు దిగదుడుపు!

మెరుపు మాయమవడంతో మళ్ళీ చీకటి. దేవతవంటి ఆ పిల్లను పొరపాటున తాకనుకద! భయంతో వొకమూల వొదిగి కూర్చున్నాను. బండి గబగబ వెడుతోంది. ఎడాపెడా వాన మొత్తుతోంది.

కొంతసేపటికి, దీపాలతో పట్టపగల్లా వున్న వొకభవంతి ముందు బగ్గీ ఆగింది. ఆయనా నేనూ బండిదిగాం. తరవాత ఎప్పుడు దిగారో ఆ ఆడపిల్ల లిద్దరూ ఎదట నిలబడ్డారు. ఇద్దరూ అక్కచెల్లెళ్ళు కాబోలు. అక్క సాదాచీరె కట్టుకుంది. నగలాట్టే లేవు. చెల్లెలు ఒంటినిండా ఆభరణాలే. తలయెత్తి యిద్దర్నీ ఒక్కమాటు చూసి, వెంటనే పక్కకు తిప్పుకున్నాను. ఆడపిల్లల వంక చూడ్డం అసభ్యత అనుకున్నానో, మరి అటు చూడగానే కళ్ళు 'జిగ్' మన్నాయో కాని, నా చూపులుమాత్రం పక్కకు వొత్తిగిలాయి.

బగ్గీలో అపుడపుడు మెరుపుల కాంతికి ఆమె మోము కనిపించేది. కాని కనిపించకుండా, బిడియపడుతూ తల పక్కకు తిప్పుకునేది. నేనటు చూసీచూడనట్టు చూసేవాణ్ణి.

తెరలు తెరలుగా మబ్బులు పడమటి దిక్కుకు తేలిపోతు న్నాయి. చెదిరిన మబ్బుల చాటున వెన్నెల చోటు చేసుకుంది. కొండ కోసలమీద మబ్బుల పరదా, మళ్ళా మళ్ళా చూడాలని

పిస్తోంది. కప్పల అరుపులు చెవుల్ని బెకబెక లాడిస్తున్నాయి. సరదాగా మబ్బుల పరదాని, వెన్నెల చిల్లుల్ని చూస్తూ కుర్చీలో కూచున్నాను.

ఉండిఉండి చిన్నిచిన్ని మబ్బులు చందమామను కప్పుతున్నాయి. చీకటి కమ్ముతోంది. మబ్బు ముసుగుల సందులోంచి చందమామ తొంగితొంగి చూస్తున్నాడు. వెన్నెల జారిపడుతోంది. అంతలోనే వెన్నెల, అంతలోనే చీకటి. కొండలమీద ఇళ్ళ దీపాలు మిరిమిట్లు గొల్పుతున్నాయి.

చెడ్డనుంచి మంచీ; మంచినుంచి చెడ్డా ఇంతలోనే ఎంత మార్పు! కీడు వాటిల్లిందని క్రుంగిపోకూడదు. కీడునుంచి మేలు చేకూరుతుంది. ఇందాకా జట్కాలో ఎంత దురవస్థ పడ్డాను. ఆదురవస్థ యిట్టేవచ్చి యిట్టేపోయింది. ఈ భవనంలోకి దారి చూపి, తనదారిని తాను చక్కాపోయింది. అట్టేవుండా మరి!

ఇది మామూలు భవనంకాదు. ఇద్దరు అందగత్తెలు మసలుతున్న భవనం. ఆయనకి నామీద ఎంతదయ; లేకపోతే ఇంటికి నన్ను రమ్మని పిలవడుకద. ఇంతకీ ఆయనెవరో నేనడగలేదు. అడగడానికి ధైర్యం చాలిందికాదు. కాని ఆయన వొకనాయుడు. అవును మాట యాస.

ఆయన గదిలోకి వచ్చాడు. కుర్చీలో చతికిలబడ్డాడు నన్ను పరిశీలనగా చూశాడు. ప్రశ్నలు వేశాడు. "నేను శూద్రుణ్ణి. అయితేనేం, మావంటవాడు బ్రాహ్మడే" అన్నాడు.

"రెండు పూరీలూ కాసిన్ని పాలూ చాలును."

గద అవతల ఎవరివో మాటలు వినిపిస్తున్నాయి. ఆయన అటుతిరిగి కేకవేశాడు. ఎవరూ పలకలేదు. నాలుగయిదుసార్లు

మరో రెండుమూడు పేర్లు పిలిచాడు. లోపల సందడిగా వుంది. ఎంత కేకవేసినా ఎవరూ రాకపోతే, లోపలికి తనే వెళ్లాడు. నౌకర్లు, బగ్గీవాడి చుట్టూమూగి, వాడు చెప్పేకబుర్లు వింటున్నారు. వాళ్లు వింటున్నకొద్దీ, సైసు చిలవలూ పలవలూ పెట్టి కథ చెప్పుకు పోతున్నాడు.

"వంట మనిషికి వొంట్లో బాగులేదట; ఏం కష్టమో ఏమో !" అంటూ ఆయన గదిలోకి తిరిగి వచ్చాడు. నేనడిగినవి అమిర్చి పెట్టలేకపోయినందుకు ఎంతో కించెపడ్డాడు. ఇంట్లో తాను స్వయంగా తయారుచేసిన రిఫ్రెష్‌మెంట్లు చాలా వున్నాయట: "మీరేం తింటారు ?"

"ఏదైనా సరే !"

"పూరీలు కదా అడిగారు ?"

"అవే అక్కర్లేదు; ఏవైనా సరే"

గబగబ గదిబయటకు వెళ్ళి కూతుర్ని పిలిచాడు. స్వయంగా కాఫీకాచి తెమ్మన్నాడు. "నౌకర్ల నెవర్నీ ముట్టుకో నీయకు !" అంటూ తాను ఫలహారానికి వెళ్ళిపోయాడు. పావు గంటైన తరవాత, వెండిట్రేటితో కాఫీ పట్టుకుని ఆ అమ్మాయి గదిబయట నించుని లోపల నేనొక్కడ్నే కనిపించేసరికి మెరుపు వలె మటుమాయమైంది. అవును, తరవాత తెలిసింది, ఆపిల్ల పేరు సౌదామిని !

సౌదామిని, దాసీచేత కాఫీ పంపించింది. దాసీది లోపలికి వచ్చింది. పాతికేళ్ళ పిల్ల. చాకింటె మడతలు కట్టుకుంది. ఆయనేం "చేస్తున్నార"ని అడిగాను.

"బాలయ్య బాబుగారా!"

బాలయ్య బాబుగారు గదిలోకివచ్చాడు. "రిఫ్రెష్ మెంట్లు రెడీ అవుతున్నాయి. కావల్సినంత పళ్ళరసం!" ఆయన దాసీ వంక చూశాడు; మండిపడ్డాడు. "కాఫీ, నువ్వా పట్టుకువచ్చావ్? మతీసుతీ లేదు. తభ్యం! పో. పో. పట్టుకుపో. నువ్వు శూద్రపు దానివి కదా, ముట్టుకోవచ్చా? అమ్మాయినెందుకు పట్టుకు రమ్మన్నా ననుకున్నావ్? అమ్మచేత మళ్ళీ కాఫీ చేయించు. కులంగిలం లేదనుకుంటున్నావా? అంటూ సొంటూ జాన్తానై అనుకున్నావా?"

పనిమనిషి గతుక్కుమంది. కొయ్యబారి పోయింది. ఆయన నావంక తిరిగాడు: "పూర్వం దక్షిణాదిని ఒక రాచ కుటుంబం వుండేది. ఆకుటుంబానికీ మాకూసంబంధం. అయినా నేను శూద్రుణ్ణే. మాపూర్వీకులూ బ్రాహ్మలూ వొకేపంక్తిని భోంచేసేవారు. ఆ రోజులు వెళ్ళిపోయాయి లెండి. నేను శూద్రుణ్ణే. అయితే వోమాట. ఎంత తక్కువ కులస్థురాలయినా స్త్రీరత్నం స్త్రీరత్నమే; పవిత్రురాలే. మాది తక్కువకులం అనుకోకండి. మాది గొప్పకుటుంబం. ఇప్పటివరకూ మాకుటుంబ గౌరవాన్ని మాతాత ముత్తాతల్లాగే కాపాడుకుంటూ వస్తున్నాను...ఎవరండీ ఆవిడ? మహర్షిని పెళ్ళాడిన జాలరిపిల్ల! భారతం విన్నానుకాని, ఆవిడపేరు మర్చిపోయాను. ఏదీ యాదస్తుండదు నాకు; చిత్రం! మా అమ్మాయి అలాగకాదు. ఏఘట్టంలో ఏశ్లోకమైనా సరే; నిద్దట్లో అడిగినా అప్పజెపుతుంది. శ్లోకాలన్నీ నోటికి వచ్చును. అంటూ దాసీవంక తలెత్తి

చూశాడు: "ఇంకా ఇక్కడ నిలబడే వున్నావా? వెళ్లు. సౌదామినితో కాఫీ చేయమని చెప్పు. దబ్బున తెమ్మను."

"కాఫీకేం ఆలస్యం లేదు. మావాంటింట్లో ఎప్పుడూ నీళ్లు మరుగుతూనే వుంటాయి. ఏం చేయమన్నా చిటికెలో చేసి పారేస్తారు. వెళ్లిపోతున్న దాసి ఆగింది. "ఇది సౌదామినమ్మగారే చేశారు!"

"అయితే అదే ఎందుకు పట్రాలేదూ? కాఫీ నువ్వు ముట్టుకుంటె అంటైపోదూ?"

"అంటూలేదు, సొంటూలేదు; పోనిద్దురూ. మళ్లీ కాఫీ పెట్టించకండి. మీఅమ్మాయికి లేనిపోని శ్రమ!" దాసీ ఇచ్చిన కాఫీ పుచ్చుకున్నాను.

"ఓహో! ఆచారం గీచారం లేకుండా, కాలంకంటే ముందడుగు వేస్తున్నారే? అలా అయితే నాతో కలసి భోం చేయడానికేం?"

"చేయొచ్చు; దాసికేం?"

"మీరు ఎడ్వాన్స్‌డన్నమాట."

"ఇక్కడికి కొచ్చాకే."

"మీకు పట్టింపుల్లేవన్నమాట."

"కాఫీ అదీ ఎవరుచేసినా ఫరవాలేదు; అన్నంమటుకు బ్రాహ్మలు వొండితేనే తింటాను."

"సంతోషం; సంతోషం. కులం అంటే మీకు గౌరవం. అందుకు మీరంటే నాకు గౌరవం. కులంమీద గౌరవం వుంచడమంటె తననుతాను గౌరవించుకుంటున్నట్టు లెక్క. సంఘాన్ని గౌరవించడమన్నమాట. అలాంటి వ్యక్తిని మనం నమ్మొచ్చు."

"ఆ మాట నేనొక సిద్ధాంతంగా చెప్పడంలేదు; నా సిద్ధాంతాలు ఆచరణకంటె ముందంజ వేస్తాయి."

"నావీ అంతే. ఆమాటకొస్తే నే నంతకన్నానూ. నా ఆచరణ, నా సిద్ధాంతాలకంటె ఎప్పుడూ ఓ అడుగు ముందుకే. అయితే వొకటి; సిద్ధాంతాన్ని మాత్రం గుర్తించి తీరాలి. నేనుమాత్రం కులధర్మాన్ని పాటిస్తాను. వ్యక్తులు కాలం కంటె ముందు పరిగెత్తవచ్చును. అంతమాత్రంచేత ప్రపంచంలో మంచివాటిని కాదనలేరు. కనక కులాల కట్టుబాట్లు వొసిలించ నీయకూడదు. మామూలు మనుష్యులు వాటిని పాటించవల సిందే. వర్ణాశ్రమధర్మాల గొప్పతనం తెలిసిన మనిషి, కుల ధర్మాలను పాటించకపోతే, అదివేరు. అతనికి శాస్త్రజ్ఞానం వుండబట్టి, దానితోపాటు అలాంటిస్థైర్యం వుంది. అతను మహా జ్ఞాని. అందర్లాంటివాడూ కాదు. అందరికీ వర్తించే ధర్మ సూత్రం అతనికి వర్తించదు. మహర్షుల సంగతి చూడండి. వాళ్లు ధర్మ సూత్రాలు విధించారు. ఉల్లంఘించారు. మహర్షులు ఏం చేసినా చెల్లుతుంది. ఏది చేస్తే అది ధర్మసూత్రం. మహర్షి వేరు; మనిషి వేరు. సాధారణులు సాంఘిక సూత్రాలను తు. చ. తప్పక పాటించక తప్పదు. ఇది ఒక సత్పురుషుని వేదాంతం. ఆయనికి సేవచేసే మహద్భాగ్యం నాకు లభించింది. చాలా గొప్పవాడు. మహారాజు..."

బాలయ్య దాసివంక చూశాడు: "ఎంత తెలివితక్కువ దానివే. ఉగ్గుగిన్నెడు కాఫీ పట్టుకొచ్చావ్! ఇంకో కప్పు కాఫీ తీసుకురమ్మని అమ్మతో చెప్పు. నువ్వుమాత్రం తేకు. ఆ

వేళ్లూ నువ్వూ. ముట్టుకుంటే పనికిరాదు. కాఫీతోపాటు బిస్కట్లూ అవీ పట్టుకురమ్మను!"

ఆయన మాటలకి అంతూ పొంతూ లేకుండా పోతోంది. విస్కీ గుణగుణాల్ని తైపారువేసి చర్చించడ మారంభించాడు. "నేనలాంటిదిముట్టను!"అన్నాను. "అందుకు మీరంటే గౌరవం." అన్నాడు. ఇకముందు సైతం వాసన చూడొద్దని సలహా యిచ్చాడు.

"ప్రేలుడు పదార్థానికి దూరంగా వుండడమే మంచిది" అంటూ చుట్టూచూసి ఎవరూ కానకుండా బీరువా తెరచి సీసాతోపాటు గ్లాసు తీసి సోడా మోతాదుగా కలిపి ఆపళంగా గుటుక్కుమనిపించాడు ఒక "పెగ్!"

కాఫీ పట్టుకుని సౌదామిని వచ్చింది. గడపముందు శిరస్సు వంచుకుని నిలబడింది! అందమైన తలకట్టు. "లోపలికి రా కన్నా! ఈయన నాకు స్నేహితుడు; బ్రాహ్మణుడు; తెలివైనవాడు.'

తలవంచుకుని, పాదాలతో నేలను కొలుస్తున్నట్టు అడుగులు వేసుకుంటూ లోనికి వచ్చి వెండి పాత్రతో కాఫీ తెచ్చి టేబిల్ మీద వుంచింది. బాలయ్య ఆమెను దగ్గరకు రమ్మని పిలిచాడు. చేరువకు వెళ్లి ఆయనవంక చూసింది.

"ఎవరు కన్నా, ఆ జాలరిపిల్ల పేరు? పోనీ, జాలరి పిల్లను పెళ్లాడిన ఆ రాజు పేరు?"

ఆ పిల్ల సమాధానం చెప్పకుండా గిరుక్కున తిరిగి, గది లోంచి వెళ్లిపోయింది; బాలయ్య నావైపు తిరిగాడు: "మానవ స్వభావంలోనే తల్లకిందుగా ఆలోచించే జాడ్యం వుంది.

ముఖ్యంగా యవ్వనంలో యిది మరీ ప్రకోపిస్తుంది. అందులో ఆడవాళ్ల సంగతి చెప్పేదేమిటి!"

నేను మౌనంగా వింటూ కూచున్నాను.

"ఆమెను 'వెళ్లిపోమ్మా' అన్నాననుకోండి. వెళ్లదు; వుంటుంది. 'వుండమ్మా' అన్నాననుకోండి. వుండదు. వెళ్లి పోతుంది!"

కాలం నన్ను పరీక్షిస్తోంది. ఆ పిల్ల అందాన్ని ఒక్కసారి చూడాలనిపించింది. ఇటు మళ్లీ ఒకమాటు, ఆ అమ్మాయి వస్తే బాగుండును. ఆ అందాలరాశిని చూడాలని నా కెందుకీ తృష్ణ? నే నింత ఆరాటపడుతున్నట్టు పసికడితే ఆయన ఏమనుకుంటాడు! యోగ్యత యెరిగి మసులుకుంటే మంచిది. సదవకాశాలు చెయిజారిపోవు.

ఆయన హుక్కాగొట్టం తీసి గుడుగుడు మనిపించాడు. గదంతా పొగతో నిండిపోయింది. ఆ హుక్కా టిప్పుసుల్తానుది!

"మీ దయకు కృతజ్ఞుణ్ణి. మీరుణం తీర్చుకోలేను" అన్నాను.

"ఎందుకు తీర్చుకోలేరు; తీర్చుకోగలరు" అన్నాడాయన.

"ఆమార్గం ఏదో సెలవివ్వండి, మీఆజ్ఞ ఏదైనాసరే తల దాలుస్తాను."

"ఈవూరు మీరేదైనా పనిమీద వచ్చారా; నాలుగు రోజులు సరదాగా వుందామని వచ్చారా ?"

"సరదాగా వుందామనే. పనేమీలేదు. మాప్రాంతంలో తాపం మరీఎక్కువ. ఆబాధ తప్పాలంటే యిక్కడికి రాక

తప్పదు. నీలగిరి ప్రకృతి దృశ్యాలు, గాలులు మనోహరం. వాటిని చూడవేడుక, అనుభవించ మనసు."

"అలా అయితే వారంరోజులపాటు నాతో వుండండి. తప్పదు...వుంటానని మాట యివ్వండి ముందు!"

"అలాగే. మీదగ్గర వుండడం సంతోషమే కదా!"

"అప్పుడే మీరామాట అనకండీ; వుంటానని మాట యివ్వగానే సరికాదు. యిబ్బందులున్నాయి. ఇక్కడ వున్న న్నాళ్లూ పైవాళ్లనెవరినీ కలుసుకోకూడదు.బయటకు వెళ్ళరాదు. ఇంట్లోనూ ఇంటి పరిసరాల్లోనూ మీఇష్టం; అరమరిక లేకుండా మసలవచ్చును. అతిథిగా మీరు కొన్ని మర్యాదలు పాటించాలని నాప్రార్థన. మాకుటుంబవ్యవహారాలు ఎవరికీ చెప్పకూడదు; గోప్యంగా వుంచాలి. ఇక్కడ మావాళ్ళు ఏకాంతంగా వుంటు న్నారు. లోకం బహుచెడ్డది. దాని కక్కర్లేనిదంటూ ఏదీ వుండదు. అందరి సంగతులూ దానికే కావాలి. దయా దాక్షి ణ్యం మంచీచెడ్డా ఏకోశానా కనిపించవు."

"అవును; లోకులు కాకులు. ఉత్తినేపుట్టిందా ఆమాట?"

"అందులోనూ ఆడపిల్లల్ని కన్నతండ్రికి ఈరోజుల్లో అన్నికష్టాలే. మా అమ్మాయికి పెళ్ళి కాలేదు. ఇంట్లో ఎదిగిన పిల్లవుంటే గుండెలమీద కుంపటే. మూడు ముళ్లూపడాలి. ఓ ఇంటిదవాలి. అమ్మయ్యా అనుకోవాలి. అంతవరకూ ఆదుర్దావే; అన్నీ బాధ్యతలే. ఏంచేస్తాం. తండ్రి అయాక మోయక తప్పు తుందా? కట్టు ఖాయిదా లవసరం. నాఇష్టంలేనిదే మా అమ్మా యిని ఎవరూ చూడకూడదు: ఎవరితోనూ మా అమ్మాయి మాట్లాడకూడదు. చిన్నప్పుడే పెళ్ళిచేసేస్తే ఈ బాదరబందీ

లేకపోను. లేనిపోని చికాకులు తెచ్చిపెట్టుకున్నాను. ఇప్పుడు దానికి పెళ్లికొడుకు నచ్చాలి. నచ్చినవాణ్ణి తేవడం మాటలా ? ఇంతకీ నచ్చడానికీ నచ్చకపోడానికీ దానికేం తెలుసు. తెలుసుననే అనుకుంటుంది, కర్మ !"

ఆయన చెబుతున్న మాటలు శ్రద్ధగా వింటున్నాను. క్షణంఆగి మళ్ళీ మొదలుపెట్టాడు: "ఏం చేయాలో తోచడం లేదు. పదిమందీ ఎలాచెబితే అలా చేద్దాం అనుకుంటాను. చుట్టాల సలహాలు వింటే బాగుపడం. చెడిపోతాం. 'నా ఇంటికొస్తే ఏంతెస్తావ్, మీఇంటికొస్తే ఏం యిస్తావ్;' ఇదీవాళ్ళ పోకడ. అంతా స్వార్థం. యువకులూ అంతే. ఈవారంరోజులూ మాఇంట వుంటారుకదా; మీరేం చెబుతారో చూస్తాను. ఈ క్షణంలో మా అమ్మాయికి పెళ్ళి చేయాలంటే అరడజను మంది జమీందారు బిడ్డల్ని లాక్కొస్తాను. ద్రౌపదకిలా అందర్నీ కట్టబెడతాను. మాఅమ్మాయి కళ్లెత్తి చూస్తేచాలు; నేనంటే నేనని వేలాది పెళ్ళికుమారులు వచ్చిపడతారు. అంత అందకత్తె నాకుమాత్రె కావడం నాఅదృష్టం. అందం అంటే వాళ్ళమ్మది. కాలంలో వున్నప్పుడు, వాళ్ళమ్మ దీనికంటే బాగుండేది. సరే; అది వేరేకథ !"

ఎదుట అద్దాలగదిలో ఆ అమ్మాయి నిలబడింది. ఆ అందం కొండలకు లేని అందం; ఈ భవనం వొక దేవాలయం. ఆమె వొక దేవత. నీలగిరికీ ఆకాశపు అంచులకీ అందని అందాల అప్సరస.

రకరకాల పూల పరిమళాల గాలులలో ఆమె సొగసు. దేని సౌకుమార్యమైనా ఆమెదే. విశ్వమంతటా ఆమె తేజస్సు.

ఆకాశంలో చుక్కలు ఆమె ఆభరణాలు. తెల్లని వెన్నెలకదా ఆ పిల్ల.

అందానికి యవ్వనం తనివి. యవ్వనం వస్తున్నకొద్దీ లావణ్యం వింత వింత మెరుగులు పెడుతుంది. కాంతులు దిద్దుతుంది. కాని ఇంత సౌకుమార్యమూ సౌందర్యమూ యౌవ్వనంతోపాటు తరలిపోవచ్చును. ఆ పిల్ల లాలిత్యమూ లావణ్యమూ అంతేకాబోలును! అవును; రేకులు విచ్చినట్టే విచ్చి వాసనలు వెదజల్లినట్టే వెదజల్లి, వాడిపోయి, నేల, రెక్కలు రాలుస్తుంది గులాబీ; కాని వాడిపోక మునుపు, రెక్కలు వికసించినపుడు, ఆ సౌందర్యం, ఆ సౌరభం ఆ గులాబిదే కదా!

• • •

కాఫీ తీసుకువచ్చాడు బ్రాహ్మణుడు. శుభ్రంగా స్నానం చేశాడు. చక్కగా గంధం పూసుకున్నాడు. జుట్టు ముడివేసుకుని పువ్వు పెట్టుకున్నాడు. (భంగు, మతం, స్త్రీ) భంగుకొడతాడు. నోటినిండా పొగ, గుడగుడ శబ్దంవుంటే ఆకలీ దప్పికా పుట్టవు. లేకపోతే చెయ్యి విరుచుకున్నట్టు వుంటుంది.

బ్రాహ్మణుడు తన గురువుగారి సంగతులు చెప్పుకొస్తున్నాడు. అవి మామూలు సంగతులు కావు. మహిమలు, లీలలు, ఊటీ పుట్టుపూర్వోత్తరాలు పూస గుచ్చినట్టు వర్ణించాడు; ఏదో కథ కల్పించి పురాణాలతో ముడిపెట్టాడు. స్థల పురాణం !

ఇంటివాళ్ళ సంగతులు ముచ్చటించాడు. కొన్ని కొన్ని విషయాలు చెప్పనే చెప్పకూడదట. జీవితం అమూల్యమైనది. నాయుడు మంచివాడే. తనను చచ్చినా వొదిలిపెట్టడట. ఆపిల్ల

దేవతల్లో ఎన్నదగిన మనిషి. కాని తల్లిమాత్రం; అబ్బో ఆవిడ ఆవలిస్తే పేగుల్లెక్కెడుతుంది. ఇంద్రుణ్ణీ చంద్రుణ్ణీ లెక్కచేయని మనిషి. నిర్దయురాలు.

అరగంటలో అన్నీ చెప్పి భవనం ఎంత పెద్దదో ఎన్ని గదులున్నాయో ఎటువున్నాయో కలం కాగితంతీసి ప్లానువేసి చూపించాను. "నాయుడుగారి జీవితం తమాషావే లెండి; కట్టుకున్న పెళ్లాం బిడ్డలూ వాత్తేరులో వున్నారు!"

ఆపిల్ల వయసులో చిన్నదైనా ఆలోచనలో పెద్దది. ఉన్నతమైన ఊహాలు; విజేతకుండే గర్వం. ఒక నేపోలియన్. ఆమెకున్న భవనం గొప్పది; దివ్యహర్మ్యం. అంతా మహారాజ వైభవం. చక్రవర్తివలె జీవించగల తాహతువున్నజన్మ. ఒకళ్ళకివ్వాలన్నా మానాలన్నా ఏ ఆటంకమూ లేదు. అధికారం చెల్లుబడి అవుతోంది.

సాధారణంగా అధికారంలో అందం వుండదు. సొగసు పోతుంది. అధికారం అందవికారంతో చెలిమిచేస్తుంది. కాని ఆమెకున్న అధికారం అలాంటిదికాదు. అసాధారణమైనది. అది ఒకరిచ్చింది కాదు; తాను తెచ్చిపెట్టుకున్నదీకాదు. తానంతట తానుగా వరించిన అధికారం ప్రేమతో లీనమయింది. ఆమెది వెన్నపూసలాంటి మనస్సు. ప్రేమించడం తప్ప ద్వేషించడం ఎరగదు. అందువల్లనే ఆమెకీ అధికారం; వున్నా లేనట్టే వుంది.

తక్కువస్థితిలో వున్నది ఉన్నత స్థితిలో వున్నదానితో మిళితమౌతున్నపుడు అది కొత్తగా కొన్ని ధర్మాలను స్వీకరించి ఉన్నత స్థితిలోవున్న సౌందర్యాన్ని పొందుతుంది. అజ్ఞా

నం సైతం సుగుణమే. కాని అది తన ఉనికిని తెలియపరచినపుడు ఖేదం కలుగుతుంది. అయితే దాన్ని పోగొట్టుకునే ప్రయత్నం మనస్సును ఊరటపరుస్తుంది. కొత్తదేదో నేర్చుకుంటున్నాననే భావం సంతృప్తినిస్తుంది. బోధించడంలోనూ, నేర్చుకోవడం లోనూ, లైంగిక ప్రేమ కలిగించే సుఖంవంటి వొకవిధమైన ఉల్లాసంవుంటుంది.

జీవితం ఏమిటి బోధిస్తుందో స్త్రీకి తెలియవచ్చును; కాని దానిని మొదట నేర్చుకునేవాడు పురుషుడు. తాను అవగతం చేసుకున్న ఆజీవితాన్ని అతను ఒక్కొక్క రేకుగా ఆమెకు వికసింపచేస్తాడు.

ఆమె జీవితం వేరు; కుటుంబజీవితం వేరు. రెండింటికీ చాలా భేదంవుంది. ఆమె జన్మవృత్తాంతం. ఆమెకు భాగంలేని ఆమెచేష్టితాలు. తండ్రికైతే ఇవన్నీ సహజంగానే కనిపిస్తాయి. మగనికి మాత్రం యింకొక విధంగా వుంటాయి.

* * *

"స్త్రీ, మేలుకోవాలి. ఎదిరించాలి. తిరగబడాలి. మానవత్వం ఆమెలో అధికం. ఆడది అబలకాదు. మీ వాదన్లో అర్థం లేదు. మన దేశంలో పల్లెపడుచు చూడండి. పురుషుడుకంటె బలవంతురాలు; ఎక్కువ కష్టపడుతుంది. కష్టానికి ఓరుస్తుంది. పొలంపనంతా ఆమెదే. గొప్పులు తవ్వుతుంది. దుబ్బులు పెరుకుతుంది. ఊడుస్తుంది. వొడ్లు దంచి బియ్యం విసురుతుంది. మగవాడికంటె ఆడది ఎందులో తక్కువ? వాళ్ళేకాదు: మన ఆడవాళ్ళూ అంతే. గాబుల కొద్దీ నీళ్ళు తోడుతారు. కుంచాలకొద్దీ బియ్యం వారుస్తారు. ఇంటిల్లిపాదికీ చాకిరీ చేస్తారు.

అయితే గొప్పవాళ్ళ ఆడపిల్లలు వేరు. దుర్బలులు. ఆ మాట నేనూ ఒప్పుకుంటాను. పెద్దింటి పిల్లలు మైనపుబొమ్మలు. కష్టపళ్లేరు. కరిగిపోతారు. సృష్టిలో నాజూకుతనమంతా, భగవంతుడు వాళ్ళల్లో పోతపోశాడు. శరీరకష్టం పడలేకపోతేనేం; ఫిడేలో, వీణో వాళ్ళచేతికిచ్చి వినండి మిమ్మల్ని గంధర్వలోకాలు తిప్పి తీసుకువస్తారు." అన్నాడు కవి. నేను వుండబట్టక "అదృష్టవంతులు" అన్నాను. కొంతసేపు నిశ్శబ్దం. ఎవరూ మాట్లాడలేదు.

కవి మళ్ళీ యిలా అన్నాడు: "ప్రతీ ఆడపిల్లా సంగీతం నేర్చుకోవాలి. పొద్దున్న లేచింది మొదలు, రాత్రి పడుకునే వరకూ రెక్కలు ముక్కలయేటట్టు చాకిరీ...రామరామ ! వంటమనిషిని పెట్టుకుంటే, చాకిరీ తప్పుతుంది"

"బీదాబిక్కికీ వీలవుతుందా; జరుగుబాటుకే కష్టం !" అన్నాను.

"సరి. సరి; మీకింకా తెలియదన్నమాట కవిగారి స్వప్నలోకం; ఊహాప్రపంచం. అక్కడ బీదా బిక్కీ వుండరండోయ్!" అన్నాడు నాయుడుగారు.

"ఊహాప్రపంచమా? కాదు. మనం వుంటున్న ఈ లోకం సంగతి మాట్లాడుతున్నాను. కవీ తత్త్వవేత్తా తమకాలంకంటె ముందు వుంటారు !"

"అవునవును"

"రాచకన్యలు చూడండి. తమలపాకుల్లా అతికోమలం; అయినాసరే, అవసరం వస్తే తమ రక్షణకోసం కత్తి పట్టుకుంటారు. మానమర్యాదల్ని కాపాడుకుంటారు. ప్రతీ ఆడదీ కత్తి

పట్టడం నేర్చుకోవాలి; లేకపోతే స్త్రీ, తన శీలాన్ని తాను కాపాడుకోవడం కష్టం!"

"ఎలా కాపాడుకోవాలో వాళ్ళకి తెలుసులెండి"

"హాస్యానికైనా వేళాపాళా వుంటుంది. ఇష్టం వచ్చినప్పుడల్లా హాస్యమేనా? ఆడవాళ్ళకి అలాంటి తరిఫీదు ఎందుకో మీకు తెలుసునా? పురుషప్రవృత్తి చెడ్డది. విజృంభిస్తే దానికి యుక్తాయుక్తవిచక్షణ వుండదు. అది అతిదుర్మార్గమైంది. స్త్రీ తనను తాను రక్షించుకోక తప్పదు; బయటకి వెడుతున్న ప్రతీ ఆడదాని చేతికీ ఓ పిస్తోలో బాకో యిచ్చి మరీ పంపించాలని నా మతం! దానితో చీల్చి చెండాడుతుంది!"

"ఆడదానికవన్నీ ఎందుకు? ఉన్నకళ్ళు చాలవా యేమిటి! చూపులతోటే చంపుకుతినొచ్చు; ఇట్టే జయించుకు రావచ్చును...అవున్లెండి. పగవాళ్ళందరూ వొకలాగుండరు. ఆడవాళ్ళను చూడగానే కొందరు పశుప్రాయుల్లా ప్రవర్తిస్తారు. వాళ్ళకైతే కత్తిపోటో, గుండుదెబ్బో అవసరమే. అంచాత మీరు చెప్పినట్లు ఆడది ఆయుధం పట్టుకుని అవతలకి వెళ్ళడం మంచిది!"

"అప్పుడే దుష్టుల బారినుంచి స్త్రీ తనను తాను రక్షించుకోగలుగుతుంది!"

మొత్తంమీద నాయుడుగారికి కవి సలహా నచ్చింది. స్త్రీకి ఆయుధ శిక్షణ అవసరమనే నమ్మకం కుదిరింది. కవి నేర్పుతానన్నాడు. ఆమె నేర్చుకుంటోంది. కవిత్వంకూడా మప్పుతున్నాడు.

◆ ◆ ◆

జూలై నెల. సంపెంగచెట్లు విరగపూశాయి.అక్కడక్కడ తెల్లని మానులతో చెట్లు. ఆకులసందున ఎర్ర ఎర్రనిపూలు. లేత ఎరుపురంగుతో వింతగా వున్నాయి.

ఆకాశంలో గుండ్రని తెల్లని సున్నాలా చంద్రుడు. గాలి విసురుగా వీస్తోంది. టపటప వాన చినుకులు. చిన్న చిన్న మబ్బులు చంద్రబింబాన్ని కప్పుతున్నాయి; మబ్బులచాటున చంద్రుడు ఒక్కొక్కప్పుడు కొంచెంకొంచెంగా కనిపిస్తున్నాడు. మబ్బుల దళసరినిబట్టి వెన్నెల. నల్లటి చుక్కల్లాంటి మబ్బులు. వస్తున్నాయి పోతున్నాయి.

వెన్నెలతోపాటు నీళ్ళతళతళ. కొలను.దూరపులోయలు. చెట్ల ఆకుల మిలమిల; పూలవాసన.

కవి తన హృదయాన్ని విప్పి చెబుతున్నాడు; "ప్రేయసీ! ఎందుకలా ఆశ్చర్య చకితురాలవవుతావ్ ? విభ్రాంతి దేనికి ! నేనునిన్ను 'ప్రేయసీ' అని మనసారా పిలుచుకొంటున్నాను. ఆ పిలుపులో భయపడ్డానికేమీ లేదు. ప్రేయసి అనేభావం మధురాతి మధురం. అది ఎవరికి వర్తిస్తుందో నాకు తెలుసును. నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నీ చెలిమికోరి వచ్చాను. నీహృదయాన్ని వాంఛిస్తున్నాను. నువ్వు నన్ను ప్రేమించడంకంటె నాకీ లోకంలో మరేంకావాలి: నీఎదట నిలబడితే చాలు; అదే ఆనందం. నీమాటలు నిత్యనూతనం; సంగీతం. నువ్వు నిలబడిన చోట శృంగారం హరివిల్లు విరుస్తుంది. కాదు, ఏదో మహాకాంతి దివ్యతేజస్సు అంతటా ప్రకాశిస్తుంది. నాకు శక్తివుంటే, నిన్ను ఎవరికీ కనపడని మహాసముద్రం మధ్య ఒక ద్వీపానికి తీసుకు పోదును; సౌందర్య సామ్రాజ్యపు పట్టమహిషను చేద్దును.

ఆడవాళ్లు పూలపొదల వంటి వాళ్లు. చూడు. అటు వక్కసారిచూడు! మనం ఇక్కడికి రాకమునుపే ఆ చెట్లు ఎలా పుష్పించాయో! కొన్ని పొదలు మాత్రమే పూశాయి. అన్నీ కాదు. 'రోడెన్‌డ్రాన్' మౌనంగా వుంది. 'కామెల్యా' పలుకే బంగారం. 'వాటిల్'ను చూస్తే మనం ఏవగించుకుంటాం; అది శుష్కించిపోతోంది. ఎన్నో పొదలు శుష్కించి శుష్కించి పుల్ల విరిగిపోతాయి. ఇంతకు ముందు కొన్ని తరాల స్త్రీలు సౌంద ర్యంతో పరిమళించార్లు; పాపం!

స్త్రీ, కలకాలం కన్యగా పడివుండలేదు. ఎప్పుడో ఒక ప్పుడు వివాహం చేసుకుతీరాలి. ఎందుచేత? స్త్రీ, ఎంత సౌందర్యవతి అయినా, కొన్నాళ్ళకి తన అందాన్ని పోగొట్టు కుంటుంది. ఒకప్పుడు అపురూప సౌందర్యవతిగా అందరికీ కని పించిన యువతి, అందం పోగానే సామాన్యవలె కనిపిస్తుంది. ఇతరుల కంటికి ఇప్పుడంతే. కాని భర్త దృష్టివేరు; అతని హృదయం వేరు. అతని మనోదృష్టికి అందమైన భార్య ఎప్పుడూ అందంగానే కనిపిస్తుంది. నవకం పోగొట్టుకోదు. మొదట యువతీ యువకులు వివాహం చేసుకున్నపుడు అనుభవించేది ప్రణయ మాధుర్యం మాత్రమే: భర్త దృష్టికి గోచరించేది భార్య దేహసౌందర్యమే. కాని తరవాత...కొంతకాలం గడిచాక, దైనందినజీవితబంధాలు, అనుభవాలు, పిల్లలు, సంసారం; సంసారం పెరుగుతున్న కొద్దీ అనుబంధం ఎక్కువౌతుంది; ఇద్దరి సుఖాలూ ఒకటే; ఇద్దరి దుఃఖాలూ ఒకరివే. ఒకరి ఆనందం ఇద్ద రికీ ఆనందం; ఒకరి విషాదం ఇద్దరికీ విషాదం. ఇదివరకు యవ్వ నంతోపాటు పోయినఅందం యిపుడు అన్నిటా మరొక రూపంలో కనిపిస్తుంది. కళ్లల్లో యింకొక వెలుగు కానవస్తుంది.

కొందరు స్త్రీలు, అందర్లా కాదు; ఎక్కువకాలం వుండే ట్టు అందాన్ని కాపాడుకుంటారు."

"సౌందర్యాన్ని కాపాడుకోవడం ఒక సంస్కృతి. వాళ్ళ కది తెలుసును. కొందరు ఆడవాళ్లు వొళ్లువంచి పనిచేస్తారు. ఎప్పుడూ ఆనందంగా వుంటారు. కష్టంవచ్చినా సుఖం వచ్చినా ఒకేలాగుంటారు. ఈ స్వభావం అందరికీ వుండదు. తాత్వికుల్లా వుండడం కష్టం. నీ సౌందర్యాన్ని నువ్వు కాపాడుకోవాలంటే ఇంట ముగ్గిపోకూడదు. బయట గాలీ •వెల్తురూ సోకాలి; హాయిగా తిరగాలి. నడవాలి. పనిచేయాలి; కష్టపడాలి; తాత్విక స్వభావాన్ని అలవర్చుకోవాలి. ఈ లోకపుక్రీనీడలు మీద పడి కృంగదీయకుండా ఉత్సాహాన్ని ఎక్కువ చేసుకోవాలి."

"స్వేచ్ఛావాతావరణంలో సంప్రదాయాలలో పుట్టి పెరిగినవాళ్ళు పెళ్ళి చేసుకుని పురుషులకెందుకు అమ్ముడు పోవాలి?"

"వివాహం జీవితంలో అతిముఖ్యం. దేహసౌందర్యాన్ని కాక నీకళ్ళల్లో వెలుగును. మాటల్లో మాధుర్యాన్ని పెదవుల సౌందర్యాన్ని చూసి ప్రేమించే పురుషుణ్ణి వివాహం చేసుకో వాలి!"

"బాగుంది. అలాంటి పురుషుణ్ణే, స్త్రీ వివాహం చేసు కుందనుకుందాం. చేసుకున్న కొంతకాలానికి ఇద్దరికీ పడలేదు. భర్తంటే భార్యకు అయిష్టం; అసహ్యం. అయినా కలకాలం అతనితోనే ఆమె పడివుండాలికదా! ఎలా వుండగలుగుతుంది?"

"నేనంత స్పష్టంగా సమాధానం చెప్పలేను...నా మాట వేదవాక్యం కాదు."

"అలాంటి పరిస్థితుల్లో స్త్రీ మనోభావాలు ఎలా వుంటాయో? ఆమె ఎంత బాధపడుతుందో!"

"మన దేశపు స్త్రీలలో చాలామంది అటువంటి పరిస్థితులు వచ్చినా ఏమీ అనుకోరు. సర్దుకుపోతారు! అది మామూలుగానే కనిపిస్తుంది. బాధలు భరించక తప్పదనుకుంటారు. అందుకే పుట్టామనుకుంటారు."

"అన్ని జన్మల్లోకి స్త్రీ జన్మ రోత! మన దేశంలో సామెత వుండనేవుంది. అబద్ధాలాడితే ఆడది పుడుతుంది. అంతే కదూ?"

"అన్ని జన్మల్లోకి నరజన్మ గొప్పది. స్త్రీ పురుషు,లిద్దరూ నరులే! ఇంతకీ స్త్రీ పురుషులిద్దరూ ఈడూ జోడూ చూసుకుని ప్రేమించి పెళ్ళి చేసుకున్న తరవాత ఒకరిమీద ఒకరికి అసహ్యాం ఎందుకు కలుగుతుంది? భర్త ముసలివాడై, భార్య యవ్వనంలో వుంటేకదా!"

"అనేక కారణాలవల్ల, ఆలుమగలికి సరిపడకపోవచ్చును"

"కారణాలకి మంచిచెడ్డలు వుండవా?"

"పోనీయండి. భర్త కుష్టువాడయితే; దీర్ఘవ్యాధిగ్రస్తుడై వికలాంగుడైతే; వికలమనస్కుడైతే; పిల్లలు వున్నాసరే, భార్య భర్తని విడిచిపెడితే; భర్త ఏంచేయాలి, పిల్లలు ఏంకావాలి?"

"ఒకర్నొకరు విడవక ఆ బాధంతా భార్యా భర్తలిద్దరూ భరిస్తారనుకుంటాను!"

"అలాకాక భార్య, భర్తను విడిచిపెడితే?"

"అనుభవిస్తాడు!"

"కాదు; అనుభవిస్తుంది!"

"భార్యను భర్త విడిచిపెడితే"

"ఎవరు ఎవర్ని విడిచిపెట్టినా వాళ్లు నిరాశ్రయులు కదా?"

"నిరాశ్రయులు బతికేందుకు ప్రభుత్వం వసతి కల్పించాలి!"

జమీందారు ఆమెను ఎత్తుకుపోవాలని ప్రయత్నించాడు; ఆమె అతన్ని ఛాకుతో పొడిచింది. కవికి దెబ్బలు తగిలాయి. నెత్తురు కారుతోంది. డేగబారినుండి తప్పించుకున్న పిట్టలాగ ఆమె ఇంటికి పారిపోయింది. కొండమీద దొర్లుతున్న కవిని రిక్షామీద ఇంటికి తీసుకొచ్చారు. గుర్రంమీద పోతూవుంటే జమీందారును ఎవరో దొంగలు పొడిచారనే వార్త ఆ మర్నాడు ఊళ్లో పొక్కింది.

నైతిక ధర్మం వేరు; మనోధర్మాలు వేరు. మతం; ఆశయాలు; అభిప్రాయాలు.

సౌదామినికి అన్నీ అవాంతరాలే. అవి జన్మతోనే వచ్చిపడ్డాయి. తన తల్లి జన్మ రహస్యంకూడా ఆమెకు తెలుసును.

# చిత్రాంగి*

## మొదటి అంకము

### ఒకటవ రంగము

నెల్లూరు పట్టణమున రాచనగరను ఆనుకునివున్న ఉద్యానవనము.

[కార్తిక పౌర్ణమి. తోటలో గున్నమామిడి గుబురులు. ఉత్తరదేశపు సాధువువేషమున రాజరాజున్నూ, విదూషకుడున్నూ వొక గున్నమామిడి చేరువను నిలబడి వుందురు.]

విదూషకుడు : అర్ధరాత్రివేళ అంకమ్మ శివాలని, ఎంతసేపు మనకీ తారట్లాట? కాళ్లు తోడుకుపోతున్నాయి. అబ్బెబ్బె ఇలాంటి అడ్డసుడివ్యవహారం నాకు బొత్తిగా పడదు. ఈపాటికి షడ్రసోపేతాలతో భోజనం చేసి, వెన్నెట్లో పూల పరిమళాలు, వీణాగానం ఆస్వాదిస్తూ ప్రభువులు నేను చెప్పే ముచ్చట్లు వింటూ శిరః కంపనం చేస్తూవుంటే అదీ సొగసు.

రాజరాజు : కడుపునిండా కబుర్లే నీకు. వేరే విందులు ఎందుకు?

---

* మహాకవి ఆంగ్లమున వ్రాసిన చిత్రాంగి అన్న యీ నాటకం అక్కడక్కడ సగము సగముగ చిరిగిన కాగితములుగ లభించినది. నాకు యుక్తమని తోచిన రీతిని, దీని నిక్కడ అమర్చినాను.

విదూషకుడు : సరిసరి! ఆత్మారాముడు అల్లల్లాడిపోతూ వుంటే; అన్నిసుఖాలూ అమరినవాళ్లకి అనుభవించడం చేత కాదు. చేతనైన మా బోంట్లకు లాభంలేదు; ప్రభువులు ఆనందించడానికి అనుభవించడానికి నోచుకోనట్లుంది!

రాజరాజు : (నవ్వి) కడుపునిండా తినడం కబుర్లాడడం ఇంతేకదా, నీ ఆనందం ?

విదూషకుడు : కడుపునిండా వుంటేనే అన్ని ఆనందాలూ. కాకుంటే ప్రభువులు అన్నపానాదులు మాని ఎన్నాళ్లుండగలరో నాకు చూడవేడుక.

రాజరాజు : చూపులకు విందుగా అటువంటి కన్యారత్నము, ఎదట కనిపిస్తుందన్న ఆశవుంటే, ఎన్నాళ్లయినా వుంటాను.

విదూషకుడు : అలాంటపుడు, భగవంతుడు, స్త్రీలను కురూపులుగ, సృష్టించాలని నా కోరిక. స్త్రీని తలచుకుంటే, బుద్ధి గోడలు దాటుతుంది. అందుకే నాకు వళ్లుమంట. ప్రభువులు జ్ఞాపకం వుంచుకోండి. [కడుపుచూపిస్తూ] ఇన్నాళ్లకి కడుపుకొట్టారు. ముఖాముఖీయుద్ధంలో తప్ప, రాజులు, ఎవరి కడుపుమీద కొట్టకూడదు. తాము కొట్టిన దెబ్బకి, ఆత్మారాముడు గిజగిజ లాడిపోతున్నాడు. ఇంక మరి భరించలేను. కెవ్వున కేకవేద్దునా?

రాజరాజు : కేకలువేసి అందరినీ ఇక్కడికి రప్పించేటట్లున్నావ్. ఊరుకో. కొంప మునుగుతుంది.

విదూషకుడు : మహారాజులా వెళ్ళి అడగక ప్రభువుల కెందుకీ దాగుడుమూతలు? వ్యూహాలు? "నేను రాజరాజుని; నా కా పిల్లను యిస్తే సరేసరి; ఈయకపోతే, నేనే ఎత్తుకు పోతాను" అని ముక్కుమీద గుద్దినట్లు అడిగి రండి! మీమాట వింటే బాగుపడతారు. వినకపోతే చెడిపోతారు! ఏదో ఒకటి ఠక్కున తేలిపోతుంది. అంతేకాని ఈ నాన్పుడు వ్యవహారం నా కిష్టంలేదు. సాధువువేషంలో ఇలా దాగుడుమూత లాడు తూంటే ఎపుడో ఒకప్పుడు మనకొంప మునిగిపోతుంది!

రాజరాజు : ఉండు! ఉండు! ఎవరో వస్తున్నట్లుంది?

విదూషకుడు : ఆ కన్యారత్న మేనా ?

రాజరాజు : (గుబురులమధ్య కొద్దిగా ముందుకు కదలును) మాట్లాడకు.

విదూషకుడు : అట్టే కదలవద్దు; దారి బాగులేదు.

రాజరాజు : నిక్షేపంలా వుంది. భయపడకు.

విదూషకుడు : పురుగూ పుట్రా వుంటే?

రాజరాజు : మనిషికిన్ని చావులు లేవు...

విదూషకుడు : పురుగూ పుట్రా కాదులెండి!

రాజరాజు : మరి?

విదూషకుడు : ఆడనాగు!

రాజరాజు : పగబట్టదులే. భయపడకు!

# రెండవ రంగము

[ఉద్యానవనములో పూజామంటపము. బంగరుతులశి కోటచుట్టూ జ్యోతులు, పూజాద్రవ్యములు, కొబ్బరి, చెరకు, మధుర పదార్థములు. ఒక చిత్రాసనముమీద పూజా బ్రాహ్మణుడు, తివాచిమీద కొందరు బ్రాహ్మణులు ఆసీనులై వుందురు. చిత్రాంగి పట్టుచీరె ధరించినది. తడి ఆరిన ఆమె జుత్తు భుజముఃమీద పడుతున్నది. చెంతను చెలికత్తెలు.]

రంగనాయకి : ఆ ప్రసాదాలు, తాంబూలాలు స్వయంగా బ్రాహ్మలకి, మీచేతులతో మీరే ఇవ్వండమ్మా!

(చిత్రాంగి ఆ విధముగా చేయును. బ్రాహ్మణులు ఒకరొకరే వెళ్ళిపోదురు.)

మీనాక్షి : (పరిచారికలను వెళ్ళిపొమ్మని చేతులతో సైగ చేయగా అందరూ వెళ్ళిపోదురు) కోవెలకు వెళ్ళరండి! (చిత్రాంగితో) మహారాజకుమారికావారు మనసులో ఏం కోరిక వుందో, కోరుకోవాలి. అడిగితేనేకాని అమ్మయినా పెట్టదు. మనసులో ఏముందో, బ్రహ్మకైనా చెప్పకపోతే ఎలాగ? చేతులు జోడించి ఒక్కవరం కోరుకో.

చిత్రాంగి : నాకే కోరికలు లేవే!

మీనాక్షి : అబద్ధాలాడకు పిల్లా, ఆడపిల్లలు పుడతారు! దేవుడికి ఆగ్రహం వొస్తుంది. నీ మనసులో ఏంవుందో చెప్పవూ?

చిత్రాంగి : ఉహుఁ!

మీనాక్షి : అనుగ్రహించు!

చిత్రాంగి : ప్రపంచం తలక్రిందులయినా చెప్పను.

మీనాక్షి : చెప్పక, తలకిందులు చేస్తావన్నమాట!

మాలతి : నీప్రాణస్నేహితుల్ని నువ్వే నమ్మవన్నమాట!

మీనాక్షి : ఎవరికీ తెలియదనుకుంటోంది.

మాలతి : ఇక్కడ ఎవరూ లేరు. ఫరవాలేదు. చెప్పవమ్మా!

మీనాక్షి : నువ్వెంత వెర్రిదానివే, మాలతీ! రాజకుమారిక మనసు ఎటు తూగుతున్నదో, లోకానికి తెలియదనుకుంటున్నావా?

మాలతి : అయితేనేవీఁ! దేవుడికూ్కడా చెప్పనంటోంది.

మీనాక్షి : కోరకుంటే దేవుడైనా వరమీయడు.

చిత్రాంగి : వేరే కోరుకోవడం దేనికి? నా కోరికలు భగవంతుడికి తెలియవా?

మీనాక్షి : తెలిస్తేమాత్రం? భక్తులు వేడుకోనిదే, భగవంతుడు ప్రసన్నుడు కాడు.

మాలతి : అహంకార మనుకుంటాడు.

చిత్రాంగి : నిజమా; హాస్యమా ?

మీనాక్షి : నిజం. ముచ్చెం ముమ్మాటికీ నిజం.

మాలతి : చేతులు జోడించి 'హృదయవాంఛ నెరవేర్చు తండ్రీ' అని ప్రార్థించు.

చిత్రాంగి : అలాగే ప్రార్థిస్తాను.

మీనాక్షి : అయితే దేవుడు దయదలుస్తాడు

[చిత్రాంగి చేతులుజోడించి ధ్యానముద్రలో వుండును.]

మాలతి : మనసులో గొణుక్కుంటే ఎలాగ?

మీనాక్షి : ఆ మాట వినడానికి, మాకు ప్రాప్తిలేదా!

మాలతి : మంచిమొగుడు కావాలని కోరుకో. అనవమ్మా తల్లీ, బయటికి అను!

చిత్రాంగి : మంచి... యోగ్యమైన భర్తను ప్రసాదించు తండ్రీ!

మీనాక్షి : మాలతీ!నవమన్మధుల్లాంటి మగడు కావాలటే !

మాలతి : సిగలో పూవు వంటివాడు!

మీనాక్షి : ఆడపిల్లల కోరికే అది. అందులో అబ్బురమేముంది?

మాలతి : అందుకే, పేరు చెప్పి కోరుకోమను.

మీనాక్షి : పోనీ నేను చెబతానుండు.

మాలతి : నువ్వుచెప్పినా, నేను చెప్పినా, సారంగధరుడే కదూ!

మీనాక్షి : ఎవరు చెప్పినా! [ఇద్దరూ పకపక నవ్వుదురు]

చిత్రాంగి : [వెనక్కి తిరిగి కోపముగా చూస్తూ] ఏమి విరగబాటే! [వెళ్లిపోవును]

మీనాక్షి : రాజకుమారికకు కోపం వచ్చిందే!

మాలతి : మీనా! నీ కోరిక ఏమిటే?

మీనాక్షి : నాకోరిక తీర్చడం దేవుడి తరంకాదు.

మాలతి : విడ్డూరంగానే మాట్లాడతావ్!

మీనాక్షి : మరి నా కోరిక తీరడం మాటలా? మా ఆయన బుద్ధి వంకర.

మాలతి : పోగొట్టాలంటావ్!

మీనాక్షి : దేవుడితరం కాదంటాను.

మాలతి : దేవుడు కాస్త కనికరించకూడదా?

మీనాక్షి : అసలు దేవుడికి న్యాయంవుంటేకద! మన ప్రభువుల్లాగే, సబబూ సందర్భమూ లేదు.

మాలతి : ఏమో?

మీనాక్షి : భర్త అందగాడైతే, భార్య కురూపి. భార్య అందగత్తె అయితే, భర్త కురూపి. ఎటుచూసినా, ఈడూ జోడూ లేని పెళ్లిళ్లు. ఎలా కుదురుస్తాడో చూడు.

మాలతి : భగవంతుడు అన్యాయం చేస్తున్నాడటే?

మీనాక్షి : కాకపోతే, అందమైన మొగుడు, నీ కెలా దొరుకుతాడే?

మాలతి : నీ భర్త, అందగాడుకదూ?

మీనాక్షి : నా నోటితో అనకూడదు. ఆడదానికి భర్తే, దైవం.

మాలతి : ఎప్పట్నుంచో ఆ పూజలు?

మీనాక్షి : మూడుముళ్లూ పడినప్పటినుంచీ.

[కొందరు పరిచారికలు ప్రవేశింతురు.]

ఒక పరిచారిక : మిమ్మల్ని రమ్మని మహారాజకుమారికావారి శలవయింది.

మీనాక్షి : (పరిచారికలతో) ఆ పూజాద్రవ్యాలు పట్టుకు పదండి.

[అందరూ నిష్క్రమింతురు. ప్రవేశం: రాజరాజు, విదూషకుడు.]

రాజరాజు : తనకంటె అందమైన మోము, ఎదట వుంటున్నపుడు, పైకి తొంగిచూడడానికి, చంద్రుడికెలా, మొహం చెల్లింది!

విదూషకుడు : చంద్రబింబము కంటె, తెల్లగా, గుండ్రంగావుండే ఆ కొబ్బరిముక్కల్ని లోపలికి పట్టుకుపోయారుకదా, రాజా! ఇంక పైకి తొంగిచూడడానికి చంద్రుడికి సిగ్గెందుకు?

రాజరాజు : చంద్రబింబంకంటె మిన్నకదా, ఆ పిల్ల మోము! నేనుచూసింది నిజమా అబద్ధమా? ఆ గులాబిరేకుల వంటి పెదవులు...

విదూషకుడు : వర్ణించి ఏమి ప్రయోజనం, మీకు తక్కనపుడు.

రాజరాజు : ఎందుకు తక్కవు?

విదూషకుడు : ఆ భాగ్యం సారంగధరునిది; మీది కాదు.

రాజరాజు : ఆమె కన్య! నేను పెళ్ళాడడానికి అభ్యంతరం ఏముంది?

విదూషకుడు : ప్రభువులు పరాకు చిత్తగిస్తున్నారు! కొడుక్కి చూసిన సంబంధం!

రాజరాజు : స్థిరపడలేదుకదా?

విదూషకుడు : ప్రభువుల దయ వుంటేకదా!

రాజరాజు : పీటలమీద పెళ్ళిళ్లు ఎన్ని తప్పిపోవడం లేదు! దేశదేశాలు వెతికించి, త్రిలోకసుందరిని తెచ్చి నా కుమారునికి వివాహం చేస్తాను. ఇంతకీ సారంగధరుడు, చిత్రాంగిని చూడలేదు. చూడనపుడు చిక్కేముంది? తండ్రి ఆనందాన్ని, కొడుకు కాదంటాడా?

విదూషకుడు : తర్కం వుంటే. యముడితో వాదించి, పంతం నెగ్గించుకోవచ్చును. మొండివాడు, రాజుకంటె బలవంతుడు!

రాజరాజు : అయితే ఇప్పుడు ఏంచేద్దాం, బలవంతుడా!

విదూషకుడు : అడ్డురాకండి; అంతేచాలు!

రాజరాజు : ఎవరికి అడ్డు?

విదూషకుడు : నాకేలెండి! ఎలాగో ఒకలాగ ఒంటింట్లో దూరతాను. వంటబ్రాహ్మడితో కత్తుకలిపి, నాపని నేను చూసుకుంటాను.

రాజరాజు : మెళ్లో జంధ్యపుపోగు ఇన్నాళ్ళకి పనికి వచ్చింది. అది వున్నన్నాళ్లు, నీకు కందాకు లోటులేదు. అన్నట్టు ఈ ఉంగరం, మీనాక్షికి ఆనవాలు చూపించి, ఇటు రమ్మను!

విదూషకుడు : అమ్మో! అది...

రాజరాజు : పెద్దపులా? అదిగో ఆ గుబురులమధ్య పొంచివుంటాను! త్వరగా రమ్మను!

# మూడవ రంగము

[చిత్రాంగి, గద్దెమీద కూర్చొని వుండగా, ఇరుపక్కల, ఇద్దరు ఆడపిల్లలు, ఎదుట మాలతి, మల్లిక, జ్యోతి, మరికొందరు పరిచారికలు నిలబడి వుందురు.]

చిత్రాంగి: స్నేహం నటిస్తూ, కుట్ర పన్నినవాళ్ళకి ఏ శిక్ష విధించాలో, చెప్పండి చూద్దాం!

మల్లిక: చేతులకి బేడీలు తగిలించడమే.

చిత్రాంగి: నేరస్థులెవరో చెప్పండి.

మల్లిక: ఎలా చెప్పడం?

చిత్రాంగి: వాళ్ళమొహం చూస్తే తెలిసిపోదుటే!

మల్లిక: కనుక్కోవడం కష్టం.

చిత్రాంగి: మాలతి ఏదో చెప్పబోతున్నట్లుంది!

మాలతి: దయకు పుట్టినిల్లు, మహారాజకుమారికా వారు, నేరం మోపుతూ వుంటే, ఏంచేయగలం?

జ్యోతి: ఇంతకీ చేసిన అపరాధం?

చిత్రాంగి: ఒకరు చెప్పనక్కర్లేదు; నేరంచేసినట్లు చేసినవాళ్ళ ఆత్మే చెబుతుంది.

మాలతి: శిక్ష విధించేముందర, తానుచేసిన నేరంఏమిటో నేరస్థుడు వినాలి.

చిత్రాంగి : ఇలా దగ్గరకు రా; విందువుగాని,

మాలతి : [దగ్గరకు వెళ్లును]

చిత్రాంగి : సంకెళ్ళు వేస్తాను: నీచేతులిటు చాపు.

మాలతి : (మోకాళ్ళపై నేలను ఆనుకొని, చేతులు యిచ్చును.)

చిత్రాంగి : (ఓదార్పుగా) పాపం, నువ్వుచేసిన నేరానికి, ఈ చేతులు శిక్ష అనుభవిస్తున్నాయ్. (అంటూ తన చేతిని వున్న బంగారపు గొలుసు, ఆమెచేతికి పెట్టును.)

మాలతి (ఆనందముతో) రాజకుమారిక మాట, జవదా టితే, అంతే శిక్ష.

చిత్రాంగి : ఏది, అదేదీ ? నీకు తోడుదొంగ ! (నలు ప్రక్కలచూసి) లేదు; ఇక్కడ లేదు, వెళ్లి తీసుకురండి !

జ్యోతి : ఎవర్ని, రాజకుమారికా ?

[ప్రవేశం : మీనాక్షి]

మీనాక్షి : రాజకుమారిక వారి దర్శనం చేతామని, ఎవరో బ్రాహ్మడు ఇందాకట్నుంచీ అవతల వున్నాడు.

చిత్రాంగి : ముందు నువ్వు రా, తంత్రగొట్టూ! (చుర చుర చూచును.)

మీనాక్షి : (కొయ్యబారిపోయి నిలుచును.)

మల్లిక : ఎందుకు మాలతీ! మీనాక్షి అలా కొయ్యబారి పోయింది? నేరం చేసినవాళ్ళు యిట్టే తెలిసిపోతారు !

మీనాక్షి : (సర్దుకొని) రాజకుమారిక కంటికి, మేం ఏంచేసినా, నేరంలాగే కనిపిస్తుంది ! ద్రోహంలాగే తోస్తుంది!

మల్లిక : పిల్లి, కళ్లు మూసుకుని పాలు తాగుతూ, ప్రపంచమే కళ్లు మూసుకుందనుకుంటుంది! చేసిన అపరాధం ఒప్పుకుని, క్షమించమని లెంపలు వేసుకో.

చిత్రాంగి : నిన్ను పుట్టించిన దేవుడు దిగివచ్చినా, మీనాక్షి ఎన్నటికీ అలాగ అంగీకరించదు. మల్లికా! మిత్రద్రోహులకు ఏమిటే శిక్ష?

మల్లిక : కొరడా దెబ్బలు!

చిత్రాంగి : చేసిన తప్పు చెబితే పోతుంది. ఒప్పుకున్న నేరానికి శిక్ష తక్కువ. ఏం మీనా?

మీనాక్షి : (తలవంచి నమస్కరించును.)

చిత్రాంగి : ఇలారా!

మీనాక్షి : (దగ్గరకు వెళ్ళి) అభిమానవుంటే తప్పులు, ఒప్పులు; లేకపోతే, ఒప్పులు, తప్పులు. దయగలవాళ్లకు ఏదిచేసినా సేవ. లేనివాళ్ళకు ఏమన్నా నేరమే!

చిత్రాంగి : (తన మెడలోని ముత్యాలహారము తీసి, ఆమె మెడలో వేసును) అయితే, నీ సేవకు మెచ్చానే, మీనా!

మీనాక్షి : (తలవొంచి, చిత్రాంగి పాదములను కన్నులకు అద్దుకుంటూ) రాజులకు రాజు, మా చిత్రాంగిని త్వరలోనే...

చిత్రాంగి : అదిగో, మళ్ళీ!...ఎవరే వచ్చారన్నావ్, మీనా!

మీనాక్షి : ఎవరో బ్రాహ్మడు! అమాంతంగా, నూరు లాడూలు తిని చూపిస్తానని పందెం వేస్తున్నాడు.

చిత్రాంగి : తినలేకపోతే ?

మీనాక్షి : కొరడాతో కొసరి కొసరి వడ్డించుకు తింటాడు.

చిత్రాంగి : అయితే పిలు; మాలతీ ! లాడూలు తీసుకు రండి !

[మీనాక్షి, పరిచారికలు నిష్క్రమింతురు]

మల్లిక : వంద లాడూలు, ఒక్కసారే తింటాడూ ? కడుపా, చెరువా ?

చిత్రాంగి : బాగా తినేవాడికి, పెడితేనే, సంతృప్తి.

[పరిచారికలు వెండి పళ్లెరములతో మిఠాయి తెచ్చి, ఆసనము వేసి, ఆకులో వడ్డింతురు.]

విదూషకుడు : (ప్రవేశించి) రాజకుమారికను రారాజు వరించుగాక !

చిత్రాంగి : అంతా కూడబలుక్కున్నట్లు, ఇవాళ, అందరూ నా పెళ్ళిమాటే మాట్లాడతారేమే, మల్లికా !

మల్లిక : అందుకు, ఆయనక్కూడా, బహుమతి ప్రదానం చేస్తారా ?

చిత్రాంగి : కూర్చున్న చోటునుంచి లేవకుండా, వంద వుండలూ తినలేకపోతే, అంతే ఔతుంది !

విదూషకుడు : ఏం శిక్ష విధిస్తారో రాజకుమారికావారు ! తమకు జాలి మిక్కుటమని విన్నాను !

చిత్రాంగి : ఎన్ని వుండలు మిగిలిపోతే, అన్ని కొరడా దెబ్బలు; తినేదాకా, కొట్టడమే !

విదూషకుడు : కొరడాతో కొడితే, ఆకలి పుడుతుందా?

చిత్రాంగి : ఆకలి పుట్టేవరకు, ఛళ్ ఛళ్ మనడమే.

విదూషకుడు : దెబ్బలకు ఆకలి వేయడం యిప్పుడే విన్నాను. అయితే, ముందే తింటాను.

చిత్రాంగి : మాలతీ! కొరడాలు తెచ్చి మీపని మీరు కానీయండి! (సైగ చేయును.)

[పరిచారికలు, కొరడాలతో విదూషకుని కిరుప్రక్కల నిలబడుదురు.]

విదూషకుడు : దూరంగా నిలబడండి, దండుముండల్లారా! సాయంత్రం ప్రార్ధన చేయడం మరిచాను. ముట్టుకోకండి; జపం చేసుకుంటాను !

మాలతి : (కొరడా దూరముగా విదిలించి) పందెం ఓడినట్లా ?

విదూషకుడు : బ్రాహ్మణ శాపం! జ్ఞాపకం పెట్టుకోండి. మంత్రించి, ఉదకం మీద జల్లానంటే, ఏమౌతారో !

మల్లిక : ఏమౌతాం ?

మాలతి : త్వరగా, కళ్ళు మూసుకుని జపం ప్రారంభించండి !

మల్లిక : రుద్రాక్షు పిల్లిలాగ !

విదూషకుడు : మీకు ముందు శాపంయిచ్చి, మరీ ముక్కు మూసుకుంటాను. చేతిలో కొరడా చప్పుడు వినిపించిందా, మీ భర్తలు బ్రహ్మరాక్షసు లయిపోతారు; ఇలాంటి లాడూలు దొరకకపోతే, మీ బుగ్గల్నే తినేస్తారు! (మల్లిక, మాలతీ దూరంగా తొలగిపోవుదురు.)

చిత్రాంగి : ఊరుకోకూడదు, నేరస్థుల్ని దండించ వలసిందే.

విదూషకుడు : బ్రాహ్మణులకి నేరదండన లేదు.

చిత్రాంగి : ఆడినమాట తప్పినవాడు బ్రాహ్మణుడు కాడు!

విదూషకుడు : ఆడినమాట ఆడకుండా, నవ్వించడమే నా ఉద్యోగం; అందుకే మహారాజులు నేనంటే చెవి కోసు కుంటారు!

చిత్రాంగి : మీ హాస్యోక్తులకు ఆనందించేవారెవరో ?

విదూషకుడు : లోకమంతా ఉబ్బితబ్బిబ్బయి పోతారు!

చిత్రాంగి : అహఁ!

విదూషకుడు : ఆ మాటే, మా ప్రాణస్నేహితుడు రాజ రాజుతో అంటూవుంటాను; ఆయనగారి ఏలుబడి ఆంధ్రదేశంలో మాత్రమే. ఈయనగారి రాజరికం అన్నిచోట్లా చెల్లుబడి అవు తుంది.

చిత్రాంగి : రాజరాజు మీ స్నేహితులా?

విదూషకుడు : అవును, రాజకుమారిక; అవును; చిన్న తనంలోనే నా నేస్తం కుదిరినందుకు ఆయన జన్మ తరించిందం టాను!

మాలతి : రాజరాజు చెంత, లాడూలు తింటూంటే, ఒక సారి ఈయన్ని చూసినట్లు జ్ఞాపకం!

విదూషకుడు : అవునే పిల్లా! అవును! మోదకములు మనకుప్రీతి!

చిత్రాంగి : మీనా! మీనా!

మల్లిక : అవతల వుంది; పిలుచుకు వస్తాను. [వెళ్లును]

చిత్రాంగి : మాలతీ! ఈయన ఎవరో తెలియకుండా...

మాలతి : ఎంత జడిపించాం!

విదూషకుడు: వీళ్లని మీచెలికత్తెలు కనక ఊరుకున్నాను; లేకపోతే బొమ్మలుకమ్మని శపించివేతును!

చిత్రాంగి : [ఆసనము చూపి] చిత్రాంగి నమస్కరిస్తున్నది!

విదూషకుడు: రారాజు, భర్తృదారికను యీమోదకము లుండునంత శీఘ్రముగా వరించుగాక! *

చిత్రాంగి : ఎవరు? రాజరాజా!

విదూషకుడు : అవును. రాజులకు రాజు; రారాజు, రాజరాజు!

చిత్రాంగి : [తుళ్లిపడి] మహాదోషం! రాజరాజు మాకు కన్నతండ్రి వంటివారు!...

* * *

ఒక తోటలో ఒకగుడారము. విదూషకుడు ఒక రాతి తిన్నెపై కూచుని వుండును.

విదూషకుడు : రాజులవద్ద కొలువు చేసేవాడికి తన ఉద్యోగం ఎపుడూడుతుందో తనకే తెలియదు. వారికి కోపం వస్తే మనకు ప్రాణాంతకం. అయితే వొకటీ. ఏమాటకామాటే చెప్పుకోవాలి. మా ప్రభువులకోపం తాటాకుమంట. ఆట్టేసేపు వుండదు. తమకు కోపం వచ్చినందుకు, ప్రభువులు ఎప్పుడో ఒకప్పుడు ఉపకారం చేయకపోరు. ఇపుడు ప్రాణం పోతూవుంటే

* ఇది, మహాకవి తెలుగున వ్రాసిన వాక్యము.

ఎపుడో ఉపకారం జరుగుతుందని, అందాకా బతకడం కష్టం. మనం బతికుండకపోయినా, మన దారా పుత్రాదులకు మేలు జరుగుతుందికదా అని అదో సంతృప్తి. కాని అదెవరికి క్కావాలి? ఇంతకీ దారాపుత్రాదు లెవరు? శంకరుడు ఏమిటి చెప్పాడు. "నీభార్య ఎవరు? నీ పుత్రుడు ఎవరు? అంతా మాయ. నీతో ఎవరూ రారు!" అంతా మాయ అయినప్పుడు ఎవర్ని పట్టుకుని దేవుళ్లాడడం! నాకు తెలివితేటలంటూ వున్నాయి కనక సరి పోయింది కానీ, లేకపోతే ఈపాటికి నాపీక అరవై వుంజీలసార్లు తెగిపోయి వుండును! ఆ స్థానాలమ్మట అర్రులు చాపడం వెర్రి తనం. రాజులమెప్పుకు అబ్బురమేముంది! ఇవాళొకడొస్తాడు; రేపింకొకడు పోతాడు! ఒకడు స్థానభ్రష్టుడు కాకమునుపే, ఆస్థానాన్ని ఇంకొకడు ఆక్రమించడానికి తయారు! ఒకడు చావడం తరవాయి, వాడు చావకముందే, మరొకడు హాజరు! పాటిమీద గంగానమ్మకు కూటిమీదే లోకం. బుద్ధిమంతులు దారి తప్పినచోట నావంటి బుద్ధిహీనులు దారితప్పక, బుద్ధిగా వుండాలి! రాజ్యానికి ఆరుగురు సహజ శత్రువులు వుండనే వున్నారు. వీటికితోడు, స్త్రీ కూడా ఎందుకు! అందుకే శంక రుడు స్త్రీ బారినుంచి తప్పించుకు తిరిగాడు. ఇక రాజ్యానికి స్త్రీ దాపరిస్తే, జరిగే చేటు అంతా ఇంతా కాదు. [కుడివైపు తొంగిచూస్తూ] అదిగో వకుళవస్తోంది! నాపసాని!

* * *

[అంతఃపురములో ఒక పడకగది. గదిలో ఒక వైపు పట్టుపాన్పు. చిత్రాంగి ఒక ఆసనముపై, కూర్చుని వుండును. పరిచారిక, చెంతను నిలబడి, ఆమె వొంటినున్న నగలను, తీయు చుండును. కొంచెం దూరంగా బంగారపు పంజరములో ఒక

'మైనా', ఇంకొకవైపునుంచి, చడిలేకుండా రాజరాజు ప్రవేశించి, పరిచారికను వెళ్లిపొమ్మని, లాలనగా చేతులతో సైగ చేయును. పరిచారిక అవతలకి వెడుతూ, తొందరపాటులో, చేతనున్న ఆభరణమును క్రింద పడవేయును.]

చిత్రాంగి : ఏమిటే అది! [మోమెత్తి చూచును. రాజరాజు కనిపించగా, గతుక్కుమని తత్తరపాటుతో లేచి నిలబడి తలవంచుకొనును.]

రాజరాజు : [చెంతకు సమీపించి] మోమెత్తిచూడవా?

చిత్రాంగి : [అదే భంగిమలో] మీనా! మీనా!

రాజరాజు : నీ చరణసేవ చేయడానికి, రాజరాజు వుండగా మీనా నెందుకు పిలుస్తావ్!

చిత్రాంగి : పరమేశ్వరుడా! ఏమిటి ఇదంతా! [అంటూ ద్వారమువైపు అడుగులు వేయును.]

రాజరాజు : ప్రాణేశ్వరీ! అటు ఎక్కడికి వెడతావ్! [అతను ఆమె చేతిని పట్టుకొనును. చేతిని విడిపించుకొందుకు ఆమె పెనగులాడును.]

మైనా : ఆగు! రాజా! ఆగు!

రాజరాజు : ఎవరది! రాజరాజు అధికారాన్ని ప్రశ్నించేవాళ్ళకి ఎన్ని గుండెలుండాలి! [పంజరములోని పిట్టను చూసి ఆశ్చర్యచకితుడై] ఒహో! నువ్వా! ఊరుకో! ఊరుకోకపోతే, నీనోట చక్కెరవేసి, ఉక్కిరి బిక్కిరి చేయగలను!

• • •

మీనాక్షి : ముసలివాళ్లు ప్రేమిస్తే నిండుమనసుతో ప్రేమిస్తారు. ఆ ప్రేమకు మరి తిరుగులేదు. అందులో భార్య

చక్కని చుక్కయితే, ఇక అడిగావూ! ఆ,వలపు ఏమని వర్ణించను! ఆ కాపీనం ఎంతని చెప్పను! ముద్దు చెల్లిస్తే, ముసలి మగడే చెల్లించాలి. ప్రణయానుభవం, నేర్పూ వున్న రాజరాజు నిన్నుచూసి మోహించి, ఎన్ని పన్నుగడలో పన్ని అగచాట్లుపడి, నీ కోసం తన సర్వస్వమైన కీర్తిని పణంపెట్టాడు. తాను అప్రతిష్టపాలై నీ ప్రణయం కోరుకున్నాడు. అతని ప్రేమ ఎంత గొప్పది! రాజరాజువంటి రసికుణ్ణి, కనుసన్నలలో తిప్పుకోవడంకంటె, నీ కింక కావలసిందేముంది!

చిత్రాంగి : విషం, విషమే; ఎంత చక్కెర కలిపితే అది అమృతం అవుతుంది! ముద్దుచెల్లిస్తే ముసలిమగడే చెల్లించాలి కదూ! పాపం, ముసలిమగణ్ణి పెళ్లాడక పోయావూ?

మీనాక్షి : పెళ్లాడితే బాగానే వుండేది. వయస్సు మళ్లిన వాళ్ళకి లోకజ్ఞానం వుంటుంది. తమకు ఏది యిష్టమో తెలుస్తుంది; ఎందుకు యిష్టమో తెలుస్తుంది. హుఁ, నా భర్త యువకుడే; అయితేనేం; నా ముద్దు ముక్కలయినట్లే వుంది! ఎప్పుడైనా ఇంటిపట్టున వుంటేనా?

చిత్రాంగి : కాని సారంగధరుడు అలాంటివాడు కానట్టున్నాడే!

మీనా : ఏమో, ఏ పుట్టలో ఏ పాముందో ఎవరికి తెలుసును! గొప్ప అందగాడౌనట!

చిత్రాంగి : మంచి జ్ఞాని అని విన్నానూ?

మీనా : ఉదయమల్లా పూజలోనే వుంటాడట!

## అంతఃపురము : రాణివాసము

మీనాక్షి : రాజకుమారికా! వెళ్ళాలమ్మా! వెళ్ళక తప్పదు!

చిత్రాంగి : ఉహుఁ! నేను వెళ్ళను!

మీనాక్షి : దేనికయినా పట్టూ విడుపూ వుండాలి. నీకు తెలియనదేముంది! మంచిమగడు దొరకాలని, ఆడపిల్లలు ఎన్నో నోములు నోస్తారు. గౌరీదేవికి పూజలు చేస్తారు. తండ్రి ఎలాంటి వరుణ్ణి తీసుకువస్తాడో అని, కన్యల మనసు పరిపరివిధాల పోతుంది. దయా దాక్షిణ్యంలేని తండ్రులు, డబ్బుకాశించో, పలుకుబడి వస్తుందనో కూతుళ్ళను, పాపం, పనికిరానివాళ్ళకి కట్టబెడతారు. కాని నువ్వు ఎంత అదృష్టవంతురాలివి! ఇన్నాళ్ళకి నీనోములు ఫలించాయి. నిన్ను పువ్వుల్లోపెట్టి పూజించే సుందరుడు, సుగుణవంతుడు, రాజాధిరాజు, వెయ్యికళ్ళతో వెదుక్కుంటూ వచ్చాడు. స్వర్గందాకా వెళ్ళి, స్వర్గానందం అనుభవించక, తలుపులు దగ్గర ఎవరైనా నిలబడి పోతారా? నువ్వే చెప్పు!

చిత్రాంగి : (పంజరముచెంతకు వెళుతూ) హుఁ! స్వర్గం, స్వర్గానందం. ఎందుకు ఊరడాగ్పు, మీనా! సుగుణవంతుడు, సుందరుడు, రాజాధిరాజూ...

మీనాక్షి : కాదూ?

చిత్రాంగి : అవుననే అనుకుందాం. కాని, ఆయన ఎవరో, నే నెవరో!

మీనాక్షి : ఎవరో తెలియదూ?

చిత్రాంగి : నా మీనాక్షి ఎవరో నాకు తెలుసును, నా మాలతి ఎవరో నాకు తెలుసును. కాని ఆయన ఎవరో నాకు తెలియదు మీనా!

మీనాక్షి : ఎందుకు తెలియదు? నువ్వు తన పాలిటి భాగ్యదేవతవని నిత్యం మీ ఆయన నిన్ను తలచుకుని, మురిసి పోతూవుంటే!

చిత్రాంగి : ఇలా జరుగుతుందని, కలలోకూడా అనుకో లేదు, మీనా! స్త్రీలకు వివాహం ఒక అగ్నిపరీక్ష. అందులో మా రాచకన్యలకు అడుగడుగునా, సుడిగుండం. మాకంటె మీరే నయం! నీ మగుడు దుర్మార్గుడైతే, అతని మాటకు నువ్వు ఎదురు చెప్పవచ్చును. భయంలేదు. నీ మాట వినడూ; పోనీ, నలుగురూ చెబితే విననైనా వింటాడు. కాని, మేం, మీలాగ కాదు మీనా! ఏమాటంటే ఎక్కడ కుత్తుక తెగిపోతుందో అని గజగజలాడి పోతూవుంటాం. క్షణక్షణం మారిపోయే, రాజు మనసులో ఏముందో, పోల్చుకోవడం ఎవరితరం? రాజు అందగాడైనా, మేం అందగత్తెలమైనా, మాకే కదా దుఃఖం! రాజుకు, ఎంత మంది భార్యలుండనీ, మా పిల్లనిస్తామంటే, మా పిల్ల నిస్తామని, ఎందరెందరో ఎగబడి వస్తారు! ఇక, మేం అందగత్తెలమైతే, అడిగేదేముంది? మాలో అతి లావణ్యవతి వుందని విన భయం, రాజులకు కన్నెర్ర! ఆ అప్సరస నాదంటే నాదని ఒకరికి మించి ఇంకొకరికి పట్టుదల. పగ. ద్వేషం! కదనం లేనిదే, కల్యాణం జరగదు మీనా! ఊఁ అంటే యుద్ధం. ఆఁ అంటే యుద్ధం. యుద్ధం లేకపోతే అడవులవెంట వేట. కోటవదలి, అవతలికి

వెళ్లిన మనిషి, తిరిగి వచ్చేరకు ప్రాణాలు కుదట పడవు. ఎప్పుడు ఏమౌతారో అని బెంగ. అకాలమరణం...

మాలతి : ఏమిటమ్మా రాజకుమారికా ! నీనోటివెంట ఎన్నడూలేని ఆ మాటలు !

చిత్రాంగి : [కన్నీళ్ళతో] మీనా ! మాలతీ ! మల్లికా !

మీనాక్షి : ఎందుకు తల్లీ, ఆకన్నీళ్లు! పుట్టింట ఆడపడుచు కంట తడి పెట్టకూడదమ్మా !

చిత్రాంగి : మిమ్మల్నందర్నీ వొదిలి ఎలావుండగలనే ! కన్నతల్లిని, తండ్రిని, విడిచిపెట్టి, ఎన్నాళ్లు వుండగలనో చెప్పు. ఈ తోటలమధ్య ఈ పూలమొక్కల చెంత, ఈ మహలులో, ఈగదులలో, ఎన్నాళ్ళు ఎన్నేళ్ళు గడిపాం. పుట్టింటికి దూరంగా ఎక్కడో ఒంటరిగా, తోడూనీడా లేకుండా, జీవితమంతా ఎలా గడపగలనే మీనా ! [పంజరములోని మైనాను నిమురుతూ] పోనీ; మైనా ! నువ్వయినా చెప్పు !

మాలతి : ఎంత అమాయకురాలివి రాజకుమారికా ! ఆడదై పుట్టినతరవాత, అత్తవారింటికి వెళ్ళకుండా వుంటుందా? అత్తవారింటికి వెడితే, పుట్టింట లేననే దుఃఖం దానంతటదే పోతుంది. అత్తవారింటికి వెళుతున్నపుడు, శకుంతలతో, కణ్వుడు ఏమని చెప్పాడో జ్ఞాపకం తెచ్చుకో. "మహాచక్రవర్తి పట్టపుదేవి వౌతున్నావ్; సకల వైభవాలతో తులదూగనున్నావ్. కొద్దికాలంలోనే పనసపండువంటి బిడ్డణ్ణి కనబోతున్నావ్. ఆ ఆనందంలో, నేను నీచెంతలేనన్న దిగులు వుండదు!"అని శకుంతల్ని ఊరడించలేదూ కణ్వుడు? రాజకుమారికా! నువ్వు అత్తవారింటికి వెళ్లేక మమ్మల్ని మర్చిపోకేం ?

చిత్రాంగి : మాలతీ! నువ్వు ఎంత మంచిదానివి; ఎంత యోగ్యురాలివి. ఎంత అదృష్టవంతురాలివి! నిన్ను మనసారా ప్రేమించిన భర్త, నీ పుట్టింటికే వచ్చాడు. అత్తింట అడుగు మోపని దానివి, మాకష్టాలు నీకెలా తెలుస్తాయి, చెప్పు!

మల్లిక : ఇందులో రాజకుమారికకు కష్టం ఏముంది! పుట్టింటివారికంటె, అత్తవారు మరీ గొప్పవారు. తండ్రి ప్రభువు; భర్త, ప్రభువులకు ప్రభువు. ఇటు పుట్టింటివారు, అటు అత్తింటివారు, నిన్ను కంటికి రెప్పవలె కాపాడుతూ వుంటే అలా దిగులుపడటా వేమిటి, రాజకుమారికా! ఎంతోమంది దాస దాసీలు, స్నేహితులు, నీతో అరణం వస్తున్నపుడు, ఒంటరిదాని వయిపోతావని బెంగెందుకు నీకు ?

చిత్రాంగి : మాలతీ! నువ్వు నాతో వస్తావుకదూ ?

మాలతి : నీకంటె ఈజీవితంలో నా కింకెవరున్నారు తల్లీ! ప్రభువుల శలవు పుచ్చుకుని, నీతోనే వుంటాను!

మీనాక్షి : అదెలా వీలుపడుతుంది, రాజకుమారికా! ఆమె మగడులేనిదే, ప్రభువులకు ఒక్క నిముషం గడవదుకదా! నీతో, వాళ్ళని ఎలా పంపిస్తారు చెప్పు!

• • •

ఉద్యానవనములో ఒక మందిరము. చక్కగా అలంకరించిన పూజామంటపము. ఛత్రము కింద పీఠముపై అమర్చిన దుర్గ విగ్రహము. ప్రేక్షకులకు ఎదురుగ, ఎడమవైపునకు అభిముఖముగ, ఒక వెండి ఆసనముమీద, మతగురువు కూచుని వుండును. చిక్కుపడిన జుత్తు. చివర, ముడి మోమున బొట్టు. వొంటిని విభూతి. చేతిలో జపమాల. పట్టుబట్టలు ధరించి సారంగధరుడు, అతని చెంత సుబుద్ధి, నారాయణ ఆసీనులయి వుందురు.

గురువు : పూర్వజన్మసంస్కారం లేనివారికి సత్యము తెలుసుకొనే అర్హత లేదు. సామాన్యమానవులకు అది అగపడదు. సత్యము గుంపుకు దూరం. అల్పమైన నమ్మకాలతో కొట్టుకుంటున్న జనులకు, అది జుగుప్సాకరముగా తోస్తుంది. జడునకు అది అందని ఫలం. కించిదజ్ఞులు, అల్పదేవతలు కల్పించిన ధర్మాలు నామమాత్రమైనవి. మహాధర్మం వాటిని పాటించదు. అటువంటి మహాధర్మాన్ని మీరు అవగతము చేసుకోవాలనుకుంటే. రాజకుమార! ఇటు వినండి! •

సారంగధరుడు : జ్ఞానముకంటె ఆనందదాయకమైనది నా కింకొకటి లేదు. మహాజ్ఞానమే నాకు పరమానందము.

గురువు : మంచిది రాజకుమార! ప్రతి మాటను జిజ్ఞాసతో వినండి! మాతృస్తన్యముతోపాటు అనూచానముగా, అలవడుతున్న నైతిక భావాలను లక్ష్యపెట్టవద్దని, తృణీకరించమని, ఈ మతశాఖ,మీకు బోధపరుస్తున్నది·సామాన్య నైతికసూత్రాలు దేనిని పాపమని ఖండిస్తున్నవో, దానిని ఇది ఉత్కృష్టమని భావిస్తుంది; వాటికి ఏది నిషిద్ధమో, అది దీనికి అవలంబనీయం; శిరోధార్యం. సత్యములలోకల్లా మహాసత్యం ఇదే· రహస్యములలోకల్లా పరమరహస్యము ఇంతే. మీరు జీవితమునకు మూలమైన స్త్రీని ప్రేమించవలె; స్త్రీని, మీరు, జీవితమును ప్రేమించినట్లు కాక, ఆమెలోని, దైవమును ఆరాధించవలె. స్త్రీని ఆరాధిస్తున్న కొద్దీ, వెలుగొందే జీవనజ్యోతితో మీ ఆత్మను మీరు తేజోవంతం చేసుకోవచ్చును.

---

* ఇది చిత్రాంగి అనే ఈ నాటకమునకు మొదటి అంకము: ఒకటవ రంగము.

250

సారంగధరుడు : సరే;

గురువు : మంచీ చెడూ అనేవి ఎక్కడాలేవు. అంతా మిథ్య. లోకం ఒక భ్రాంతి. మీరు జీవించక తప్పదు కనక, జీవిస్తున్నంతకాలం, ఆభ్రాంతిని ప్రకాశవంతం చేసుకోకతప్పదు. మీరు గతించినపుడు, విశ్వమంతటా వ్యాపించివున్న శక్తిలో లీనం కావలసి వుంటుంది. శక్తి అంటే ఏమిటి? స్త్రీ! మధువు! విజ్ఞత వున్నవారికి అవి జీవితం. లేనివారికి అవే మరణం.

సుబుద్ధి : అయితే ఈ లోకంలో దుర్గ, ఏమిటి యిస్తుంది?

గురువు : దుర్గను ఆరాధించిన రాజకుమారుడు చక్రవర్తి కాగలడు!

సుబుద్ధి : [రాజకుమారుని చెవిలో] పాపం! మనం చేస్తున్నది ఆయనకి అర్థంకాలేదు;మనల్ని తన మతంతో ముడిపెట్టి ఏమిటో బోధిస్తున్నాడు. *

---

*శివశక్త్యై ఇత్యాది శ్లోకములను ఇక్కడ వ్రాయవలెనని మహాకవి నోటు చేసుకున్నారు.



---



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA115B116 |
| పుస్తకం పేరు | మాటా మంతి |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 265 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | VIB |
| లేని పేజీలు | I TO IV |
| తయారు చేసినది | Munisha |
| పేజీలు విడదీసినది | munisha |
| స్కాన్ చేసినది | Khasim |
| పరీక్ష చేసినది | PRATHYUSHA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |